# శ్రీ రామానుజ కీర్తి కౌముది

తిరుమల తిరుపతి దేవస్థానముల వారిచే సంభావింపబడిన

## శ్రీవైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వము

సచిత్రము

పదునైదవ భాగము

-: సంపాదకుడు :-

విద్యా భూషణ

ఉపన్యాసక రత్న - కవితా విశారద

ధనకుధరం వరదాచార్యులు

-: ప్రకాశకులు :-

శ్రీ రామానుజ కీర్తి కౌముదీ గ్రంథమాల

శ్రీ లక్ష్మీనారాయణ పురము

గుంటూరు - 522 006

# శ్రీ రామానుజ కీర్తి కౌముది

పదునైదవ భాగము

మొదటి ముద్రణము

వేయి ప్రతులు

యువ - ఆషాఢము

జులై 1995

రామానుజ శకము ౯౭౯

మూల్యము :-

అఱువది రూపాయలు

ముద్రణము :-

షిరిడీసాయి ప్రింటర్స్,
బ్రాడీపేట 2/1, గుంటూరు - 2

(This book is published with financial assistance of Tirumala Tirupati Devasthanams under this Scheme Aid to publish religious books)

# సమాలోచనసమితి

వ్యాకరణ విద్యా ప్రవీణ - భాషా ప్రవీణ
**శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులు, M A.**
విశాఖపట్టణము

*

న్యాయవిద్యాప్రవీణ
**ప్రొఫెసర్ . యస్ బి. రఘునాథాచార్యులు, M A., Ph D.**
వైస్ ఛాన్సలర్: రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠము
తిరుపతి

*

**కెప్టెన్ : చిలకపాటి విజయరాఘవాచార్యులు, M.A., M Ed.**
రాజనీతి విభాగాధ్యక్షులు; ఆంధ్రప్రదేశ్ గురుకుల డిగ్రీ కళాశాల
నాగార్జునసాగర్ - విజయపురి (దక్షిణము)
గుంటూరుజిల్లా 522 439

*

**డాక్టర్ : శ్రీ పెరుంబూదూరు శ్రీరంగాచార్యులు, M.A. Ph.D.**
ప్రిన్సిపాల్ - శ్రీ వేంకటేశ్వర ప్రభుత్వ ప్రాచ్య కళాశాల
పాలెమ్

*

కవికోకిల - విద్వత్కవి - కావ్యకళానిధి
**శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులు**
సాహిత్య వికాస మండలి అధ్యక్షులు
సిద్దిపేట

*

**డాక్టర్ : చింపావట్టణం శ్రీరంగాచార్యులు, M A , Ph D.**
Retd. Telugu Lecturer,
శ్రీ సాయినగర్, హైదరాబాదు - 68

*

మహోపాధ్యాయ - ఉభయ వేదాంత శిరోమణి
**శ్రీమాన్ మరింగంటి శ్రీరంగాచార్యులు, M.A, B O L.**
సంస్కృతోపన్యాసకులు
శ్రీ వేంకటేశ్వర వివేకవర్ధినీ సంస్కృత కళాశాల
హైదరాబాదు

*

కవితార్కిక కేసరి - ఉభయ వేదాంత విద్వాన్
**శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యులు, B O.L.**
వరంగల్

*

విద్యాప్రవీణ - భాషాప్రవీణ - ఉభయ వేదాంత శిరోమణి
**శ్రీమాన్ కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులు, M A.**
రిటైర్డు ప్రిన్సిపాల్ . వేద సంస్కృత కళాశాల
నెల్లూరు

*

సంగీత సాహిత్య కళానిధి - ఉభయ వేదాంత విశారద
**శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు,**
సువర్ణ హస్తకంకణ విరాజితులు
విజయవాడ

*

సాహిత్య విద్యాప్రవీణ
**డాక్టర్ : తట్టా విజయరాఘవాచార్యులు, M.A,, Ph D.**
ఉపన్యాసకులు : విశిష్టాద్వైత విభాగము
రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠము
తిరుపతి

*

'సాహిత్య విద్యాప్రవీణ'
**డాక్టర్ : సముద్రాల వేంకట రంగరామానుజాచార్యులు, M A., Ph.D.**
సంస్కృతోపన్యాసకులు : ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠము
కొవ్వూరు



శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులు

వేద విశ్వవిద్యాలయ స్థాపకులు

శ్రీ వైష్ణవ పీఠాధిపతులు

'జీయర్ ఎడ్యుకేషన్ ట్రస్టు' నిర్వాహకులు

పూజ్యపాదులును అగు

**శ్రీశ్రీశ్రీ - త్రిదండి**

## చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామివారి

## మంగళాశాసనము

ప్రియ - శ్రీమాన్ వరదాచార్య స్వామిన్ !

శ్రీ వైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వముగా - 16 భాగములలో మీరు వెలువరించుచున్న 'శ్రీ రామానుజ కీర్తి కౌముది'-'అమృత'

కళతో పూర్తి కావచ్చుచున్నందుకు - మే మెంతయు సంతసించు చున్నాము.

ఇంతటి మహా కార్యమును మీరు ఒంటరిగా నిర్వహించు చుండుట - మాకు ఎంతో ఆశ్చర్యమును కల్గించుచున్నను,అందులో పాల్గొను అవకాశము లభింపకున్నందులకు చాల చింతిల్లుచున్నాము.

మీరు సంకల్పించిన 'అమృత కౌముదీ' ప్రచురణప్రయత్నము కూడ, అచిరకాలములో సఫలము కావలెనని - మంగళాశాసనము చేయుచున్నాము.

సీతానగరము<br>15-11-1994 } చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరు

# ప్రముఖులు - ప్రశంసలు

'న్యాయ వేదాంత విద్వాన్' 　　　　　　　　　　శ్రీ వాసుదాసాశ్రమము

**తె. కం. గోపాలాచార్యులు** 　　　　　　　　　　**నడిగడ్డపాలెము**

'భక్తినివేదన' పత్రికా సంపాదకులు 　　　　　　　　22-7-1994

1) మీరు వెలువరించు "శ్రీ వైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వమునకు - 'శ్రీ రామానుజ కీర్తికౌముది' యని - ఉత్తమమైన పేరు నుంచినారు.

2) ఈ శ్రీరామానుజ కీర్తి కౌముదీ గ్రంథప్రచురణ మహోద్యమునకు - ఉత్తమ అధికారులగు సలహా సభ్యులను ఏర్పరచినారు.

3) సమర్థులైన వివిధ పండితులచే - ఉత్తమములైన, మన సిద్ధాంతమునకు సంబంధించిన వ్యాసములను రచింపజేయుటయేగాక, తాము - సంప్రదాయ బద్ధములు, పరిశోధనాత్మకములు నగు వ్యాసములను రచించి, కౌముదిలో ప్రచురించు చున్నారు

4) ఈ కౌముదీ గ్రంథమునకై - ఉత్తమ మగు కాగితమును మీరు వినియోగించుచున్నారు.

5) ఈ పొత్తములను ఉత్తమమైన రీతిలో అచ్చొత్తించుచున్నారు.

6) ఈ గ్రంథములకు - ఉత్తమమైన 'బైండింగు' చేయించుచున్నారు.

ఇట్లు అనేక విషయములలో - ఉత్తమ నిర్ణయములను మీరు గైకొని, వానిని యథావిధిగ ఆమలు చేయుచున్నారు. ఆనందముగ నున్నది.

ఈ మధ్య - నాలుగు రోజుల క్రిందట - శ్రీశ్రీశ్రీ చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు నా దగ్గరకు వేంచేసినారు. వారి సమక్షములో - ఈ

శ్రీ రామానుజ కీర్తి కౌముదిలో మీరు ప్రచురించుచున్న విషయమును విన్న వింటిని. వారును - చాల ప్రశంసించిరి ఆమోదించిరి నేను నా శక్తికొలది - కింక్ర్యాకరమును సమర్పించుకొనుచున్నాను. దేవరవారు కూడ - ఈ గ్రంథముగూర్చి మన పత్రికలో ప్రశంసించి, ఆర్థికముగ మీరు సాయపడు' దని - ప్రార్థించితిని ఒక భాగమును ముద్రించుటకై, కొన్ని వేలరూపాయలను వెచ్చింపవలసియున్నదిగదా ! ఇపుడు మనకున్న పనులలో - అంత ఖర్చుచేయుటకు అవకాశము కనుపించుట లేదు కొలదిగా సహాయము చేయుట - ఖావ్యము కాదని నాకు తెలియును ఈ మధ్య - మూడుసార్లు మన పత్రికలో - శ్రీరామానుజ కీర్తి కౌముదినిగూర్చియు, దానికై శ్రీమాన్ వరదాచార్యస్వామి వారు చేయుచున్న కృషినిగూర్చియు - మీరు వ్రాసిన విధముగా ప్రచురించితిని. తిరిగి మరియొకసారి ప్రచురింతము' - అని సెలయిచ్చిరి.

మీ రింతవరకు 14 సంపుటములను నాకు శ్రద్ధతో పంపియున్నారు. నేనేవిధముగను - నా కృతజ్ఞతను వెల్లడించుకొనయుండనైతిని. కనుక, ఇపుడు మీకు నేను పంపుచున్న ఈ కించిత్ సహకారమును (5 వందల రూపాయలను) ఈ కౌముది గ్రంథ ముద్రణకై వినియోగింప ప్రార్థన.

శ్రీమాన్ కుంటినుద్ది శేషశర్మ అనంతపురము.

శ్రీ రామానుజ కీర్తికౌముది - 14వ భాగమును ఆమూలాగ్రము చదివితిని. మీరు పొందుపరచిన 'శ్రీరామానుజ సూక్తి రత్నములు' - ఆస్తిక ప్రపన్నులు చదివి, అనుష్ఠింపదగినవి, 4 - వ వ్యాసము - రామాయణ - మహాభారముల వైశిష్ట్యమునేగాక, తన్మాతృకములు, తన్మూలకములునైన దేశభాషానువాద కావ్యముల, తత్కర్తలతోబాటు విశదీకరించుచున్నది. 6, 7, 9 వ్యాసములు - వేదాంత దేశికుల గ్రంథాలయ మందిరమునకు - ప్రవేశ గోపుర ద్వారములుగా నున్నవి 8, 12 వ్యాసములు - తెలుగు చదువరులకు దేశికుల సంస్కృత గ్రంథ సాహిత్య రసమును గ్రోలించుచున్నవి 11 - వ వ్యాసము - పరితలకు - ఆ యా క్షేత్ర

ముల, క్షేత్రనాయకుల స్వరూపములను కనులకు ప్రత్యక్షీకరించుచున్నవి. పలు మాట లేల ? అన్నియు హృదయానందకరములే.

శ్రీభాష్యం అప్పలాచార్యులు. M A. విశాఖ పట్టణము

దేవరవారు సంకల్ప సిద్ధులు. శ్రీ భగవ ద్రామానుజ కృపాపాత్రులు. కౌముది షోడశ కళా పరిపూర్ణ మగుచున్నది మహానందమైనది.

కె. యస్. రామానుజాచార్యులు, ఎం. ఏ. నెల్లూరు
రిటైర్డు ప్రిన్సిపాల్ 16-7-94

శ్రీ రామానుజ కీర్తి కౌముది - 14 వ సంపుటము చేరినది ఇందులో శ్రీ వేదాంత దేశికులవారి వైభవము, బహు ముఖముల ప్రస్తుతింపబడుట - ముదా వహాము వారు మనసంప్రదాయమునకుచేసిన మహోపకారము - అనిర్వచనీయము. వారి అమూల్య రచనలలో - ఇంకను దొరకవలసినవి - అనేకము లున్నవి. దొర కినవానిలోను, కొన్నింటిలో - కొంత కొంత భాగము నష్టమైయున్నది. దీనిని పర్యాలోచించినపుడు - భవిష్యత్తులో ఈ గ్రంథములను రక్షించుమార్గమె లేదా?- అను సంశయము కలుగుచుండును.

దేవరవారు కావించుచున్న సంప్రదాయ పరివశ్యకు జోహారులు.

స చ. కృష్ణమాచార్యులు విజయవాడ

పదునాల్గవ కీర్తి కౌముది అందినది బాగుగ నున్నది. ఈ గ్రంథ ప్రచు రణ విషయములో మీరు చూపుచున్న శ్రద్ధాసక్తులు - మిక్కిలి అభినందనీయ ములై యున్నవి.

కె. టి. యల్. నరసింహాచార్యులు మునునూరు

శ్రీ రామానుజ కీర్తి కౌముది 14 వ - భాగ మందినది. ఇందలి విశేషాంశ ములను గ్రహించి మిగుల ఆనందము నందితిని. మీ స్నేహ శీలతకు, ఆత్మీయ తకు ఆప్యాతకు - ముగ్ధుడ నైతిని.

**వేముగంటి నరసింహాచార్యులు** — **సిద్ధిపేట**

మీ నిస్వార్థకృషి ఫలించుచున్నది కొలది మాత్రమే మిగిలియున్నది. మిగిలిన మీ కృషి - శ్రీమన్నారాయణుని కృప వలన — పూర్తిగా ఫలించగల దనుటలో సందేహము లేదు.

**కందాడై శ్రీనివాసాచార్యులు ఎం. ఏ.** — **హైదరాబాదు**

సర్వాంగ సుందరమైన 14 వ - కౌముది - భద్రముగా చేరినది. ఈ పుస్తకముల ప్రచురణ విషయమున మీరు చూపుచున్న శ్రద్ధకు ముగ్దుడ నగుచున్నాను భగవద్రామానుజుల 72 వాక్యములు - నన్నెంతయో ఆకర్షించినవి. తా మెవరో - తమకు తెలియక తిరుగుచున్న నేటి వారికి - ఈ రామానుజ ప్రబోధ వాక్యములు - నవచైతన్యమును కలిగింపగలవని నా విశ్వాసము

**ఊటుకూరు లక్ష్మీకాన్తమ్మ (కళాప్రపూర్ణ)** — **బాపట్ల**

శ్రీవైష్ణవ మతస్థాపకులైన శ్రీ రామానుజ యతీంద్రులు లోకోత్తర పురుషులు వారు మానవులను తరింప జేయుటకు తమ జీవిత సర్వస్వముకు వెచ్చించి, చిర యశమును గాంచిరి. అట్టి మహనీయుల దివ్య వైభవమును, శ్రీ వైష్ణవ మత వైశిష్ట్యమును - వివరించుటకై 'శ్రీ రామానుజ కీర్తి కౌముది' యను పేర ఒక విజ్ఞాన సర్వస్వమును 16 సంపుటములలో వెలయింప సంకల్పించిన శ్రీమాన్ వరదాచార్యుల వారు - అత్యంతము అభినందనీయులు. వరదా చార్యుల వారిపాండిత్యప్రకర్షకు ప్రతిభకు, శ్రీవైష్ణవ సంప్రదాయ విజ్ఞాన విశేషమునకు - ఇది యొక ప్రతీకయనుట అత్యుక్తి కానేరదు

**గోగినేని కనకయ్య (విద్వాన్)** — **గుంటూరు**

విజాన దాయకములైన 'శ్రీ రామానుజ కీర్తి కౌముది' సంపుటములను మీరు వెలయించుచున్నందులకు-చాల సంతోషించుచు - మిమ్ములను అభినందించు

చున్నాను భగవానుడు మీకు ఇతోధికముగ శక్తి సామర్థ్యములను, ఆయురారోగ్య భాగ్యములను ప్రసాదింపవలెనని - మనసార కోరుచున్నాను

డా॥ యం. నరసింహాచార్యులు, M. A Ph. D
Professor,
Head of the Dept. of Vaishnavism, MADRAS
University of Madras. Date 1-8-94

తాము చేయుచున్న శ్రీ వైష్ణవ సంప్రదాయ కైంకర్యము - అద్వితీయ మైనది. మీకు నా అభినందన మందారములు.

'న్యాయ విద్యా ప్రవీణ'
ప్రొఫెసర్ ; యస్ బి. రఘునాథాచార్య, M. A; Ph. D.
వైస్ ఛాన్సలర్ :
రాష్ట్రీయ సంస్కృత విద్యా పీఠము
(Deemed to be University.)

తిరుపతి - 517 507 (ఆం. ప్ర)
16 జూలై 1994

'శ్రీ రామానుజ కీర్తి కౌముది' పదునాల్గవ భాగం - వెలుగులోకి వచ్చిన మీరు చేస్తున్న వాఙ్మయ తపస్సు - ఫలేగ్రహి కానున్నది హార్దికాభినందనలను అందుకోండి.

వైష్ణవ లోకం - మీ కెంతో ఋణపడి ఉన్నది.

దయాసింధువు, ప్రపన్న బంధువు - అయిన భగవద్రామానుజుల వరి పూర్ణానుగ్రహం మీకు కలిగింది. అస్తు.

C. VIJAYARAGHAVACHARYULU -
VIJAYA PURI - SOUTH.

I have Received the XIV Volume of "SRI RAMANVJA KEERTHI KOUMUDI" the Penultimate and Penetrating Penshot on the encyclophedia explanation of Bhagavad Ramanuja Thought. I am extremely glad and grateful for sending me a copy of it as usual. The review by Dr Prema Nandakumar is incisive axd inquisitive. It adds strength and sprit to the XIV Volume.

But I wonder how soon the XV Focus is neering conclusion of the project and how finer and better it be if the project was to stretch over to 108 Gunas. Just as it is completing 'Shodasa kalas the 16 Focuses. Anyway, you have almost succeeded sn realising your visicn by means of unravelling the latest implications as Sri Viaishtadawaitha philosophy of Sri Ramanuja.

This unique philosophical project made your godself. Sri Ramanuja and Sree Vaishnavisim perennial objects.

# పత్రికలు - ప్రశంసలు

## శ్రీ రామకృష్ణ ప్రభ ( సంక్రాంతి సంచిక ) జనవరి **1995.**

(పదునాల్గవ భాగమును గురించి)

" ధర్మమూలం జగత్సర్వం
ధర్మశ్చ శ్రుతి మూలకమ్
భారతః పంచమో వేదః
శ్రుతి స్సర్వత్ర గీయతే "

అంటూ, ఆదర్శ మానవ జీవితాన్ని ప్రతిబింబింపజేసే రామాయణ కావ్య వైశిష్ట్యమూ, సనాతన ధర్మ ప్రబోధకమైన మహాభారత గ్రంథ వైశిష్ట్యమూ, అందలి వైష్ణవ తత్త్వమూ - భగవద్రామానుజుల శ్రీ భాష్యము, రామానుజ భక్తులైన వేదాంత దేశికుల పేరిట - వారి జీవిత చరిత్ర, విశేషాలు, రచనలూ - శ్రీరంగ క్షేత్ర ప్రాశస్త్యం, ఇత్యాదులు, .... ఇవిగాక, వేంకటేశ్వరోదాహరణ, దేశికుల సంస్కృత కృతికి ఆంధ్రానువాదం న్యాసవింశతి, తెలుగు తాత్పర్యంతో-దేశికుల భగవద్ధ్యాన సౌపానము, రామానుజ సూక్తి రత్నాలు - అతి ముఖ్యమైన 72 శ్రీ సూక్తులు క్లుప్తంగా కవి పండిత పరిచయంతో, సలక్షణంగా పొందు పరచ బడింది.

పాఠకులకు తృప్తి, జిజ్ఞాసువులకు సంతృప్తి, పరిశోధకులకు కూడా ఉపయోగపడే ప్రమాణ గ్రంథ మిది.

# Rich Dependable Guide

NEWS TIME 18th September, 1994.

In keeping with its aim of having a theme for its different issues, the fourteenth volume of Sri Ramanuja Keerthi Kaumudi presents several facts in the life and work of the renowned Vaishnava Acharya 'Vedanta Desika' Prativadi Bhayankara Vedantacharyulu's essay places before us important aspects in the life of Acharya known as an incarnation of the bell of Sri. Venkateswara Born in 1268 in a family known for its Vedic scholarship, Vedanta Desika was groomed as a teacher by his uncle Atreya Ramanuja. Desika stayed in places like Tiruvaheendrapuram, Kanchi, Srirangam and Satyamangalam teaching the Sri Bhashya, disseminating the Ramanuja Darsana, writing epics, hymns and commentaries in Tamil, Sanskrit, Prakruta and Manipravala a mixture of Tamil and Sanskrit. He travelled to holy places like Tirupati, Naimisaranya and Srikurmam, widely respected, he was adormed with the title, Kavitarkika simha, lion of poesy and logic.

Sri Dhanakudharam Varadacharyulu follows with an introduction to the works of Desika. He lists 59 works in Sanskrit. These includes Sata Dushani (rebuttal of Sankara, Bhaskara and Yadava Prakasa), Adhikarana Saravali (a commentary on the Sri Bhashya of Ramanuja). Paduka Sahasram (one thousand verses on the sandals of Lord Ranganatha) Yadavabhudayam (Epic on Krishna) Sankalpa Suryodayam (Vedantic drama) Hamsa Sandesam (the swam messenger) and several hymns like Sri Goda Stuti and Yatiraja Saptati. Vedanta Desika's Tamil

writings mainly deal with the evereday discipline of the Vaishnava way of life Among his Manipravala writings, Abhaya Pradana Saram is justly famous as a brilliant exposition of the way of surrender exemplified in Vibhishana.

Sri N Ch. Krishnamacharyulu has translated Desika's 'Nyasa Vimsati' into simple Telugu for this issue The twenty verses of the poem expound the way of surrender (nyasa) stey by stey The nature and conduct of the master and the displine the difference between bhakti and prapatti (surrender and the posting of prapatti in the Upanishads are referred to by Vedanta Desika K V. Raghavacharyulu Desika's Bhagavad Dhyana Sopanam which describes the divya mangala of Lord Ranganath in yogic sleep at the shrine in Srirangam Appalla Someswara Sarma points out how Kalidasa was Desika's model in meaningful imagination. Hamsa Sandesam was inspired by 'Meghadutam Inspite of using the same metre, style and mood, Desika's poem stands on its own strength of emotive utterance. Since Hamsa Sandesam is about the love of the Supreme of the jive, Desica adds a concluding verse (Unusual) for such messenger-poems). that describes the destruction or Ravana (Samsara) and the renion of Sita and Rama. Here the swan is the Acharya whose teaching help the jivatman reach the supreme abode (Ayodhya) Referring to Desika's Yadavabhudayam as veritably an occan of milk, Sri Someswara Sarma hails it as an experience of the 'all beautiful's divine love. The drama, Sankalpa Survodayam is a morality play that exhibits all the rasas with a perfect sense of proportion though Santha is the adhaara sruti for the action Desika's Sanskrit hymns reveal his mastery of prosody and his

devotion – laden heart. Of particular importance is 'Daya Satakam' which image the compassion of Venkateswara as the Goddess Daya Here is magnificient nature poetry, apt similes, verbal artistry, musical tonality . the ingredients of 'Bhava Kavita'. The Supreme has two supernal facts. One is leela (playfulness) which pushes the jeeva into life and watches his struggles. The other is day (compassion) which helps the jiva out of the well of samsara. To this mother compassion are addressed the gemlike verses of the sataka.

There are also other important essays in this rich compendium Samudrala Venkata Ramunujacharyulu writes on the theory of incarnation. Kidambi Srinivasa Ramanujacharyulu andDhanakudharam Varadacharyulu explore the Vaishnava tenets in the Ramayana and the Mahabharatha The letter's list of Ramayana – based works in Tamil and Telugu is exhilerating. We could add Kulasekhara Alwar also to the company as his decade, 'Angam Nedumathil' is considered to be the first complete Ramayana in Tamil Verse. In the same way, the Telugu list would be enriched with the addition of Ramaneeya Ramayanam by Duvvri Venkata Ramanayya.

Marimganti Srirangacharyulu continues his explication of Sri Bhashya with unflagging zeal while two essays on several great temple towns dedicated to Narayana make the present Kaumudi issue a dependable guide as well.

SRIRANGAM. Dr. PREMANANDAKUMAR, M. A , Ph. D.

శ్రీ నివాసాయ నమః | శ్రీమతే రామానుజాయ నమః

# విష్ణుభగవానుని వైశిష్ట్యము

( సంపాదకీయము )

శ్లో॥ నాగో భాతి మదేన - ఖం జలరుహైః - పూర్ణేందునా శర్వరీ
శీలేన ప్రమదా - జవేన తురగః - నిత్యోత్సవైః మందిరమ్ ।
వాణీ వ్యాకరణేన - హంస మిధునైః నద్యః - సభా పండితైః
సత్పుత్రేణ కులం - నృపేణ వసుధా - లోకత్రయం విష్ణునా ॥

మదముచే గజము, వర్ష బిందువులచే ఆకాశము, పూర్ణచంద్రునిచే శరద్రాత్రి, శీలముచే స్త్రీ, జవముచే అశ్వము, నిత్యోత్సవములచే దేవాలయము, వ్యాకరణముచే భాష, హంస ద్వంద్వములచే నదులు. పండితులచే సభ. సత్పుత్రునిచే వంశము, ప్రభువుచే రాజ్యము, విష్ణుభగవానునిచే ముల్లోకములును ప్రకాశించు' నని ఆర్యోక్తి.

జగన్నాథుఁడైన అట్టి విష్ణుభగవానుని లీలా విశేషములు - అవాఙ్మానసగోచరములు. ఎచటనో - మనకు దృగ్గోచరముకాని

శ్వేత ద్వీపమునందలి వైకుంఠ నగరమున నిత్య నివాసము చేయు చున్నను, ఆ స్వామి - అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుఁ డగుటచే, దివ్యమైన తన అద్భుత శక్తి వలన, యుగ యుగమందును - అవతారములను ధరించి, దుష్టులను దునుమాడి, సాధువులను రక్షించుచు, సనాతన ధర్మమును సముద్ధరించుచుండును.

అనేక సమయ సందర్భములలో విష్ణుభగవానుఁడు - వివిధములైన యవతారములను ధరించి, తన సర్వేశ్వరత్వమును నిరూపించి యున్నాడు. ఇట్టి తన యవతార రహస్యమును గీతలో కృష్ణపరమాత్మ అర్జునునితో ఇట్లు చెప్పుచున్నాఁడు :-

"నేను అజుఁడను పరిణామము లేనివాఁడను, సర్వభూతములకు ఈశ్వరుడను. నా యీశ్వర స్వభావమును విడువకయే, నా సంకల్పరూపజ్ఞానముచేత జనించుచున్నాను. ఓ భారతా ! ఎప్పు డెపుడు (వేదోక్త) ధర్మమునకు లోపము, అధర్మమునకు వృద్ధియు కలుగుచున్నదో, అప్పు డంతయు నన్ను నేను సృజించుకొనుచున్నాను సాధువులను (ధర్మపరులను) రక్షించుటకు, పాపులను నశింపజేయుటకు, (వైదిక) ధర్మమును స్థాపించుటకును - ప్రతి యుగమందును 'పుట్టుచున్నా'ను. అర్జునా ! నా జన్మమును, కర్మమును - అప్రాకృతములు (ప్రకృతికి సంబంధము లేనివి). ఇట్లు ఎవడు తత్త్వమును తెలియుచున్నాడో, అతఁడు దేహమును వదలిన పిమ్మట, మఱల జన్మమును పొందడు. నన్నే పొందును.'

— (భగవద్గీత : 4 - 6, 7, 8, 9)

అవతారము లనేకము లనియు, ఋషులుగా, మనుజులుగా, మనుపుత్రులుగా, ఇంకను అనేక విధములుగా భగవాను డవతరించుచున్నాడనియు - ఆంధ్ర మహాభాగవత మిట్లు వివరించుచున్నది :-

" అది సకలావతారంబులకు మొదటి గనియైన శ్రీమన్నారాయణ దేవుని విరాజమానమయిన దివ్య రూపంబు దానిని పరమయోగులు దర్శింతురు.

1) ఆ పరమేశ్వరుని నాభికమలంబువలన, సృష్టి కర్తలలో శ్రేష్ఠుడైన బ్రహ్మ యుదయించె. అతనిచె అవయవ స్థానంబులయందు – లోక విస్తారంబులు గల్పింపఁబడియె. మొదట ఆ దేవుండు – కౌమారాఖ్య సర్గంబు నాశ్రయించి, బ్రహ్మణ్యుఁడై, దుశ్చరం బయిన బ్రహ్మచర్యంబు చరియించె.

2) రెండవ మాఱు – జగ జ్జనంబు కొఱకు - రసాతలగతం బయిన భూమి నెత్తుచు, యజ్ఞేశుం డయి వరాహ దేహంబు దాల్చె.

3) మూఁడవ తోయంబున – నారదుం డను దేవర్షియై, కర్మనిర్మోచకంబైన వైష్ణవ తంత్రంబు సెప్పె.

4) నాలవ పరి – ధర్మ భార్యాసర్గంబునందు-నర నారాయణాభిధానుండై, దుశ్చరంబైన తపంబు సేసె.

5) పంచమావతారంబున – కపిలుం డను సిద్ధేశుం డయి, 'ఆసురి' యను బ్రాహ్మణునకు – తత్త్వగ్రామ నిర్ణయంబు గల సాంఖ్యంబు నుపదేశించె.

6) ఆఱవ శరీరంబున - అనసూయాదేవియందు – అత్రిమహామునికి కుమారుఁడై అలర్కునికి, ప్రహ్లాద ముఖ్యులకును – ఆత్మవిద్య దెలిపె.

7) ఏడవ విగ్రహంబున - ఆకూతియందు రుచికి జన్మించి, అజ్ఞ డన ప్రకాశమానుండై, యమాది దేవతతోడం గూడ - స్వాయంభువ మన్వంతరంబు రక్షించె.

8) అష్టమ మూర్తిని – మేరుదేవియందు నాభికి జన్మించి, ఉరుక్రముం డన ప్రసిద్ధుడై, విద్వజ్జనులకు పరమహంస మార్గంబును ప్రకటించె.

9) ఋషులచేత కోరంబడి, తొమ్మిదవ జన్మంబున - పృథు చక్రవర్తియై, భూమిని ధేనువుగాఁజేసి, సమస్త వస్తువులం బిండె.

10) చాక్షుష మన్వంతరములో-సంప్లవంబున - దశమం బయిన మీనావతారంబు నొంది, మహీ రూపం బగు నావ నెక్కించి, వైవస్వతమనువు నుద్ధరించె,

11) సముద్ర మథన కావించిన నేర్పరియై, పదునొకండవమాఱు - కమఠాకృతిని మందరాచలంబును - తన పృష్ఠ కర్పరంబున నేర్పరియై నిలిపె.

12) 'ధన్వంతరి' యను పండ్రెండవ తనువున - సురాసుర మధ్యమున క్షీరపాథోధిమధ్య - అమృత కలాహస్తుండై వెడలె

13) పదమూడవదియైన మోహినీవేషంబున - సురాసురుల మోహితులం జేసి, సురుల నమృతాహారులం గావించె.

14) పదునాల్గవదియైన నరసింహ రూపంబున - కనకకశిపుని సంహరించె,

15) పదునేనవదియైన కపట వామనావతారంబున - బలిని పదత్రియంబు యాచించి, మూఁడు లోకంబుల నాక్రమించె.

16) పదునాఱవదియైన భార్గవ రామాకృతిని - కుపిత భావంబు దాల్చి, బ్రాహ్మణద్రోహు లయిన రాజుల నిరువదియొక్కమాఱు వధియించి, భూమిని క్షత్రియ రహితంబు గాంచె.

17) పదునేడవదియైన వ్యాస గాత్రంబున - అల్పమతు లయిన పురుషులం గరుణించి, వేద వృక్షంబునకు శాఖ లేర్పఱచె.

18) పదునెనిమిదవదియైన రామాభిధానంబున - దేవకార్యార్థంబు రాజత్వంబు నొంది, సముద్ర నిగ్రహాది పరాక్రమంబు లాచరించె.

19) ఏకోనవింశతి, 20) వింశతితమంబులైన రామ కృష్ణ రూపంబులచే యదువంశంబునందు సంభవించి, విశ్వంభరాభారంబు నివారించె.

21) ఏకవింశతితమంబైన బుద్ధ నామధేయంబున - కలియుగా ద్యవసరంబున-రాక్షస సమ్మోహనంబు కొఱకు-మధ్యగయాప్రదేశంబున జినసుతుండయి జరిల్లు.

22) యుగ సంధియందు - వసుంధరాధీశులు చోరప్రాయులై సంచరింప, ష్ణుయశం డను విష్ణునికి - 'కల్కి' యను పేర నుద్భవింపఁగలడు.'"

అని యిట్లు - ఆంధ్ర భాగవత మహా పురాణము (1-63) విష్ణు-గవానుని అవతార విశేషముల కొన్నింటిని వివరించుచున్నది ఇట్టి నిలో నేటికి - 21 అవతారములు వచ్చియున్నవి. ఇఁక, కడపటిదగు ల్కి అవతార మొకటి మాత్రము రావలసియున్నది.

పైన పేర్కొనఁబడిన యవతారములలో - (1) మత్స్య 2) కూర్మ (3) వరాహ (4) నారసింహ (5) వామన (6) పరశురామ 7) రఘురామ (8)బలరామ (9) శ్రీకృష్ణ (10) కల్కి - అనఁబడు ది యవతారములును మిక్కిలి ప్రాముఖ్యమును సంతరించుకొని, శావతారములుగా ప్రశస్తి గాంచియున్నవి.

" భగవంతుం డగు విష్ణుఁడు । జగముల నెవ్వేళ రాక్షస వ్యధ గలుగుం డగ నవ్వేళలఁ దడయక । యుగ యుగమున బుట్టి కాచు నుద్య ల్లీలన్.'"

రాక్షసులచే బాధ వాటిల్లినపు డెల్లను - విష్ణుభగవానుఁడు సమయోచితమైన అవతారమును ధరించి, ఆ యా దుష్టులను సంహరించి, లోకమును కాపాడుచుండునని - భాగవత మహా పురాణము గొక్కినక్కాణించుచున్నది. (1-65)

అట్టి విష్ణుభగవానుఁడే అందఱి కంటెను అధికుఁడని- వేదవ వివరించుచున్నది.

విష్ణు సహస్రనామ స్తోత్ర పారాయణము - సర్వార్థ సాఁ మని - పంచమ వేద మగు మహాభారత ముద్ఘోషించుచున్నది.

సృష్టి కారణుఁడైన విష్ణుభగవానుని భక్తి ప్రపత్తులతో ఉ సించువారలకు - ఆనంద నిలయమైన వైకుంఠ లోకము ప్రాప్తి గలదని పురాణేతిహాసాది గ్రంథములు బోధించుచున్నవి.

అట్టి విష్ణుభగవానుని దశావతార వైభవమును మహాభ లనేకులు - బహు భంగులుగా వర్ణించియున్నారు. అట్టి వర్ణనః లనుఁబట్టి, విష్ణుభగవానుని వైశిష్ట్యము, ఆ భగవానుని దశావత ముల ప్రాముఖ్యము - సుస్పష్టము.

" నమో స్త్వనంతాయ సహస్ర మూర్తయే
సహస్ర పాదాక్షి శిరోరుబాహవే ।
సహస్ర నామ్నే పురుషాయ శాశ్వతే
సహస్ర కోటీ యుగధారిణే నమః"



# విషయానుక్రమణిక

7. శ్రీమద్రామానుజులు - వేదాంత సారము 140 - 200

డాక్టర్ : తట్టా విజయరాఘవాచార్యులు

ప్రథమాధ్యాయ - ప్రథమ పాదము :-

జిజ్ఞాసాధికరణము
జన్మాద్యధికరణము
శాస్త్రయోనిత్వాధికరణము
సమన్వయాధికరణము
ఈక్షత్యధికరణము
ఆనందమయాధికరణము
ఆకాశాధికరణము
ప్రాణాధికరణము
జ్యోతిరధికరణము
ఇంద్రప్రాణాధికరణము

ప్రథమాధ్యాయ - ద్వితీయ పాదము :-

సర్వత్రప్రసిద్ధ్యధికరణము
అత్రాధికరణము
అంతరాధికరణము
అంతర్యామ్యధికరణము
అదృశ్యత్వాధికరణము
వైశ్వానరాధికరణము

ప్రథమాధ్యాయ - తృతీయ పాదము :-

ద్యుభ్వాద్యధికరణము
భూమాధికరణము
అక్షరాధికరణము

ఈక్షత్యధికరణము
దహరాధికరణము
ప్రమితాధికరణము
దేవతాధికరణము
మధ్వధికరణము
అపశూద్రాధికరణము
అర్థాంతరాదిత్వాది వ్యపదేశాధికరణము

ప్రథమాధ్యాయ చతుర్థ పాదము :-

అనుమానాధికరణము
చమసాధికరణము
సంఖ్యాపసంగ్రహణాధికరణము
జగత్యాధికరణము
వాక్యాన్వయాధికరణము
ప్రకృత్యాధికరణము
సర్వవ్యాఖ్యానాధికరణము

ద్వితీయాధ్యాయ - ప్రథమ పాదము -

స్మృత్యధికరణము
యోగప్రసిద్ధ్యధికరణము
విలక్షణత్వాధి కరణము
శిష్టాపరిగ్రహాధికరణము
భోక్త్రాధి కరణము
ఆరంభణాధికరణము
ఇతర వ్యపదేశాధికరణము
ఉపసంహార దర్శనాధికరణము
కృత్స్న ప్రసక్త్యాధికరణము
ప్రయోజనత్వాధికరణము

## ద్వితీయాధ్యాయ - ద్వితీయ పాదము :-

రచనానుపత్త్యధికరణము
మహద్దీర్ఘాధికరణము
సముదాయాధికరణము
ఉపలబ్ధ్యధికరణము
సర్వథానుపపత్త్యధికరణము
ఏకస్మిన్నసంభవాధికరణము
పశుపత్యధికరణము
ఉత్పత్త్యసంభవాధికరణము

## ద్వితీయాధ్యాయ - తృతీయ పాదము :-

వియదధికరణము
తేజో౽ధికరణము
ఆత్మాధికరణము
జ్ఞాధికరణము
కర్త్రధికరణము
పరాయత్తాధికరణము
అంశాధికరణము

## ద్వితీయాధ్యాయ - చతుర్థపాదము :-

ప్రాణోత్పత్త్యధి కరణము
సప్తగత్యధికరణము
ప్రాణాణుత్వాధికరణము
వాయుక్రియాధికరణము
శ్రేష్ఠాధికరణము
జ్యోతిరాద్యధికరణము
ఇంద్రియాధికరణము
సంజ్ఞామూర్తి క్లృప్త్యధికరణము

తృతీయాధ్యాయ - ప్రథమపాదము

తదంతరప్రతిపత్త్యాధికరణము
కృతాత్యయాధికరణము
అనిష్టాదికార్యాధికరణము
తత్స్వాభావాధికరణము
నాతిచిరాధికరణము
అన్యధాష్టితాధికరణము

తృతీయాధ్యాయ - ద్వితీయ పాదము :-

సన్ధ్యానాధి కరణము
తదభావాధికరణము
కర్మానుస్మృతిసంభవాధికరణము
ముగ్ధాధికరణము
ఉభయలింగాధికరణము
ఫలాధికరణము

తృతీయాధ్యాయ - తృతీయ పాదము :-

సర్వ వేదాంత ప్రత్యయాధికరణము
అన్యధా త్వధికరణము
సర్వభేదాధికరణము
ఆనందాద్యధికరణము
కార్యాఖ్యానాధికరణము
సమానాధికరణము
సంబంధాధికరణము
సంపత్యధికరణము
పురుష విద్యాధికరణము
వేదాద్యధికరణము

హాన్యధికరణము
సాంపరాయాధికరణము
అనియమాధికరణము
అక్షరాద్యధికరణము
కామాద్యధికరణము
తన్నిర్ధారణా నియమాధికరణము
ప్రతానాధికరణము
లింగభూయస్త్వాధికరణము
శరీరే భావాధికరణము
అంగానధ్వాధికరణము
భూతి వ్యాయ స్త్వహికంరాధికరణము
శబ్దాది భేదాధికరణము
వికత్వాధి కరణము
యధాశ్రయ భావాధికరణము

తృతీయధ్యాయ - చతుర్థ పాదము :-

పురుషాద్యాధికరణము
స్తుతి మాత్రాధికరణము
పారిప్లవాధికరణము
అగ్నీంధనాధికరణము
సర్వాపేక్షాధికరణము
శమదమాద్యధికరణము
సర్వాన్నామమత్యధికరణము
విహితత్వాధికరణము
వాసురాధికరణము
తద్భూతాధికరణము
స్వామ్యధికరణము
సహకార్యాంతరాధికరణము
అనావిష్కారాధికరణము
ఏహికాధికరణము

### చతుర్థాధ్యాయ - ప్రథమ పాదము :-

ఆవృత్త్యధికరణము
ఆత్మత్వోపాసనాధికరణము
ప్రతీకాధికరణము
ఆదిత్యాధికరణము
ఆసీనాధికరణము
తదధికరణాధికరణము
ఇతరాధికరణము
అనారబ్ధాధికరణము
అగ్నిహోత్రాధికరణము

### చతుర్థాధ్యాయ - ద్వితీయ పాదము :-

వాగధికరణము
మనో౽ధికరణము
అధ్యక్షాధికరణము
భూతాధికరణము
ఆసృత్యుపక్రమాధికరణము
పరసంపత్త్యధికరణము
అవిభాగాధికరణము
తదోకో౽ధికరణము
రశ్మ్యనుసారాధికరణము
నిశాధికరణము
దక్షిణాయనాధికరణము

### చతుర్థాధ్యాయ - తృతీయ పాదము

అర్చిరాద్యధికరణము
వాయ్వధికరణము
వరుణాధికరణము

అతివాహికాధికరణము
కార్యాధికరణము

చతుర్థాధ్యాయ - చతుర్థ పాదము :-

సంపత్త్యావిర్భావాధికరణము
బ్రహ్మాధికరణము
సంకల్పాధికరణము
ప్రభావాధికరణము
జగద్వ్యాపారవర్జాధికరణము

8. శ్రీ రామానుజ విజయము (పద్య రచన)

శ్రీమాన్ కుంటిమద్ది శేషశర్మ

9. వడగల - తెంగల సంప్రదాయ భేదములు

శ్రీమాన్ ప్రతివాది భయంకర వేదాంతాచార్యులు

౧. సిద్ధాంత భేదములు :-

భగవంతుఁడు
భగవంతుని అణువ్యాప్తి
భగవంతుని కృప
భగవంతుని వాత్సల్యము
శ్రీదేవి సర్వ వ్యాపకత్వము
మోక్ష ప్రాప్తికి శ్రీదేవి హేతువా ?
సాధక స్వరూపము
ముక్తి ఫలము
ప్రపత్తి హేతువు
ద్వయమంత్రానుసంధాన ఫలము
పరిశుద్ధాత్ముడైన ప్రపత్తి నిష్ఠుఁడు
దివ్యప్రబంధాధ్యయనము
ధర్మశాస్త్ర - ఆగమశాస్త్రముల తారతమ్యము

భాగవతులకు, ఆళ్వారులకు, ఋషులకును - ఈయవలసిన గౌరవప్రపత్తి.
వర్ణ వ్యవస్థ విలువ
వైకుంఠ ధామము

౨. ఆచార భేదములు :-

సన్యాసికి - గృహస్థునకంటెను గౌరవము
నితంతువులకు శిరో ముండనము
పార్వతీక శ్రాద్ధము
ఏకాదశీ శ్రాద్ధము
పూజా విధానము - ఆచార్యులకు విగ్రహారాధన
గోష్ఠి పారాయణ పరిసమాప్తి క్రమము (సాతు ముఱై)
నామము యొక్క నడిమి రూపము - వడగల నామము
నామాకారమును గూర్చి - కాత్యాయనోపనిషత్తు
శ్రీపాద తీర్థము
వ్యక్తిగత సామాజిక ప్రపత్తులు
పంచ సంస్కారములు
పంచసంస్కార దండ స్పర్శము
ప్రణవ మంత్రోపయోగము
చివటి మాట

## 10. శ్రీ వరదరాజ క్షేత్ర వైశిష్ట్యము

శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు

క్షేత్ర పరిచయము
పల్లవ రాజుల పరిపాలన
చోళరాజుల పరిపాలన
పాండ్యరాజుల పరిపాలన
విజయనగర రాజుల పరిపాలన
నాయకరాజుల పరిపాలన
హస్తిగిరి ప్రశస్తి

బ్రహ్మోత్సవ వైభవము
దేవాలయ శిల్ప సౌందర్యము
మత ప్రచారము
స్తోత్ర వాఙ్మయము
సంకీర్తన వాఙ్మయము
మంగళాశాసనము
నిగమనము





శ్రీ పద్మావతి



శ్రీ వేంకటాచలపతి

# శ్రీ వేంకటపతి స్తుతి

' భక్త కవిశేఖర '

## శ్రీమాన్ ఉత్పల సత్యనారాయణాచార్యులు, ఎం. ఏ.

★

శ్రీచదలేటి మోపరిని శేషగిరిన్ నెలరేడు వెన్నెలల్
గాచిన యట్లు, అంజనపు గట్టున పొల్చిన కల్పక వ్రజం
బేచి వసంతవేళ విరులిచ్చిన యట్లునుతింపనెంతు స్వా
మీ ! చెవి యొగ్గు వేంకటపతీ ! అఖిలాండపతీ ! శ్రియఃపతీ !

భాగవతంబె నా ధనము, భక్తుల కూటమి పడ్రిపాన్నహా,
నీ గుణకీర్తనంబె ధరణిన్ వ్యవసాయము, నా పరిశ్రమా
భోగఫలంబు నీవ ! పరిపూర్ణ దయాకర! భక్తపాలనో
ద్వేగ ! నమోఽస్తు వేంకటపతీ!అఖిలాండపతీ ! శ్రియఃపతీ !

చక్కని త్యాగరాజ కృత సాహితి, క్షేత్రయగారి వశ్యతా
వాక్కులు, రామదాసకవి వ్రాసిన పద్యము, లన్నమయ్య పా
టొక్కటి విన్న నా కవిత కున్నదె విల్వ ? అకించనాళికిన్
దిక్కువు నీవు వేంకటపతీ ! అఖిలాండపతీ ! శ్రియఃపతీ !

జలజదళాయతాక్ష ! హరి ! సర్వ సమర్థుడవయ్యు నీవు భ
క్తుల పిలుపందుకొంటకు వికుంఠము నే విడనాడి ఏడుకొం
డలపయికేగుదెంచితి వనాథల దీనుల పట్ల బాధ్యతం
దెలుపుచు - వేంకటాచలపతీ ! అఖిలాండపతీ ! శ్రియఃపతీ !

పాల సముద్రమందు ఫణి పాన్పుపయిన్ పవళింప కృష్ణ ! నీ
నీల మనోజ్ఞకాంతు లవి నింగి పయోనిధిపై మరొక్క ఆ
భీల పయోధి వచ్చెనను భీతి తొలంపగ ఏడుకొండలం
దేలితివేమొ ! వేంకటపతీ ! అఖిలాండపతీ ! శ్రియఃపతీ !

నీ మెడలోని కౌస్తుభము నిద్దపు శంఖము చక్రమున్ పరం
ధామము కాంచనాంబర మనోరత లీలలు నీ స్వరూప సం
క్రామక దివ్యచేతనలె కాని, త దన్యము కాదు, వైజయం
తీ మణిహార ! వేంకటపతీ ! అఖిలాండపతీ! శ్రియఃపతీ !

సరిగ మనుష్య దేహ మొక సత్రము-అందరమందులో 'ముసా
ఫిరులము' - కొన్నినాళ్ళిచట విశ్రమమొంది స్వధామమేగుటే
వరవడిగాని, ఇంచె పడియుండిన సత్రము సొంతమౌనటే ?
తిరుపతి వేంకటాచలపతీ ! అఖిలాండపతీ ! శ్రియఃపతీ !

కొండవు నీవు - క్రింద గల కూర్మము నీవు - సురాసురాళికిన్
కండబలమ్ము నీవు - చిలుకం దొలగించితి వంట సంద్రమున్
దండిగ చుట్టుకొన్న తరి త్రాడగు వాసుకి నిద్రపుచ్చి మృ
త్పిండము నిచ్చి వేంకటపతీ ! అఖిలాండపతీ ! శ్రియఃపతీ !

నిస్తుల వాసుదేవుడవు నీవు - త్రివిక్రముడైనయప్డు నీ
కౌస్తుభ రత్నమందున జగత్త్రయి బింబిత మౌట కుక్షివి
న్యస్త సమస్త లోకము కనంబడజేతు గాదె ! వేద వీ
థీ స్తవనీయ ! వేంకటపతీ ! అఖిలాండపతీ ! శ్రియఃపతీ !

అరు దగు మానవేతరములౌ అవతారము లెత్తునప్పు డీ
శ్వరు డని నిన్ను కొల్తురు; ప్రజంబున మానుషరీతితో దయా
పరతను ప్రేమబోధ సలుపంగ స్వయంబుగ డిగ్గినట్టి ని
న్నెరుగరు కృష్ణ ! వేంకటపతీ ! అఖిలాండపతీ ! శ్రియఃపతీ !

ఎరుగుదునో ప్రసన్న వదనేక్షణ ! నిన్ను సశంఖ చక్ర భా
స్వర వనమాలికాభరణ వజ్రకిరీట సువర్ణ కౌశికాం
బరధర మన్మనోనయనవర్ధనమూర్తివి కృష్ణమూర్తివే !
తిరుపతి వేంకటాచలపతీ ! అఖిలాండపతీ ! శ్రియఃపతీ !

నీవు రస స్వరూపుడవు నీ కొఱకై సకలేంద్రియంబులన్
నీ వశముం బొనర్చు మహానీయులు గోపికలౌదు, రిద్ది బృం
దావన మౌను, ఇంక నమృతం బిట నుండును గాని, ఉండునే
దేవత లింట వేంకటపతీ ! అఖిలాండపతీ ! శ్రియఃపతీ !

రక్షణ వేర నిన్ను సకలంబును కోరుచునుంటి, నైహికా
పేక్ష తొలంగలే దనుట కిద్ది ఉదాహరణంబు గాదటే !
మోక్షము కూడ కోరుకొనబోరట గోపిక, లట్టి ప్రేమపున్
దీక్ష యొసంగు వేంకటపతీ ! అఖిలాండపతీ ! శ్రియఃపతీ !

అనిశము కృష్ణ! కేశవ! జనార్దన! యంచు నినున్ స్మరించు నా
దినమె దినమ్మగున్, చలువ తీవ్ర మనావృతమైన రోజు దు
ర్దిన మది కాదు, నిన్నెద స్మరింపక పుచ్చిన యా దినమ్మె దు
ర్దిన మగు వేంకటాచలపతీ ! అఖిలాండపతీ ! శ్రియఃపతీ !

మోహ మదేమొ కాని, తన మూలముచేత కుటుంబకార్యని
ర్వాహము సాగుచున్నదని పల్కును- ఈ భ్రమ యేల? సర్వని
ర్వాహకు డీవె కావె ? మరి వ్యర్థపు గర్వము దేల నింపె దీ
దేహికి స్వామి ? వేంకటపతీ ! అఖిలాండపతీ ! శ్రియఃపతీ !

కృష్ణ ! యటన్న నాడు భవదీయ దయామృత నొంది, వెంటనే
వైష్ణవు డౌను - ఆ పయిని భాగవతోత్తము డౌచు రాధికా
కృష్ణుల భావ రాజ్యమున గీత సుధారస మాని పృథ్వి వ
ర్ధిష్ణువు నౌను వేంకటపతీ ! అఖిలాండపతీ ! శ్రియఃపతీ !

వాయు సుతుండు లంక నలు వంకల దగ్ధమొనర్చె, శంభుడున్
కాయజు బూది చేసెను, వనౌషధయుక్తము ఖాండవంబు కౌం
తేయుడు కాల్చివైచె, జగతిం గల పేదరికమ్ము గాల్చు యా
ధేయుడు లేడె? వేంకటపతీ ! అఖిలాండపతీ ! శ్రియఃపతీ !

నేను మహా విరాగినని, నేను కడుంగడు జ్ఞాని నంచు నె
వ్వానికి గర్వమో అతనివల్లనె జ్ఞాన విరక్తి మార్గముల్
హానిని చెంది పొందు నపహాస్య మనుద్వత భక్తి భావనా
ధీనుడ వీవు వేంకటపతీ! అఖిలాండపతీ! శ్రియఃపతీ!

అనయము దోషమే పరులయందు కనుంగొని పల్కునట్టి యా
జనుని కౌగిన్ గుణగ్రహణశక్తి నశించును, మంచిమార్గమే
జనములలోన చూడగల చక్కని గాపులు పల్కునాల్క నా
కెనయగ నిమ్ము వేంకటపతీ! అఖిలాండపతీ! శ్రియఃపతీ!

నమ్మిక లేక భక్తి మొద నాటదు భక్తి వినా ప్రసన్న భా
వమ్మది నీకు కల్గదు భవ తృప పొందనియట్టివాడు స్వ
ప్నమ్మునసైన శాంతిని కనండు - ఒకించుక భక్తి మాకు రా
నిమ్ము కృపాళు వేంకటపతీ! అఖిలాండపతీ! శ్రియఃపతీ!

. . .          . . .          . . .          . . .

మానవు లెల్ల కృష్ణ పరమాత్మను బొందుట కర్హు, లుత్తమం
బైనది భక్తి. భక్తి పరమార్థ మొకండె ప్రపత్తి యంచు వ్యా
ఖ్యాన మొనర్చి చేసిన మహా మహితాత్ములతోడగూడి. రా
మానుజ కీర్తి కౌముది - దిగంతములన్ చెలువొందుగాపుతన్!



# విష్ణు సహస్ర నామ స్తోత్ర ప్రభావము

' ఉభయ వేదాంత శిరోమణి '

**శ్రీమాన్ కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులు, యం. ఏ.**

★

## స్తోత్ర ప్రశస్తి

" గేయం - గీతా, నామ సహస్రమ్. "

అని, శంకరాచార్యుల శాసనము. ఇచట - 'గీత' అనగా, 'భగవద్గీత' అనియు, 'నామ సహస్రమ్' అనగా - 'శ్రీ విష్ణు సహస్రనామస్తోత్రము' అనియు - తాత్పర్యము. ఈ రెండు గ్రంథములకును - ఇపు డున్న వ్యాఖ్యలలో - ప్రాచీనతను వ్యాఖ్యలు - శంకరాచార్య విరచి ములే. ఇట్లే -

" స్వ శాఖోపనిష ద్గీతా - విష్ణో ర్నామ సహస్రకమ్
శ్రీసూక్తం, పురుషం చైన - నిత్య మావర్తయే ద్ద్విజః. "

గృహస్థుడు తన వేదశాఖను, ఉపనిషత్తులను, భగవద్గీతను శ్రీ విష్ణు సహస్ర నామ స్తోత్రమును, శ్రీసూక్త - పురుష సూక్తము లను, ప్రణవమును - అనుదినమును - అనుసంధింపవలె ననియు శిష్టుల సంప్రదాయము. ఇది నేటికిని కొనసాగుచునే యున్నది.

ఆళ్వారులును - "పేరాయిరము మోదు మిన్గళ్" భగవంతు వేయి నామములను కీర్తించుచు' అని, భక్తులకు ఉద్బోధించ యున్నారు.

## స్తోత్ర ప్రచారము

నేడు అనుసంధింపబడుచున్న సహస్రనామము లన్నింటికంటెను - శ్రీ విష్ణుసహస్రనామ స్తోత్రము మిక్కిలి ప్రాచీనమైనది. మత త్రయ శిష్ట సంప్రదాయమున దీనికి గల ప్రచారము - అనన్యాదృశము. ఇందులకు కారణ మేమి ?

ఈ ప్రశ్నకు - శ్రీ పరాశర భట్టరువారు - ఇట్లు సమాధానము నిచ్చియున్నారు :-

" మహాభారత సారత్వాత్ - ఋషిభిః పరిగానతః
వేదాచార్య సమాహారాత్ - భీష్మోత్కృష్ట మతత్వతః
పరిగ్రహాతిశయతః - గీతా ద్యేకార్థతశ్చనః
సహస్ర నామ్నాం అధ్యాయం - ఉపాదేయతమో మతః. "

1) శ్రీ విష్ణు సహస్రనామాధ్యాయము - మహాభారతమున సార మగుటవలనను, 2) మహర్షులు దీనిని బహువిధముల కొనియాడి యుండుట వలనను, 3) వేదవ్యాస భగవానుడు భగవన్నామముల ను ఈ రీతిని ఏర్చి కూర్చుటవలనను, 4) భీష్మాచార్యులవారు దీనిని ఉత్తమోత్తమ ధర్మమని కీర్తించుట వలనను, 5) శిష్టులు దీనిని అత్యంతము ఆదర భావముతో పరిగ్రహించుట వలనను 6) భగవద్గీతాది వేదాంత గ్రంథములతో ఇది సంవదించుట వలనను - మనకు అన్ని విధముల - ఉపాదేయ మగుచున్నది. ఇదియే శ్రీ విష్ణు సహస్ర నామ ప్రాముఖ్య మని - శ్రీ పరాశరభట్టరువారి శ్రీసూక్తి.

## మహా భారత సారము

పంచమ వేద మని ప్రసిద్ధి గన్న మహాభారతమును రచించిన మహానీయుడు వేదవ్యాసుడు. అతడు సాక్షాత్తు - నారాయణుని అవతారము. ఈ విషయమును గుఱించి, విష్ణుపురాణము -

" కృష్ణద్వైపాయనం వ్యాసం - విద్ధి నారాయణం ప్రభుమ్
కోహ్యన్యో భువి మైత్రేయ! మహాభారత కృత్ భవేత్. "

మైత్రేయా! కృష్ణద్వైపాయనుడు నారాయణుడేయని యెఱుం ు. కాకున్న చో - ఇంకెవ్వడు మహాభారతరచన గావింపగల్గును? ) - ప్రస్తుతించినది.

ఇతడు (= ఈ వేదవ్యాసుడు) - మహా భారతమును - సర్వ స్త్ర సారముగా రచించెను. ఈ విషయమును అతడే స్వయముగ -

" య దిహాస్తి త దన్యత్ర - యన్నేహాఽస్తి న తత్ క్వచిత్. "

దు లేని విషయము - ఇం కెందును ఉండదు' - అని ఘంటాపథ ుగ తెలిపెను. అట్టి మహాభారతమునకు ప్రాణస్థానమైన ఆనుశాస పర్వమునందు, దాన ధర్మాది వివిధ విషయములను విశదీక చుచు - సర్వ ధర్మ సారముగ, నూట తొమ్మిదవ అధ్యాయమున- విష్ణు సహస్రనామ స్తోత్రమును నిబంధించెను. కావున, ఇది - దాచార్య సమాహృతమై, మహాభారత సార మగుచున్నది.

## ధర్మ స్వరూప నిరూపణము

భీష్మాచార్యులు శరతల్పగతుడై, ధర్మరాజు యొక్క ప్రార్థ ను అనుసరించి, అనేక ధర్మములను, ధర్మ సూక్ష్మములను ఉపదే ంచిన విధము - మహాభారతమున - ఆనుశాసనిక పర్వమునందు ాడ నగును. ఆ సందర్భమున ధర్మరాజు -

" కి మేకం దైవతం లోకే - కిం వాఽప్యేకం పరాయణమ్
స్తువ న్తః కం, క మర్చ న్తః - ప్రాప్నుయు ర్మానవా శ్శుభమ్

కో ధర్మ స్సర్వ ధర్మాణాం - భవతః పరమో మతః
కిం జప న్ముచ్యతే జన్తుః - జన్మ సంసార బంధనాత్. ”

రదైవత మేది ? పరమప్రాప్యమైన దేది ? మానవులు శుభము
ను పొందవలయు నన్నచో - ఎవనిని స్తుతించి అర్చింపవలయును ?
న్మ పరంపరనుండియు, సంసార బంధము నుండియు విముక్తుడు
ావలయు నన్నచో-ఏ మంత్రమును జపింపవలయును ?” అని ప్రశ్నిం
గా, భీష్మాచార్యులు ఈ ప్రశ్నలకు శాస్త్ర సమ్మతమైన సమా
ానములను తెలుపుచు -

“ జగత్ప్రభుం దేవదేవం – అనన్తం పురుషోత్తమమ్
స్తువ న్నామ సహస్రేణ – పురుష స్సతతోత్థితః
త మేవ చార్చయ న్నిత్యం – భక్త్యా పురుష మవ్యయమ్
ధ్యాయన్ స్తువన్ నమస్యం చ – యజమాన స్త మేవ చ
అనాది నిధనం విష్ణుం - సర్వలోక మహేశ్వరమ్
లోకాధ్యక్షం స్తువ న్నిత్యం – సర్వ దుఃఖాతిగో భవేత్
బ్రహ్మణ్యం సర్వ ధర్మజ్ఞం – లోకానాం కీర్తి వర్ధనమ్
లోకనాథం మహద్భూతం – సర్వభూత భవోద్భవమ్
ఏషమే సర్వ ధర్మాణాం – ధర్మోఽధికతమో మతః
య ద్భక్త్యా పుండరీకాక్షం స్తవై రర్చే న్నర స్సదా. ”

జగత్ప్రభువు, దేవదేవుడు, అనంతుడు, పురుషోత్తముడు,
ిద్యంత రహితుడు, జగత్కారణము, బ్రహ్మణ్యుడు, సర్వలోకైక
ాథుడును అయిన శ్రీ మహావిష్ణువును సహస్ర నామములతో
్తుతించుచు, పూజించుచు, ధ్యానించుచు, యజ్ఞ యాగాదులచే ఆరా
ించుచుండువాడు-సర్వదుఃఖ వినిర్ముక్తుడగును. కావున, నాయనా !
ధర్మరాజా ! సర్వదా భక్తితో పుండరీకాక్షుని కీర్తించుచు, అర్చించు

చుండుటయే ధర్మము లన్నింటిలోను - ఉత్తమమైన ధర్మము - అని, నా నిశ్చితాభిప్రాయము' అని - నుడివెను. కావున, శ్రీవిష్ణుసహస్ర నామములతో భగవంతుని కీర్తించుట - భీష్మాచార్యులకు అభిమత మైన ఉత్తమ ధర్మ మని - అభివ్యక్త మగుచున్నది.

## చతుర్విధ పురుషార్థ సాధకము

" య ఇదం శృణుయా న్నిత్యం - య శ్చాపి పరికీర్తయేత్
నాఽశుభం ప్రాప్నుయాత్ కించిత్ - సోఽముత్రేహ చ మానవః
వేదాన్తగో బ్రాహ్మణ స్స్యాత్ - క్షత్రియో విజయీ భవేత్
వైశ్యో ధన సమృద్ధ స్స్యాత్ - శూద్ర స్సుఖ మవాప్నుయాత్
ధర్మార్థీ చాప్నుయా ద్ధర్మం - అర్థార్థీ చాప్నుయా ద్ధనమ్
కామా నవాప్నుయా త్కామీ - ప్రజార్థీ చాప్నుయా త్ప్రజాః
భక్తిమా న్యస్సదోత్థాయ - శుచి స్తద్గత మానసః
సహస్రం వాసుదేవస్య - నామ్నా మేత త్ప్రకీర్తయేత్
యశః ప్రాప్నోతి విపులం జ్ఞాతి ప్రాధాన్య మేవ చ
అచలాం శ్రియ మాప్నోతి - శ్రేయః ప్రాప్నో త్యనుత్తమమ్
న భయం క్వచి దాప్నోతి - వీర్యం తేజ శ్చ విందతి
భవ త్యరోగో ద్యుతిమాన్ - బల రూప గుణాన్వితః
రోగార్తో ముచ్యతే రోగాత్ - బద్ధో ముచ్యేత బన్ధనాత్
భయా న్ముచ్యేత భీతస్తు - ముచ్యే తాపన్న ఆపదః
దుర్గా ణ్యతి తర త్యాశు - పురుషః పురుషోత్తమమ్
స్తువ న్నామ సహస్రేణ - నిత్యం భక్తి సమన్వితః
వాసుదేవాశ్రయో మర్త్యో - వాసుదేవ పరాయణః
సర్వపాప విశుద్ధాత్మా - యాతి బ్రహ్మ సనాతనమ్. "

ఈ విష్ణు సహస్రనామ స్తోత్రమును పఠించినను, విన్నను - మానవుడు ఇహ పరములయందు ఎట్టి అశుభములను పొందకుండును. బ్రాహ్మణుడు వేదాంత విజ్ఞానమును, క్షత్రియుడు విజయమును, వైశ్యుడు ధన సమృద్ధిని, శూద్రుడు సుఖమును - ఈ స్తోత్ర పఠన శ్రవణాదులచే పొందును. ఫలాపేక్షతో పఠించువారి కోరికలు నెర వేరగలవు, సంతానార్థి - సంతానమును బడయును. తెల్లవారుజాము ననే లేచి, భక్తితో ఈ స్తోత్రమును పఠించువాడు - ఉత్తమ కులజుని వలె గౌరవింపబడును. కీర్తిని, సకల సంపదలను, బలమును, తేజస్సును, పొందును. ఎచ్చటను ఇతనికి భయము కలుగదు. రోగి - దీనిని పఠించినయెడల, రోగ విముక్తుడగును. భయగ్రస్తుడు నిర్భయుడగును. ఆపదలలో నున్నవాడు ఆపదలనుండి బయటపడును. ఇంత మాత్రమె కాదు. భక్తితో అనుదినము విష్ణు సహస్రనామ స్తోత్రమును పారాయణ జేయుచు, అనన్య చిత్తుడై, వాసుదేవునే ఆశ్రయించియుండువాడు-సర్వపాప వినిర్ముక్తుడై, మోక్షమును సైతము పొందును' - అని చెప్పబడినది. కావున, ఈ స్తోత్రము - చతుర్విధ పురుషార్థ సాధక మనుట స్పష్టము.

## దివ్య శక్తి సంభరితము

ఈ సహస్రనామ స్తోత్రమున గల నామములు-శ్రీమన్నారాయణుని కల్యాణ గుణములను, ఆతని దివ్య చేష్టితములను విశదీకరించుచున్నవి. ఇయ్యవి - లోకమునను, వేదములయందును, విరివిగా ప్రయోగింపబడియున్నవి. త్రికాలజ్ఞులైన - సనక, సనందన, సనత్కుమార - నారదాది మహామునులు - ఈ నామములలో ఒక్కొక్క నామమునకు గల దివ్య శక్తిని స్వానుభవమున తెలిసికొని, కీర్తించిరి. మాలాకారుడు దండను చక్కని - అందమైన పుష్పములతో కూర్చునట్లు. వేదవ్యాస భగవానుడు - ఇట్లు సుపరీక్షితములైన

భగవన్నామములతో - ఈ విష్ణుసహస్రనామ స్తోత్ర మాలికను గ్రథించెను. కావుననే, "ఋషిభిః పరిగీతాని" - అని చెప్పబడినది.

## నామముల ప్రాముఖ్యము - ఫల విశేషము

ఈ స్తోత్రమున గల నామములలో - ఒక్కొక్క దానిని - చతుర్థ్యంతముగ మార్చి, దానికి ముందు ప్రణవమును, చివర - నమ శ్శబ్దమును చేర్చినచో, (ఓం విశ్వాయ నమః, ఓం విష్ణవే నమః) అది - మహా మంత్ర మగుచున్నది. ఇట్టి మంత్రాక్షరములతో కూర్పబడిన ఈ స్తోత్రము - మహా మాలా మంత్ర మగుచున్నది. కావుననే పలువురు మహాశయులు - ఈ స్తోత్రమును - ఐహి కాముష్మిక ఫలసిద్ధికై వినియోగించియున్నారు. ఆయుర్వేదగ్రంథమైన శార్ఙ్గధర సంహితయందు -

" విష్ణుం సహస్ర మూర్ధానం - చరాచరపతిం విభుమ్
స్తువ న్నామ సహస్రేణ - జ్వరాన్ సర్వాన్ వ్యపోహతి. "

విష్ణు సహస్రనామ స్తోత్ర పారాయణము - సర్వవిధ జ్వర నివారకమని తెలుపుచున్నది.

" జన్మాంతర కృతం పాపం - వ్యాధి రూపేణ బాధతే
త చ్ఛాన్తి రౌషధైః దానైః - జప హోమ సురార్చనైః "

అని, మన పెద్దలు - రోగ నివారణకు ఔషధముతో బాటు, దాన - జప - హోమ - సురార్చనాదులను కూడ విధించియున్నారు. ఔషధము శరీరమునకు స్వస్థతను చేకూర్చగా, జప హోమాదులు - మనస్సునకు స్వస్థతను చేకూర్చుచున్నవి. మన పూర్వ జన్మములోని పాపములే - ఈ జన్మమున వ్యాధులుగా మనలను బాధించుచున్నవి.

వీని నివారణకు భగవ దనుగ్రహము తప్ప, మ తేదియు సమర్థము కాదు. విష్ణు సహస్ర నామ స్తోత్ర పారాయణచే - ఇట్టి భగవ దనుగ్రహము సులభముగ లభించును. కావున, జ్వర నివారణకు - ఈ విష్ణు సహస్ర నామ స్తోత్రమును పారాయణ చేయుట - మిక్కిలి ప్రయోజనకర మని తెలుపబడినది ఇట్లే - మేహరోగ ప్రాయశ్చిత్తమునందును —

" త త్రైవ భగవ న్నామ సహస్రం భారతోదితమ్, "

అని, విష్ణు సహస్రనామ పారాయణము విధింపబడినది. ఇయ్యది - కుష్ఠు మున్నగు కఠిన వ్యాధులను సైతము నిర్మూలింపగల్గినదై యున్నది.

మహాకవి బాణభట్టు - తన కాదంబరియందు - సూతికాగృహ ప్రాంగణమున శిశు సంరక్షణకై, విష్ణు సహస్ర నామ స్తోత్రమును పారాయణ చేయుచున్నట్లు -

" అనవరత పరిపర్యమాన నారాయణ నామ సహస్రకమ్. "

అని వర్ణించెను. కావున, ఈ విష్ణు సహస్రనామ స్తోత్రము అమితమైన ప్రభావమును కలిగియున్న దనుట స్పష్టము.

## నారాయణ పారమ్యము - సర్వ ఫలదాయకము

గీతాదులవలె ఇదియు - శ్రీమన్నారాయణ పారమ్యమును, ఆతని అనంత కల్యాణ గుణాకరత్వమును, ఉభయ విభూతి నాయకత్వమును, త్రివిధ జగత్కారణత్వమును - విశదముగ ప్రతిపాదించుచున్నది. కావున, ఈ విష్ణు సహస్రనామ స్తోత్రము మనకు మిక్కిలి

ఉపాదేయమై అలరారుచున్నది. ప్రపన్నులు దీనిని - గుణానుభవ కాలక్షేపములలో అనుసంధించుచుందురు. యజ్ఞ యాగాదులు - నియతాధికారికములు బహుశ్రమ సాధ్యములు. కాని, శ్రీవిష్ణు సహస్రనామ పారాయణము-సర్వాధికారికము, సులభము. "జిహ్వాకీ ర్తయ కేశవం" అను శ్రుతిని - భగవంతుడు మనకు ఇచ్చిన వాక్కును అతనికే ఈ రూపమున సమర్పించుట కర్తవ్యముగదా ! ఈ విధముగా ఇది పురుషార్థ సిద్ధికి సులభోపాయ మగుచున్నది. కావుననే శ్రుతి -

" అస్య జానన్తో నామ చిద్వివక్తన - ధ్రువాసో అస్య కీరయో జనాసః. "

అనుచు, భగవన్నుతి ప్రభావమును ప్రశంసించినది. భగవన్నామము లలో - 'నారాయణ నామము - ఆతని స్వరూప రూప గుణ విభూత్యాదుల నన్నింటిని - సమగ్రముగ తెలుపుచున్నది. కావుననే విష్ణు గాయత్రి -

" నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి। తన్నో విష్ణుః ప్రచోదయాత్. "

అనుచు, నారాయణ శబ్దమును ముందు పేర్కొని యున్నది. సర్వ సంగ వినిర్ముక్తులైన యతీశ్వరులు సైతము - సదా నారాయణ నామమునే స్మరించుచుందురు. మహర్షులును -

" ఆర్తా విషణ్ణా శ్శిథిలా శ్చ భీతాః
ఘోరేషు చ వ్యాధిషు వర్తమానాః
సంకీర్త్య నారాయణ శబ్దమాత్రం
విముక్త దుఃఖా స్సుఖినో భవన్తి. "

" నారాయణేతి మంత్రోఽస్తి - వాగస్తి వశవర్తినీ
తథాఽపి నరకే ఘోరే - పతంతీతి కి మద్భుతమ్ ? "

అనుచు, నారాయణ నామ ప్రభావమును వర్ణించియున్నారు. నారాయణ పదయుతమైన అష్టాక్షరీ మహా మంత్రమును బదరికాశ్రమమునందు - నరునకు నారాయణుడు ఉపదేశించెను. శ్రీ వైష్ణవాచార్యులు - వైష్ణవత్వ సిద్ధికై చేయు పంచసంస్కారములలో - ఈ అష్టాక్షరీ మహా మంత్రమునే ఉపదేశించుచున్నారు.

నారాయణ గాయత్రిలో గల తక్కిన - విష్ణు, వాసుదేవ శబ్దములు సైతము భగవంతుని సర్వ వ్యాపకత్వమును బోధించుచున్నవి. వీనిలో - వాసుదేవ శబ్దము - ఆతని ఆనందమయత్వాదికమును కూడ బోధించుచున్నది. కాని, 'నారాయణ' శబ్దమువలె ఇవి - ఆతని స్వరూప రూప గుణ విభూత్యాదికమును స్పష్టముగ ప్రతిపాదింపజాలకున్నవి. కావున, నారాయణ - విష్ణు - వాసుదేవ శబ్దములు - భగవన్నామములలో - ప్రాధాన్యము వహించుచున్నవి. ఈ మూడింటిలో నారాయణ నామమే - సంపూర్ణ భగవ త్తత్వ్త బోధక మగుటచేత, భగవన్నామము లన్నింటికిని - శిరోరత్నమై యలరారుచున్నది. తక్కిన నామము లన్నియు - ఈ నారాయణ నామమునకు వ్యాఖ్యాన ప్రాయములు. ఈ నామ త్రయము వలె - అచ్యుత, అనన్త, గోవింద - అను నామత్రయము, కేశవాది ద్వాదశ నామములు, చతుర్వింశతి నామములు. శత సహస్ర నామములును - భగవ ద్వైభవమును వేనోళ్ళ కీర్తించుచున్నవి.

" సహస్ర శీర్షా పురుషః సహస్రాక్ష స్సహస్ర పాత్. "

పురుషుడైన భగవానుడు - వేయి శిరములు, వేయి నేత్రములు, వేయి పాదములు గలవాడవి శ్రుతి వర్ణించుచుండ, అట్టి భగవానునకు వేయి నామము లుండుట యుక్తమే గదా ! కావుననే మహా భారతము -

" దేవో నామ సహస్రవాన్. "

అని స్తుతించినది. ఈ కలి యుగమున - నామ సంకీర్తనమే సకల ఫల ప్రదము.

## నామ ప్రభావము

" ధ్యాయన్ కృతే - యజన్ యజ్ఞైః త్రేతాయాం - ద్వాపరేఽర్చయన్
యదాప్నోతి, తదాప్నోతి - కలౌ సంకీర్త్య కేశవమ్. "
" హరే ర్నామైవ నామైవ - నామైవ భవ భేషజమ్
కలౌ నాస్త్యేవ నాస్త్యేవ - నాస్త్యేవ గతి రన్యథా. "

కృత యుగమున ధ్యానము చేతను, త్రేతా యుగమున - యజ్ఞానుష్ఠానముల చేతను, ద్వాపర యుగమున అర్చనల చేతను పొందునట్టి ఫలములను - కలియుగమున - భగవ న్నామ సంకీర్తన లచే పొందగలడు. పాప పంకిలమైన కలి యుగమునకు విరుగుడు భగవన్నామము తప్ప, మఱి యొకటి లేనే లేదు' - అని, మహర్షులు ముక్త కంఠముగా ఘోషించియున్నారు. కావున, భగవ ద్వైభవ ప్రతిపాదకమైన శ్రీ విష్ణు సహస్ర నామ స్తోత్రము మనకు అను దినము - శ్రద్ధాభక్తులతో - అవశ్య పఠనీయ మగుచున్నది.

## దివ్య రసాయనము

ఈ విష్ణు సహస్ర నామ స్తోత్రము -

" విశ్వం విష్ణు ర్వషట్కారః "

అనుచు ప్రారంభమై,

" సర్వ ప్రహరాణాయుధః "

అను నామములో పూర్తి యగుచున్నది. ఇవి యన్నియు-ప్రథమా విభక్త్యన్త నామములే. క్రియా పదము అధ్యాహారము, కావున,

" వనమాలీ గదా శార్ఙ్గీ – శంఖీ చక్రీ చ నన్దకీ
శ్రీమన్నారాయణో విష్ణుః - వాసుదేవోఽభిరక్షతు. "

అను శ్లోకములో ఈ స్తోత్ర పారాయణమును పరిసమాప్తముగావించుచున్నారు. కావున, ఈ స్తోత్రమున గల అన్ని నామములకును-"అభిరక్షతు" అను క్రియతో అన్వయముసిద్ధించును. 'విశ్వాది శబ్దవాచ్యుడైన భగవంతుడు రక్షించుగాక' ! అని భావము, కావున, ఈ సహస్రనామ స్తోత్ర మంతయు ఏక వాక్యమై, మహామాలా మంత్ర మగుచున్నది. "విశ్వం విష్ణుః" అని ఈ స్తోత్రము ఆరంభించుట చేత, 'సర్వము విష్ణు మయము' అను అర్థము స్ఫురించుచున్నది.

" అంత ర్బహి శ్చ త త్సర్వం వ్యాప్య నారాయణ స్స్థితః "

అను శ్రుతి - చేతనాచేతనము లన్నింటి యందును - భగవంతుని-ఈ బహిరంతర్వ్యాప్తినే గదా బోధించునది ! ఆకాశము వలె అంతటను వ్యాపించియున్న తత్త్వము ధ్యాన గోచర మగుట దుర్లభము. కావున నే - సర్వ వ్యాపియైన ఆ భగవంతుడు - సర్వ వ్యాపిగనే కాక -

" న చే రూపం – న చాకారో – భక్తానాం త్వం ప్రకాశసే. "

అని తెలిపినరీతిగా, తనను, అనన్య భక్తితో సేవించు మహా భక్తులకు దర్శన మొసంగి, వారిని ఆనందింపజేయుచు, తానును, ఆనందించుట కొఱకు - దివ్య మంగళ విగ్రహమును దాల్చును. ఇది అతనికి - అతని భక్తులమీద గల వాత్సల్యమునకు నిదర్శనము. ఈ విషయమునే -

" శంఖభృ న్నన్దకీ - శార్ఙ్గధన్వా గదాధరః
రథాంగపాణి రక్షోభ్యః సర్వ ప్రహరణాయుధః. "

అను చివరి శ్లోకము సూచించుచున్నది. భగవంతునకు చక్రాద్యాయుధ ధారణము - భక్తుల ఆశ్వాసము కొఱకే - అని గ్రహింప వలయును. మఱియొక విధముగా అవి అతనికి ఆభరణములును అగుచున్నవి. ఈరీతిగా - ఈ స్తోత్రము - భగవంతుని పర వ్యూహ విభవ అంతర్యామి అర్చా స్వరూప వైభవ ప్రకాశకమై, సులభానుసంధేయమై, సంసార తాప సంతప్తులైన చేతనులకు దివ్య రసాయనమై యొప్పుచున్నది.

'సహస్ర నామము' అని ప్రసిద్ధమైన ఈ స్తోత్రమున - 1008 నామములు గలవు. ఈ నామములను నిర్ణయించుటలోను - అభిప్రాయ భేదములు గలవు. అట నట కొన్ని పాఠ భేదములు - ఏక పద నామములు, సమస్త పద నామములు, అసమస్త నామములు - అని, మూడు విధములుగా నున్నవి. "విశ్వం విష్ణుం" ఇత్యాదులు ఏక పద నామములు. "భూత భవ్య భవ త్ప్రభుః", "ప్రధాన పురుషేశ్వరః" - ఇత్యాది నామములు - సమస్తములు. అనగా, రెండు మూడు పదములతో కూడి ఏర్పడినవి. "ముక్తానాం పరమా గతిః", 'ధాతు రుత్తమః' - ఇత్యాదులు - భిన్న విభక్తిపదములైన పదములతో కూడి ఏర్పడినవి. "నిధి రవ్యయః", "గురు ర్గురుతమః" - ఇత్యాది నామములు - సమాస విభక్తికములైన పదములతో కూడినవి. ఈ స్తోత్రమున గల నామములు కొన్ని - వ్యాఖ్యాన సాపేక్షములు. ఇట్లే కొన్ని నామములు వాచకములు కాగా, కొన్ని గౌణములు. మఱికొన్ని వ్యంజకములు. "విష్ణుః - కేశవః", వంటి పదములు

వాచకములు, నిరూఢములు. అక్షరః - ప్రధాన పురుషేశ్వరః" ఇత్యాదులు - యౌగికములు. "అహః భోజనమ్" - ఇత్యాదులు - గౌణములు. " సత్కీర్తిః - ఛిన్నసంశయః " ఇత్యాదులు - అర్థ భేదముచే, సమర్థనీయములు. "విశోకః, శోకనాశనః"-"విశుద్ధాత్మా విశోధనః" ఇత్యాదులు - సమర్థ్యసమర్థకములు - ఇట్టి అనేక నామముల స్వారస్యము - అనుభవైకవేద్యము.

" శ్రీద శ్రీశ శ్రీనివాస శ్రీనిధి శ్రీవిభావనః. "

" యజ్ఞో యజ్ఞపతి ర్యజ్వా - యజ్ఞాంగో యజ్ఞవాహనః "

ఇత్యాది శ్లోకములు - ప్రాసచేత, కర్ణపేయములై యున్నవి. ఇట్లు - ఈ స్తోత్ర మంతయు - శబ్ద సౌష్ఠవము చేతను, అర్థ సౌష్ఠవము చేతను - హృదయంగమ మగుచున్నది.

## స్తోత్ర వ్యాఖ్యానములు

శ్రీ విష్ణు సహస్ర నామ స్తోత్రమునకు - అనేక వ్యాఖ్యానములు గలవు. వానిలో శంకరాచార్యులవారి వ్యాఖ్య - ప్రాచీనమైనది. దీని తర్వాత పేర్కొన దగిన వ్యాఖ్య - శ్రీ పరాశరభట్టరు వారి వ్యాఖ్య. ఈ వ్యాఖ్య - రస భరితమై, భగవ ద్భక్తులకు ఉపాదేయమై యున్నది. స్థాలీ పులాకన్యాయముగ - ఇందులకు ఒక్క ఉదాహరణము :-

" విజితాత్మా విధేయాత్మా - సత్కీర్తిః ఛిన్నసంశయః. "

ఈ శ్లోకమునకు - పై ఇరువురు వ్యాఖ్యలను పరిశీలింతము :-

విజితాత్మా – జితేంద్రియుడు – అని, శంకరాచార్య వ్యాఖ్య. తనను ఆశ్రయించినవారికి తాను వశ్యుడై, భక్తులగువారికి విజయము నొసంగి, తాను అపజయమును స్వీకరించువాడు– అని, పరాశరభట్టరు వారి వ్యాఖ్య. కురుక్షేత్ర యుద్ధమున భీష్మాచార్యుల ప్రతిజ్ఞను నెరవేర్చుటకై, తన ప్రతిజ్ఞకు భంగకరముగ – శ్రీకృష్ణ పరమాత్మ చక్రాయుధమును చేబట్టెనుగదా !

" విజితాత్మా విధేయాత్మా. "

అనునెడ, 'అవిధేయాత్' అని పదచ్ఛేదము చేసి, ''అనన్యవశ్యుడు' అని – శంకరాచార్యులు అర్థమును తెలిపిరి. శ్రీ పరాశరభట్టరు – 'విధేయాత్మా' – అని పదచ్ఛేదము గావించి, 'భక్తవశ్యుడు' – అని అర్థమును వ్రాసిరి. యశోదకు, అర్జునునకు – విధేయుడైన విధమును గమనింతము :–

సత్కీర్తిః = మంచి శక్తి గలవాడు – అని శంకరవ్యాఖ్య. సౌలభ్య – సౌశీల్యాది గుణములచే ఏర్పడిన యథార్థమైన శక్తిగల వాడు – అని శ్రీ భట్టరువారి వ్యాఖ్య. సౌశీల్యమునకు శ్రీరామావతారము, సౌలభ్యమునకు శ్రీకృష్ణావతారము – ప్రసిద్ధములు. ఇట్లే –

ఛిన్న సంశయః = సందేహ గంధ రహితుడు – అని శంకర వ్యాఖ్య. ఇతడు మనకు సులభుడో, కాడో – అను భక్తుల సందేహమును పటాపంచలు చేయువాడు – అని, పరాశరభట్టరువారి వ్యాఖ్య. గజేంద్ర వృత్తాంతము ఇందులకు ఉదాహరణము. ఈ విధముగ – శ్రీ పరాశరభట్టరువారి వ్యాఖ్య – రసవత్తరార్థమును బోధించుచు, ఉపాదేయతమమై యొప్పుచున్నది.

★

# విష్ణు భగవానుని దివ్య వైభవము

' విద్యాభూషణ - కవితా విశారద '

శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు

శ్రీ రామానుజ కీర్తి కౌముదీ సంపాదకులు

★

## 1. విష్ణు స్తుతి

" మేఘశ్యామం పీతకౌశేయవాసం
శ్రీవత్సాంకం కుండలోద్భాసితాంగమ్
పుణ్యోపేతం పుండరీకాయతాక్షం
విష్ణుం వన్దే సర్వలోకైకనాథమ్. "

## 2. ఆరంభ వాక్యము

శ్రీ మహావిష్ణువు–సృష్టి స్థితి లయములకు కారణభూతుఁడు. ఆ మహా విష్ణువు - అణువులో అణువునై, మహత్తులో మహత్తునై - అంతటను వ్యాపించియున్నాఁడు. ఆ జగన్నాథుఁడు – జ్ఞానము, శక్తి, బలము, ఐశ్వర్యము, వీర్యము, తేజము – అనఁబడు షడ్గుణైశ్వర్యములు సమృద్ధముగాఁ గలవాఁడు. ఆ స్వామికంటెను మించినవాఁడు మఱియొకఁడు లేఁడు. ఈ యంశములు మనకు–వేద శాస్త్ర పురాణేతిహాసముల మూలమున తెలియవచ్చుచున్నవి.

## 3. సృష్టి రచన

"అథ పురుషోహ వై నారాయణోఽకామయత ప్రజాస్సృజే యేతి నారాయణాత్ప్రాణో జాయతే. మన స్సర్వేంద్రియాణి చ. ఖం వాయు ర్జ్యోతి రాపః పృథివీ

విశ్వస్య ధారిణీ. నారాయణా ద్బ్రహ్మా జాయతే. నారాయణా ద్రుద్రో జాయతే. నారాయణా దింద్రో జాయతే నారాయణాత్ ప్రజాపతయః ప్రజాయన్తే. నారాయణాత్ ద్వాదశాదిత్యా రుద్రా వసవః సర్వాణి చ ఛందాగుంసి. నారాయణా దేవ సముద్యన్తే. నారాయణే ప్రలీయన్తే. ” —(నారాయణోపనిషత్తు 1)

పురుషోత్తముఁడైన నారాయణుఁడు – ఒకానొకపుడు జీవరాసులను సృష్టింపవలెనని సంకల్పించెను అపుడా నారాయణుని వలన – ప్రాణు లుద్భవించెను. అనంతరము – ఆకాశము, వాయువు, నిప్పు, నీరు, భూమి – మొదలగునవి పుట్టెను. తదుపరి – బ్రహ్మ, రుద్రుడు, అష్ట వసువులు, ద్వాదశాదిత్యులు, ఏకాదశ రుద్రులు, ఉత్పన్నమైరి అటుపిమ్మట – సకల ఛందములు, వేదములును – ఉద్భవించెను. అవి యన్నియు – నారాయణునివలననే వృద్ధి పొందినవి, తిరిగి – నారాయణునియందే లీన మగుచున్నవి ”

## 4. విష్ణు భగవానుని వైశిష్ట్యము

“ ఓమ్. అథ నిత్యో నారాయణః. బ్రహ్మా నారాయణః శివ శ్చ నారాయణః శక్ర శ్చ నారాయణః ద్యావా పృథివ్యౌ చ నారాయణః. కాల శ్చ నారాయణః ఊర్ధ్వ శ్చ నారాయణః. అధ శ్చ నారాయణః అంత ర్బహి శ్చ నారాయణః నారాయణ ఏవేదగుం సర్వమ్ య ద్భూతం, య చ్చ భవ్యమ్. నిష్కళంకో, నిరంజనో, నిర్వికల్పో, నిరాఖ్యాత శ్శుద్ధోదేవ ఏకో నారాయణః న ద్వితీయోఽస్తి కశ్చిత్ ” — (నారాయణోపనిషత్తు · 2)

నారాయణుఁడు శాశ్వతుఁడు. నారాయణుఁడు బ్రహ్మ, శివుడు, ఇంద్రుఁడు, నారాయణుఁడే. భూమి, ఆకాశము, కాలము, దిక్కులును – నారాయణుఁడే ఊర్ధ్వ భాగము, అధోభాగము, లోపల, వెలుపల – అంతటను నారాయణుడే. ఇంతకుమున్ను ఉన్న వాఁడును, ఇఁకముందు ఉండబోవువాఁడును నారాయణుఁడే. భాగ

విభాగములు లేనివాఁడు, కర్తృకము లేనివాఁడు, కర్మలు లేనివాఁడు, పరిశుద్ధమైనవాఁడును - నారాయణుఁడే."

## 5. విష్ణు లోక ప్రశస్తి

౧. " లోక వైకుంఠ నామానం - దివ్య షాడ్గుణ్య సంయుతమ్
అవైష్ణవానా మప్రాప్యం - గుణ త్రయ వివర్జితమ్ "— (బ్రహ్మ సంహిత)

విష్ణు భగవానుని నివాస స్థాన మగు వైకుంఠ లోకము - షడ్గుణైశ్వర్య సంపన్నమైనది, విష్ణు భక్తులు కానివారికి లభ్యము కానిది, ప్రకృతికి సంబంధించిన సత్త్వ రజ స్తమోగుణములు లేనిది."

౨. " విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః. "— (యజుర్వేదము · 1-15-6.)

విష్ణుభగవానుని నివాస స్థాన మగు పరమపదమునందు - మధువు (అమృతము) సమృద్ధముగాఁ గలదు."

౩. " పరమ పద మవభాతి భూయః " —(ఋగ్వేదము : 1-12-6.)

ఆ పరమపదము - అత్యంతము ప్రకాశవంతమైనది.

౪. " త ద్విష్ణోః పరమంపదం - సదా పశ్యన్తి సూరయః. "
— (ఋగ్వేదము : 6-1-6.)

" ఆ విష్ణు భగవానుని పరమపదమును - అనంత, గరుడ, విష్వక్సేనాది నిత్యసూరులు - నిరంతరము సంసేవించుచుందురు. "

" త్రిపాద స్యామృతం దివి. " — (పురుష సూక్తము)

" ఆ పరమ పదము - 'త్రిపా ద్విభూతి' యను పేరు గలది. అమృత స్వరూపమైనది. "

ఇట్టి శ్రుతి వాక్యములనుబట్టి - విష్ణులోక వైశిష్ట్యము సుస్పష్టము -

ఇట్టి శ్రుతి వాక్యములు మాత్రమె గాక, ఇతిహాస శ్రేష్ఠము లైన రామాయణ - మహాభారతములందును, భాగవత - విష్ణు - బ్రహ్మ పురాణము లందును, నారద పంచరాత్రమునందును, బృహత్ భాగవతమునందును, బ్రహ్మతంత్రమునందును, ప్రపన్నామృతమునందును, మఱికొన్ని గ్రంథము లందును - వైకుంఠ లోక వైభవము - బహు రమణీయముగ అభివర్ణింపబడియున్నది.

## 6. విష్ణు స్వరూపము

౧. చతు ర్భుజములు :-

" ధర్మార్థ కామ కేయూరైః - దివ్యైః దివ్యమయేరితైః "

ధర్మార్థ కామ మోక్షము లనబడు చతుర్విధ పురుషార్థ సూచకముగ విష్ణుభగవానుడు - తన భుజములలో - దివ్యమైన నాల్గు కేయూరములను ధరించియున్నాడు.

౨. పాంచజన్య శంఖము :-

" అపాం తత్త్వం దరవమ్ " — (భాగవతము . 12-11-14)

'పాంచజన్య శంఖ మనబడు విష్ణుభగవానుని శంఖము = జల తత్త్వము గలది' - అని భాగవత మనుచుండ,

" పంచభూతాత్మకం శంఖం - కరే రజసి సంస్థితమ్. "

పృథివ్యాపస్తేజో వాయు రాకాశము లనబడు పంచభూతాత్మకమైన దని - గోపాలతాపిన్యుపనిషత్తు (25) వివరించుచున్నది.

౩. సుదర్శన చక్రము :-

" తేజ స్తత్వం సుదర్శనమ్. "

" బాల స్వరూప మి త్యుక్తం - మన శ్చక్రం సుదర్శనమ్. "

విష్ణుభగవానుని సుదర్శన చక్రము - తేజ స్తత్వము కలిగి. బాలుని స్వభావము వలె - చంచల స్వభావము గల్గియున్నది.

౪. శార్ఙ్గము (గద) :-

" తేజ స్సహో బలయుతం - ముఖ్యం తత్త్వం గదాం దధత్ "

(భాగవతము : 12-11-14)

బల సంయుతమై, ముఖ్యమైన ప్రాణ తత్త్వము గల గదను - విష్ణుభగవానుడు - తన కరములో ధరించియున్నాడు.

౫. పద్మము :-

" పద్మం విశ్వకరే స్థితమ్. "

విష్ణుభగవానుని హస్తమున శోభిల్లు పద్మము - విశాల విశ్వమును సూచించును. అనగా - విష్ణుభగవానుని హస్తమునగల పద్మములో - విశ్వ మంతయు - ఇమిడియున్నదని తాత్పర్యము.

" భగవాన్ భగ శబ్దార్థం - లీలా కమల ముద్వహన్. "

— (భాగవతము : 12-11-18)

సకల సంపదలు, సౌఖ్యము, లక్ష్మి, జ్ఞానము, వైరాగ్యము - అనఁబడు ఐదింటిని - విష్ణుభగవానుఁడు తన పద్మములో ధరించి యున్నాఁడు.

౬. లక్ష్మిదేవి :-

" నిత్యై వేషా జగన్మాతా - విష్ణో శ్శ్రీ రనపాయినీ
యథా సర్వగతో విష్ణుః - తథై వేయం ద్విజోత్తమ ! "
— (విష్ణు పురాణము . 1-7-18)

జగన్మాతయైన లక్ష్మీదేవి - విష్ణుభగవానుని ఎన్నడును వీడి యుండదు. విష్ణుభగవానుఁడు ఏ యవతారమును ధరించునో - ఆ యవతారమునకు తగిన యవతారమును ఆ లక్ష్మీదేవియు ధరించు చున్నది.

## 7. పరివారము - పరికరములు

౭. గరుత్మంతుఁడు :-

" వైనతేయ శ్చ పక్షిణామ్ " — (భగవద్గీత . 10-30)

'పక్షులలో నేను గరుత్మంతుఁడను' అని - గీతలో కృష్ణపర మాత్మ పలికినాఁడు కదా ! ఈ గరుత్మంతుఁడు - సర్వ వేద మయుఁడుగా, అఖండ జ్ఞాన సంపన్నుఁడుగా - నిత్యసూరులలో నొకడుగా - సుప్రసిద్ధుఁడు.

౮. **ద్వారపాలకులు :– పార్షదులు :–**

" చండ ప్రచండౌ ప్రాగ్ద్వారే - యామ్యే భద్ర సుభద్రకౌ
పశ్చిమే జయ విజయౌ చ - అన్యే ధాత్రు విధాతృకౌ "

తూర్పు వైపున చండప్రచండులు, దక్షిణమున - భద్ర సుభద్రులు, పశ్చిమమున - జయ విజయులు, ఉత్తరమున - ధాత్రు విధాతృలు - విష్ణుభగవానుని వైకుంఠ నగరమున - ద్వారపాలకులుగా నున్నారు.

౯. **అణిమాది అష్టసిద్ధులు :–**

" చండాదయోఽష్టౌ ద్వాదస్థాః - తే ఽణిమాద్యా హరే ర్గుణాః. "

చండాది ద్వారపాలకులు ఎనమండుగురును - అణిమాది అష్ట శక్తి స్వరూపులై యున్నారు.

౧౦. **సేనాధిపతి :–**

" దౌవారికేషు య శ్చండః - ప్రాగ్ద్వారే ప్రథమోఽభవత్
విష్వక్సేన సమాఖ్యాతః - సర్వ సైన్యాధిపోదితః. "

తూర్పువైపున నుండు ద్వారపాలకులలో - 'చండుఁడు' అనువతఁడు - విష్వక్సేన నామాంకితుండై, సేనానాయకుడుగను - వ్యవహరింపబడుచున్నాఁడు' - అని, శ్రీపాంచరాత్ర ఆగమ శాస్త్రమనుచుండ,

" విష్వక్సేన స్తత మూర్తిః - విదితః పార్షదాధిపః. "

పార్షదులలో విష్వక్సేనుఁడు అధికుడని - భాగవత మనుచున్నది. (12-11-20.)

౧౧. విష్వక్సేనుని వైశిష్ట్యము :-

శ్రీవైష్ణవ గృహములలో - శుభాశుభ కార్యములందు మున్ముందుగా - ఈ విష్వక్సేనుని పూజించుట - అనూచానముగ వచ్చుచున్న ఆచారము. అట్లు పూజించుట వలన, సంకల్పించిన శుభాశుభ కార్యములు - నిర్విఘ్నముగ నెరవేరగల వని శ్రీవైష్ణవుల విశ్వాసము. ఈ విష్వక్సేన పూజా విధాన మంత్రయు - శ్రీ పాంచరాత్ర - ఆగమ శాస్త్రములలో - వివరింపఁబడియున్నది.

౧౨. విష్వక్సేన స్తుతి :-

" విష్వక్సేనం, సకల విబుధ ప్రౌఢ సైన్యాధినాథం
ముద్రా చక్రే - కరతల యుగే - శంఖదండౌ దధానమ్
మేఘశ్యామం - సుమణి మకుటం - పీతవస్త్రం - శుభాంగం
ధ్యాయే ద్దేవం - విజిత దనుజం - సూత్రవత్యా సమేతమ్. "

జ్ఞానవంతులు, సమర్థులు నగు విష్ణుసేనలకు నాయకుఁడు, హస్తములలో - ముద్రయు, చక్రము, శంఖము, వేత్ర దండము-అను వానిని ధరించినట్టియు, నీలమేఘము వంటి శరీర వర్ణము గలవాఁడు, మణులతోఁ గూడిన కిరీటమును శిరమున ధరించినవాఁడు, స్వచ్ఛమైన శరీరము గలవాఁడు, రాక్షసులను జయించినవాఁడు, సూత్రవతీ సమేతుఁడు నగు విష్వక్సేనుని ధ్యానించుచున్నాను.'

## 8. విష్ణు భక్తులకు - ప్రణామాంజలి

" కూర్మాదీన్ దివ్య లోకాన్-తదను మణిమయం మంటపం - తత్ర శేషం
తస్మిన్ ధర్మాదిపీఠం - తదుపరి కమలం - చామర గ్రాహిణీ శ్చ
విష్ణో ర్దేవీ ర్విభూషాయుధగణ మురగం - పాదుకే వైనతేయం
సేనేశం ద్వారపాలాన్ - కుముద ముఖగణాన్-విష్ణు భక్తాన్ ప్రపద్యే."

కూర్మాది దివ్యలోకములను, అనంతరము - మణిమయమైన
ండపమును, అందలి ఆదిశేషుని, ఆ యాదిశేషునిపైఁ గల ధర్మాధి
రమును, ఆ పీఠముపై గల పద్మమును, ఆ పద్మమునకు ఇరువైపు
ంపుఁ గల చామర ధారిణులను, విష్ణుభగవానుని దేవేరి యగు లక్ష్మీ
దేవిని, శంఖ చక్రాది ఆయుధములను, సర్పమును, పాదములకడ
ల గరుత్మంతుని, సేనానాయకుఁడైన విష్వక్సేనుని, కుముద -
ముదాక్షాది ద్వారపాలకులు మున్నగాగల - విష్ణుభక్తులగువారి
ల్లరను అభివందించుచున్నాను."

## 9. వేదములలో విష్ణువు

" వేదేషు పౌరుషం సూక్తం - ధర్మ శాస్త్రేషు మానవమ్
భారతే భగవద్గీతా - పురాణేషు చ వైష్ణవమ్. "

వేదములలో పురుష సూక్తము, ధర్మశాస్త్రములలో - మను స్మృతి, భారతములో - భగవద్గీత, పురాణములలో - విష్ణు పురాణము - ప్రముఖములై యున్నట్లు - ప్రాజ్ఞుల వక్కాణ. కనుక, తదను సారము - ఇట మున్ముందు - పురుష సూక్తమును పరిశీలింతము :-

" సహస్ర శీర్షా పురుషః । సహస్రాక్ష స్సహస్ర పాత్
స భూమిం విశ్వతో వృత్వాం । అత్య తిష్ఠ ద్దశాంగులమ్. "

అను మొదటి అనువాకములో - పురుషుఁడు, పురుషోత్తముఁడు నగు విష్ణుభగవానుఁడు - వేయి శిరస్సులు, వేయి నేత్రములు, వేయి పాదములును కలవాఁడై, భూలోక మంతయు వ్యాపించియున్నాఁడనియు, పది యంగుళముల పొడవున - సకల లోకములలో వ్యాపించి యున్నాఁడనియు - తెలుపఁబడినది. ఇట్లే, పురుష సూక్తములో -

శేషించిన అనువాకము లన్నింటియందును - విష్ణుభగవానుని దివ్య వైభవము వర్ణింపబడియున్నది. అంతియగాక -

2. యో దేవేభ్య ఆతపతి — (యజుర్వేదము : 31-17)
3. విష్ణోః కర్మాణి పశ్యత — ( ,, 3- 4)
4. ఇదం విష్ణు ర్విచక్రమే — ( ,, 3-15)
5. త ద్విష్ణోః పరమం పదమ్ — ( ,, 6- 5)
6. తదస్య ప్రియ — (ఋగ్వేద మండలము : 1-15-4)
7. పురుష ఏవేదగుం సర్వమ్ — (యజుర్వేదము : 31- 2)
8. న తే విష్ణుః — (ఋగ్వేదము : 7-99)
9. యా తే ధామాన్ — (శుక్ల యజుర్వేదము 6-3)
10. త ద్విప్రాసో విపన్య వోజా— (యజుర్వేదము . 34-44)
11. త్వష్టా విష్ణుః — (అధర్వ వేదము 8-17-4)
12. దివో వా విష్ణుః — ( ,, )
13. ఓంకారం చతుర్భుజమ్ — (ఋగ్వేద పరిశిష్టము : 10-4-22)
14 నారాయణాయ విద్మహే — (తైత్తిరీయ - ఆరణ్యకము : .... )
15. విష్ణు ర్గోపా ఽదాభ్యః — (ఋగ్వేదము : 5-122-7)
16. నారాయణపరో — (నారాయణోపనిషత్తు : 9-7)

ఇత్యాది - వేద ప్రమాణములు సైతము - విష్ణుభగవాన ప్రభావమును విశదము గావించుచున్నయవి. ఇంక - పురాణేతిహాసః లను గాంతము.

## 10. పురాణేతిహాసములలో - విష్ణువు

1. నారాయణపరోఽచిన్త్యః — (విష్ణు పురాణము . 1-440)
2. సృష్టి స్థిత్యన్త — ( ,, : 1-2-66)
3. బ్రహ్మత్వే సృజతే — ( ,, : 1-19-66)
4. అహం హరిః — ( ,, ,, )
5. సకల ఖిద మహాన్ — ( ,, . 37-62)
6. త్వా మారాధ్య — ,, : 1-4-170)
7. పరమాత్మా చ సర్వేషాం — ,, : 6-5-40)
8. దేవ తిర్య ఙ్మనుష్యేషు — ( ,, . 1-8-87)
9. నారాయణ శ్చ — (బ్రహ్మ వైవర్త పురాణము - ప్రకృతిఖండము 54-13-95)
10. నారాయణపరా యజ్ఞాః — (బ్రహ్మ పురాణము : 60-62)
11. నారాయణపరో యజ్ఞః — (మత్స్య పురాణము : 246 - 36)
12. యజ్ఞో హి భగవాన్ విష్ణుః — (విష్ణుధర్మోత్తరము . 162-2)
13. యజ్ఞరూపో హి విష్ణుః — (దేవీ భాగవతము . 9-48-12)
14. భగవాన్ సర్వ యజ్ఞభుక్ — (శ్రీమద్భాగవతము . 14-17)
15. సర్వదేవమయో విష్ణుః — (పద్మపురాణము - సృష్టిఖండము · 64-34)
16. నాస్తి విష్ణుసమో దేవః — ( ,, ఉత్తర ఖండము : 37-79)
17. నాస్తి తీర్థమయో విష్ణుః — ( ,, ,, : 86-328)
18. సర్వ పాప హరో విష్ణుః — ( ,, ,, : 126-69)
19. ఈశ్వరో భగవాన్ విష్ణుః — ( ,, ,, : 226-67)

20. విష్ణు రేవ పరంబ్రహ్మ — ( ,, పాతాళ ఖండము : 68-98)
21. యజ్ఞరూపీ విష్ణు రహామ్ — (దేవీ భాగవతము : 9-45-67)
22. అహం క్రతుః — (భగవద్గీత : 9-16)
23. అహం హి సర్వ యజ్ఞానాం— ( ,, : 9-24)
24. ఏతస్మి న్నంతరే విష్ణుః — (వాల్మీకి రామాయణము : 1-15-76)
25. జలే విష్ణుః స్థలే విష్ణుః — (విష్ణు పంజర స్తోత్రము . 28)

ఇత్యాది పురాణేతిహాసము లందును - విష్ణు భగవానుని ప్రభా వము - బహు భగులుగా వర్ణింపబడియున్నది.

## 11. విష్ణ్వారాధన ప్రభావము

౧. " దేవతారాధనం కృత్వా - దన సంపద మిచ్ఛతి
పుత్రా నిచ్ఛన్తి రాజ్యం చ - శ్రేయ స్త ప్రాప్తి రేవ చ. "
—(విష్ణు పురాణము : 2-15-8.)

విష్ణుభగవానుని ఆరాధించువారలకు - ధన సంపద, పుత్ర సంపద, రాజసంపదయు - లభించును. శుభము చేకూరును.

౨. మార్గశీర్ష శు క్లైకాదశ్యాం ఉపోషితో - ద్వాదశ్యాం భగవన్తం వాసుదేవ మర్చ యేత్. పుష్పం,దూపానులేపనేన-దీప నైవేద్యైః, వైష్ణవ తర్పణైశ్చ. వ్రత మేతత్ సంవత్సరం కృత్వా, పాపేభ్యః పూతో భవతి యావ జ్జీవం కృత్వా - శ్వేతద్వీప మాప్నోతి. ఉభయ పక్ష ద్వాదశ ష్వేదం సంవ త్సరం కృత్వా, శ్వేతద్వీప మాప్నోతి. ఉభయపక్ష ద్వాదశీష్వేషు - సంవ త్సరేణ - స్వర్గ లోకం ప్రాప్నోతి. యావజ్జీవం కృత్వా - విష్ణు లోకమ్."
— (విష్ణు స్మృతి : 49-1 నుండి 7 వరకు)

మార్గశీర్ష శుద్ధ ఏకాదశీ తిథి యందు వాసుదేవ భగవానుని - పుష్ప, చందన లేపన, ధూప, దీప, నైవేద్యాది షోడశోపచారము లతో పూజించి, అనంతరము - వైష్ణవులకు తర్పణము చేయవలెను. ఈ రీతిగా ఎవఁరేని ఒక సంవత్సర కాలము వ్రత మాచరించిన యెడల, అతఁడు పాప విముక్తుడై, పునీతుఁ డగును. ఇట్లు జీవితాంతము వఱకు ఈ వ్రత మాచరించిన యెడల, శ్వేతద్వీపమున కేగును. ఇట్లే, శుక్ల - కృష్ణ పక్షముల రెంటి యందును ఒక సంవత్సర కాలము వ్రత మాచ రించిన యెడల, స్వర్గ ధామమును పొందును. జీవితాంతము వఱకు ఈ వ్రత మాచరించినయెడల, ఆతనికి మోక్షసామ్రాజ్యము లభిం చును."

౩. "మ దుపాసకః సర్వోత్కృష్టః భవతి. మ దుపాసనయా - సర్వమంగళాని భవన్తి. మ దుపాసనయా సర్వం జయతి. మ దుపాసకః సర్వవన్ద్యో భవతి. మ దుపాసకస్య అసాధ్యం న కించి దస్తి. సర్వబంధాః ప్రవి నశ్యన్తి. సద్వృత్త మివ - సర్వే దేవా స్తం సేవన్తే, మహా శ్రేయాని చ లభన్తే." — (త్రిపాద్విభూతి నారాయణోపనిషత్తు : 8-18)

న న్నుపాసించునతఁడు - మిక్కిలి గొప్పవాఁ డగును. న న్నుపా సించుటచేత, శుభములు చేకూరును. నా ఉపాసనచేత - సర్వమును జయించును. న న్నుపాసించు నతఁడు - ఎల్లఱిచేతను అభినందితుఁ డగును. న న్నుపాసించువానికి అసాధ్య మేదియు నుండదు. సంసార బంధము లన్నియు - పటాపంచ లగును. అట్టి సచ్చరిత్రుని - దేవ తలు సేవింతురు. మహాశ్రేయములు లభించును" - అని - విష్ణు భగవానుఁడే స్వయముగ తెలియఁజేసియున్నాఁడు.

ఇట్టి ప్రమాణములనుఁబట్టి, విష్ణుభగవానుని - భక్తిప్రపత్తులతో సేవించువారికి - సర్వ శ్రేయములు లభించు ననుట - స్పష్టము.

" క్షీరోదధే రుత్తరతః - శ్వేతద్వీపో మహాప్రభః
తత్ర నారాయణాపరా మానవా శ్చంద్రవర్చసః
నిరింద్రియా నిరాహారాః - అనిష్పన్నా సుగంధినః
ఏకాంతభావోపగతా స్తే భజన్ పురుషోత్తమమ్. "

## 12. శ్వేతద్వీప నిరూపణము

శ్వేతద్వీపము - క్షీరసాగరమునకు ఉత్తరపు వైపున, మేరు పర్వతమునుండి - సుదూరములోఁ గలదు. ఈ శ్వేతద్వీపములో - విష్ణుభగవానుని - అనన్య భక్తి భావముతో భజించునట్టి కొందఱు మానవులు - స్థూల శరీర రహితులై, నిరాహారులై, నిశ్చేష్టులై, చంద్రకాంతి వలె తేజరిల్లుచుందురు. వారి వద్దనుండి - సువాసనలు వచ్చుచుండును."

ఈ శ్వేత ద్వీప వృత్తాంతము - ఈ రీతిగ మహాభారతము నందలి శాంతిపర్వమునందు (336-28, 29) మాత్రమే గాక, విష్ణు ధర్మోత్తర పురాణమునందును వర్ణింపఁబడియున్నది.

## 13 శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్ర మహిమ

విష్ణుసన్నిభుఁడైన వేదవ్యాసుఁడు - మహాభారత తేతిహాసమును రచించుచు, అందు - మోక్షధర్మపర్వ మనఁబడు అనుశాసనిక పర్వమునందు - విష్ణుసహస్రనామస్తోత్రము నొకదానిని నిబంధించి యున్నాఁడు. ఈ స్తోత్రము - మహత్తరమైనది, మహా ఫల ప్రద మైనదియు,

"జగత్తునకు ప్రభువు, దేవదేవుఁడు, అనంతుఁడు, పురుషోత్త ముఁడు నగు విష్ణుభగవానుని - సహస్రనామములతో స్తుతింపవలెను.

పురుషుఁడు - అవ్యయుఁడు నగు ఆ విష్ణుభగవానునే నిత్యము భక్తి భావముతో ధ్యానించుచు, స్తుతించుచు-నమస్కరింపవలెను. అనాది నిధనుఁడు, సకల లోకైకనాథుఁడు నగు విష్ణుభగవానుని నిత్యము స్తుతించినచో - అట్టి యతఁడు సర్వ దుఃఖములనుండి విముక్తుఁడం గాఁగలఁ"డని, మహనీయుఁడు, మాన్య చరితుఁడు, కురువృద్ధుఁడు నగు భీష్మాచార్యుఁడు శరతల్పగతుఁడై యుండియు-మనలకుబోధించి యున్నాఁడు. కావున, ఎల్లరును ఈ విష్ణు సహస్రనామ స్తోత్రమును పారాయణము గావించి,ఐహిక-ఆముష్మిక ఫలములను పొందవచ్చును.

## 14. శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రము

శుక్లాంబరధరం విష్ణుం - శశివర్ణం చతుర్భుజమ్
ప్రసన్న వదనం ధ్యాయేత్ -సర్వ విఘ్నోపశాంతయే. ౧

యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్
విఘ్నం నిఘ్నంతి సతతం - విష్వక్సేనం త మాశ్రయే. ౨

వ్యాసం వసిష్ఠ నప్తారం — శక్తేః పౌత్ర మకల్మషమ్
పరాశరాత్మజం వందే — శుకతాతం తపోనిధిమ్. ౩

వ్యాసాయ విష్ణు రూపాయ - వ్యాస రూపాయ విష్ణవే
నమో వై బ్రహ్మ నిధయే - వాశిష్ఠాయ నమో నమః॥ ౪

అవికారాయ శుద్ధాయ — నిత్యాయ పరమాత్మనే
సదైకరూప రూపాయ - విష్ణవే సర్వజిష్ణవే ॥ ౫

యస్య స్మరణ మాత్రేణ — జన్మ సంసార బంధనాత్
విముచ్యతే నమస్తస్మై విష్ణవే ప్రభవిష్ణవే ॥

ఓం నమో విష్ణవే ప్రభవిష్ణవే ॥

శ్రీ వైశంపాయన ఉవాచ :-

శ్రుత్వా ధర్మా నశేషేణ - పావనాని చ సర్వశః
యుధిష్ఠి ర శ్శాంతనవం - పునరే వాభ్యభాషత. ౧

యుధిష్ఠిర ఉవాచ :-

కి మేకం దైవతం లోకే - కిం వా ప్యేకం పరాయణమ్
స్తువ న్తః కం క మర్చ న్తః - ప్రాప్నుయు ర్మానవా శ్శుభమ్? ౨
కో ధర్మ స్సర్వ ధర్మాణాం - భవతః పరమోమతః
కిం జప న్ముచ్యతే జన్తుః - జన్మ సంసార బంధనాత్ ? ౩

శ్రీ భీష్మ ఉవాచ :-

జగ త్ప్రభుం దేవదేవం - అన న్తం పురుషో త్తమమ్
స్తువ న్నామ సహస్రేణ - పురుష స్సతతో త్థితః. ౪
త మేవ చార్చ్యయ న్నిత్యం - భక్త్యా పురుష మవ్యయమ్
ధ్యాయన్ స్తువన్ నమస్యన్ చ యజమాన స్త మేవ చ. ౫
అనాది నిధనం విష్ణుం సర్వలోక మహేశ్వరమ్
లోకాధ్యక్షం స్తువ న్నిత్యం - సర్వదుఃఖాతిగో భవేత్. ౬
బ్రహ్మాణ్యం సర్వ ధర్మజ్ఞం లోకానాం కీర్తి వర్ధనమ్
లోకనాథం మహద్భూతం - సర్వభూత భవోద్భవమ్. ౭
ఏష మే సర్వ ధర్మాణాం - ధర్మోఽధికతమో మతః
య ద్భక్త్యా పుండరీకాక్షం - స్తవై రర్చే న్నర స్సదా. ౮
పరమం యో మహ త్తేజః - పరమం యో మహ త్తపః
పరమం యో మహ ద్బ్రహ్మ - పరమం యః పరాయణమ్. ౯

పవిత్రాణాం పవిత్రం యో - మంగళానాం చ మంగళమ్
దైవతం దేవతానాం చ - భూతానాం యోఽవ్యయః పితా. ౧౦

యత స్సర్వాణి భూతాని - భవ న్త్యాదియుగాగమే
యస్మిం శ్చ ప్రళయం యాంతి - పున రేవ యుగక్షయే. ౧౧

తస్యలోక ప్రధానస్య - జగన్నాథస్య భూపతే
విష్ణో ర్నామ సహస్రం మే - శృణు పాప భయాపహమ్ ౧౨

యాని నామాని గౌణాని - విఖ్యాతాని మహాత్మనః
ఋషిభిః పరిగీతాని - తాని వక్ష్యామి భూతయే. ౧౩

ఋషి ర్నామ సహస్రస్య - వేదవ్యాసో మహామునిః
ఛందోఽనుష్టుప్ తథా దేవో - భగవాన్ దేవకీసుతః. ౧౪

అమృతాంశూద్భవో బీజం - శక్తి ర్దేవకీనందనః
త్రిసామా హృదయం తస్య - శాంత్యర్థే వినియుజ్యతే. ౧౫

విష్ణుం జిష్ణుం మహావిష్ణుం - ప్రభవిష్ణుం మహేశ్వరమ్
అనేకరూపదైత్యాంతం - నమామి పురుషోత్తమమ్. ౧౬

౧. సంకల్పమ్ :-

అస్య శ్రీ విష్ణుసహస్రనామస్తోత్ర మహా మంత్రస్య, శ్రీ వేదవ్యాసో భగవాన్ ఋషిః। అనుష్టుప్ ఛందః। శ్రీ మహావిష్ణుః పరమాత్మా దేవతా। అమృతాంశూద్భవో భాను రితి బీజమ్, దేవకీనందనః స్రష్టేతి శక్తిః। ఉద్భవః క్షోభణో దేవ ఇతి పరమో మంత్రః। శంఖ భృ న్నందకీ చక్రీతి కీలకమ్। శార్ఙ్గధన్వా గదాధర ఇ త్యస్త్రమ్। రథాంగపాణి రక్షోభ్య ఇతి నేత్రమ్। త్రిసామా సామగ స్సామేతి కవచమ్। ఆనందం పరబ్రహ్మేతి యోనిః। ఋతు స్సుదర్శనః కాల ఇ దిగ్బంధః। శ్రీ విశ్వరూప ఇతి ధ్యానమ్। శ్రీ మహావిష్ణు కైంకర్యరూప సహస్రనామ జపే వినియోగః ॥

౨. ధ్యానమ్ :-

క్షీరోదన్వత్ప్రదేశే శుచిమణివిలస త్సైకతే మౌక్తికానాం
మాలాక్లుప్తాసనస్థః స్ఫటిక మణి నిభై ర్మౌక్తికై ర్మండితాంగః
శుభ్రై రభ్రై రదభ్రై రుపరి విరచితై ర్ముక్త పీయూష వర్షైః
ఆనందీనః పునీయా దరినళిన గదా శంఖ పాణి ర్ముకుందః ౧

భూః పాదౌ యస్య నాభిః
వియ దసురని శ్చంద్ర సూర్యౌ చ నేత్రే
కర్ణా వాశా శ్శిరో ద్యౌః
ముఖ మపి దహనో - యస్య వా స్తేయ మబ్ధిః
అంతస్థం యస్య విశ్వం
సుర నర ఖగగో - భోగి గంధర్వ దైత్యైః
చిత్రం రం రమ్యతే తం
త్రిభువన వపుషం - విష్ణు మీశం నమామి ॥ ౨

శాంతాకారం భుజగశయనం - పద్మనాభం సురేశం
విశ్వాకారం గగనసదృశం - మేఘవర్ణం శుభాంగమ్
లక్ష్మీకాంతం కమలనయనం - యోగిభి ర్ధ్యానగమ్యం
వందే విష్ణుం భవ భయ హరం - సర్వలోకైకనాథమ్. ౩

మేఘశ్యామం పీత కౌశేయవాసం
శ్రీవత్సాంకం - కౌస్తుభోద్భాసితాంగమ్
పుణ్యోపేతం పుండరీకాయతాక్షం
విష్ణుం వందే సర్వలోకైకనాథమ్. ౪

స శంఖ చక్రం స కిరీట కుండలం
సపీతవస్త్రం సరసీరుహేక్షణమ్।
సహార వక్షస్థ్సల కౌస్తుభ శ్రియం
నమామి విష్ణుం - శిరసా చతుర్భుజమ్. ౫

— హరిః ఓమ్ —

విశ్వం విష్ణు ర్వషట్కారో భూతభవ్య భవత్ప్రభుః ।
భూతకృ ద్భూతభృ ద్భావో భూతాత్మా భూతభావనః ॥ 1

పూతాత్మా పరమాత్మా చ ముక్తానాం పరమా గతిః ।
అవ్యయః పురుష స్సాక్షీ క్షేత్రజ్ఞోఽక్షర ఏవ చ ॥ 2

యోగో యోగవిదాం నేతా ప్రధాన పురుషేశ్వరః ।
నారసింహవపు శ్శ్రీమాన్ కేశవః పురుషో త్తమః ॥ 3

సర్వ శ్శర్వ శ్శివ స్థాణుః భూతాది ర్నిధి రవ్యయః ।
సంభవో భావనో భర్తా ప్రభవః ప్రభు రీశ్వరః ॥ 4

స్వయమ్భూ శ్శమ్భు రాదిత్యః పుష్కరాక్షో మహాస్వనః ।
అనాది నిధనో ధాతా విధాతా ధాతు రు త్తమః । 5

అప్రమేయో హృషీకేశః - పద్మనాభోఽమరప్రభుః ।
విశ్వకర్మా మను స్త్వష్టా స్థవిష్ఠః స్థ విరో ధ్రువః ॥ 6

అగ్రాహ్య శ్శాశ్వతః కృష్ణో లోహితాక్షః ప్రతర్దనః ।
ప్రభూత స్త్రికకు ద్ధామ పవిత్రం మఙ్గళం పరమ్ ॥ 7

ఈశానః ప్రాణదః ప్రాణో జ్యేష్ఠః శ్రేష్ఠః ప్రజాపతిః ।
హిరణ్యగర్భో భూగర్భో మాధవో మధుసూదనః ॥ 8

ఈశ్వరో విక్రమీ ధన్వీ మేధావీ విక్రమః క్రమః ।
అను త్తమో దురాధర్షః కృతజ్ఞః కృతి రాత్మవాన్ ॥ 9

సురేశ శ్శరణం శర్మ విశ్వరేతాః ప్రజాభవః ।
అహ స్సంవత్సరో వ్యాళః ప్రత్యయ స్సర్వదర్శనః ॥ 10

అజ స్సర్వేశ్వర స్సిద్ధః సిద్ధి స్సర్వాది రచ్యుతః ।
వృషాకపి రమేయాత్మా సర్వయోగ వినిస్సృతః ॥ 11

వసు ర్వసుమనా స్సత్యః సమాత్మా సమ్మిత స్సమః ।
అమోఘః పుండరీకాక్షో వృషకర్మా వృషాకృతిః ॥ 12

రుద్రో బహుశిరా బభ్రుః విశ్వయోని శ్శుచిశ్రవాః
అమృత శ్శాశ్వత స్స్థాణుః వరారోహో మహాతపాః ॥ 13

స్సర్వగ స్సర్వవి ద్భానుః విష్వక్సేనో జనార్దనః ।
వేదో వేదవిదవ్యంగో వేదాంగో వేదవి త్కవిః ॥ 14

లోకాధ్యక్ష స్సురాధ్యక్షో ధర్మాధ్యక్షః కృతాకృతః ।
చతురాత్మా చతుర్వ్యూహః చతుర్దంష్ట్ర శ్చతుర్భుజః ॥ 15

భ్రాజిష్ణు ర్భోజనం భోక్తా సహిష్ణు ర్జగదాదిజః ।
అనఘో విజయో జేతా విశ్వయోనిః పునర్వసుః ॥ 16

ఉపేంద్రో వామనః ప్రాంశుః అమోఘ శ్శుచి రూర్జితః ।
అతీంద్ర స్సంగ్రహ స్సర్గో ధృతాత్మా నియమో యమః॥ 17

వేద్యో వైద్య స్సదాయోగీ వీరహా మాధవో మధుః ।
అతీంద్రియో మహామాయో మహోత్సాహో మహాబలః॥ 18

మహాబుద్ధి ర్మహావీర్యో మహాశక్తి ర్మహాద్యుతిః ।
అనిర్దేశ్యవపు శ్శ్రీమాన్ అమేయాత్మా మహాద్రిధృత్ ॥ 19

మహేష్వాసో మహీభర్తా శ్రీనివాస స్సతాం గతిః ।
అనిరుద్ధ స్సురానన్దో గోవిన్దో గోవిదాం పతిః ॥ 20

మరీచి ర్దమనో హంసః సుపర్ణో భుజగోత్తమః ।
హిరణ్యనాభ స్సుతపాః పద్మనాభః ప్రజాపతిః ॥ 21

అమృత్యు స్సర్వదృ క్సింహః సన్ధాతా సన్ధిమాన్ స్థిరః ।
అజో దుర్మర్షణ శ్శాస్తా విశ్రుతాత్మా సురారిహా ॥ 22

గురు ర్గురుతమో ధామ స్సత్య స్సత్యపరాక్రమః ।
నిమిషో౽నిమిష స్స్రగ్వీ వాచస్పతి రుదారధీః ॥ 23

అగ్రణీ ర్గ్రామణీ శ్శ్రీమాన్ న్యాయో నేతా సమీరణః ।
సహస్రమూర్ధా విశ్వాత్మా సహస్రాక్ష స్సహస్రపాత్ ॥ 24

ఆవర్తనో నివృత్తాత్మా సంవృత స్సంప్రమర్దనః ।
అహ స్సంవర్తకో వహ్నిః అనిలో ధరణీధరః ॥ 25

సుప్రసాదః ప్రసన్నాత్మా విశ్వసృ డ్విశ్వభు గ్విభుః ।
సత్కర్తా సత్కృత స్సాధు జహ్ను ర్నారాయణో నరః ॥ 26

అసంఖ్యేయో౽ప్రమేయాత్మా విశిష్ట శ్శిష్టకృ చ్ఛుచిః ।
సిద్ధార్థ సిద్ధసంకల్ప స్సిదిద స్సిద్ధిసాధనః ॥ 27

వృషాహీ వృషభో విష్ణుః వృషపర్వా వృభోదరః ।
వర్ధనో వర్ధమాన శ్చ వివిక్త శ్శ్రుతిసాగరః ॥ 28

సుభుజో దుర్ధరో వాగ్మీ మహేన్ద్రో వసుధో వసుః ।
నైకరూపో బృహద్రూపః శిపివిష్టః ప్రకాశనః ॥ 29

ఓజ స్తేజో ద్యుతిధరః ప్రకాశాత్మా ప్రతాపనః ।
ఋద్ధః స్పష్టాక్షరో మన్త్రః చన్ద్రాంశు ర్భాస్కరద్యుతిః ॥ 30

అమృతాంశూ ద్భవో భానుః శశిబిన్దు స్సురేశ్వరః ।
ఔషధం జగత స్సేతుః సత్యధర్మ పరాక్రమః ॥ 31

భూతభవ్య భవన్నాథః పవనః పావనోఽనలః ।
కామహా కామకృ త్కాన్తః కామః కామప్రదః ప్రభుః ॥ 32

యుగాదికృ ద్యుగావర్తో నైకమాయో మహాశనః ।
అదృశ్యో వ్యక్త రూపశ్చ సహస్రజి దనన్తజిత్ ॥ 33

ఇష్టోఽవిశిష్ట శ్శిష్టేష్టః శిఖణ్డీ నహుషో వృషః ।
క్రోధహా క్రోధకృ త్కర్తా విశ్వబాహు ర్మహీధరః ॥ 34

అచ్యుతః ప్రథితః ప్రాణః ప్రాణదో వాసవానుజః ।
అపాంనిధి రధిష్ఠాన మప్రమ త్తః ప్రతిష్ఠితః ॥ 35

స్కన్దః స్కన్ద ధరో ధుర్యో వరదో వాయువాహనః ।
వాసుదేవో బృహద్భాను రాదిదేవః పురన్దరః ॥ 36

అశోక స్తారణ స్తారః శూర శ్శౌరి ర్జనేశ్వరః ।
అనుకూల శ్శతావ ర్తః పద్మీ పద్మనిభేక్షణః ॥ 37

పద్మనాభోఽరవిన్దాక్షః పద్మగర్భ శ్శరీరభృత్ ।
మహర్ధి ఋద్ధో వృద్ధాత్మా మహాక్షో గరుడధ్వజః ॥ 38

అతుల శ్శరభో భీమః సమయజ్ఞో హవి ర్హరిః ।
సర్వలక్షణ లక్షణ్యో లక్ష్మీవాన్ సమితి ఞ్జయః ॥ 39

విక్షరో రోహితో మార్గో హేతు ర్దామోదర స్సహః ।
మహీధరో మహాభాగో వేగవా నమితాశనః ॥ 40

ఉద్భవః క్షోభణో దేవః శ్రీగర్భః పరమేశ్వరః ।
కరణం కారణం కర్తా వికర్తా గహనో గుహః ॥ 41

వ్యవసాయో వ్యవస్థానః సంస్థాన స్థానదో ధ్రువః ।
పరర్ధిః పరమస్పష్టః తుష్టః పుష్ట శ్శుభేక్షణః ॥ 42

రామో విరామో విరజో మార్గో నేయో నయోఽనయః ।
వీర శ్శక్తిమతాం శ్రేష్ఠో ధర్మోధర్మవి దుత్తమః ॥ 43

వైకుణ్ఠః పురుషః ప్రాణః ప్రాణదః ప్రణవః పృథుః ।
హిరణ్యగర్భ శ్శత్రుఘ్నో వ్యాప్తో వాయు రధోక్షజః ॥ 44

ఋతు స్సుదర్శనః కాలః పరమేష్ఠీ పరిగ్రహః ।
ఉగ్ర స్సంవత్సరో దక్షో విశ్రామో విశ్వదక్షిణః ॥ 45

విస్తార స్స్థావర స్థాణుః ప్రమాణం బీజ మవ్యయమ్ ।
అర్థోఽనర్థో మహాకోశో మహాభోగో మహాధనః ॥ 46

అనిర్విణ్ణ స్స్థవిష్ఠో భూః ధర్మయూపో మహామఖః ।
నక్షత్రనేమి ర్నక్షత్రీ క్షమః క్షామ స్సమీహనః ॥ 47

యజ్ఞ ఇజ్యో మహేజ్య శ్చ క్రతు స్సత్రం సతాంగతిః ।
సర్వదర్శీ నివృత్తాత్మా సర్వజ్ఞో జ్ఞాన ముత్తమమ్ ॥ 48

సువ్రత స్సుముఖ స్సూక్ష్మః సుఘోష స్సుఖద స్సుహృత్ ।
మనోహరో జితక్రోధో వీరబాహు ర్విదారణః ॥ 49

స్వాపనః స్వవశో వ్యాపీ నైకాత్మా నైకకర్మకృత్ ।
వత్సరో వత్సలో వత్సీ రత్నగర్భో ధనేశ్వరః ॥ 50

ధర్మ గు ద్ధర్మకృ ద్ధర్మీ సదసత్ క్షర మక్షరమ్ ।
అవిజ్ఞాతా సహస్రాంశుః విధాతా కృతలక్షణః ॥ 51

గభ స్తినేమి స్స త్త్వస్థః సింహో భూతమహేశ్వరః ।
ఆది దేవో మహాదేవో దేవేశో దేవభృద్గురుః ॥ 52

ఉ త్తరో గోపతి ర్గోప్తా జ్ఞానగమ్యః పురాతనః ।
శరీరభూతభృ ద్భోక్తా కపీన్ద్రో భూరిదక్షిణః ॥ 53

సోమపో ఽమృతప స్సోమః పురుజి త్పురుస త్తమః ।
వినయో జయ స్సత్యసన్ధో దాశార్హ స్సా త్త్వతాంపతిః ॥ 54

జీవో వినయితా సాక్షీ ముకున్దో ఽమితవిక్రమః ।
అమ్భోనిధి రనన్తాత్మా మహోదధిశయో ఽ న్తకః ॥ 55

అజో మహార్హః స్వాభావ్యో జితామిత్రః ప్రమోదనః ।
ఆనన్దో నన్దనో నన్దః సత్యధర్మా త్రివిక్రమః ॥ 56

మహర్షిః కపిలాచార్యః కృతజ్ఞో మేదినీపతిః ।
త్రిపద స్త్రిదశాధ్యక్షః మహాశృఙ్గః కృతా న్తకృత్ ॥ 57

మహావరాహో గోవిన్దః సుషేణః కనకాఙ్గదీ ।
గుహ్యో గభీరో గహనో గు ప్త శ్చక్రగదాధరః ॥ 58

వేధాః స్వాఙ్గో ఽజితః కృష్ణో దృఢ స్సఙ్కర్షణో ఽచ్యుతః ।
వరుణో వారుణో వృక్షః పుష్కరాక్షో మహామనాః ॥ 59

భగవాన్ భగహా నన్దీ వనమాలీ హలాయుధః ।
ఆదిత్యో జ్యోతి రాదిత్యః సహిష్ణు ర్గతిస త్తమః ॥ 60

సుధన్వా ఖణ్డపరశుః దారుణో ద్రవిణప్రదః ।
దివిస్పృక్ సర్వ దృగ్వ్యాసో వాచస్పతి రయోనిజః ॥ 61

త్రిసామా సామగ స్సామ నిర్వాణం భేషజం భిషక్ ।
సన్న్యాసకృ చ్ఛమ శ్శాన్తో నిష్ఠా శాన్తిః పరాయణః ॥ 62

శుభాఙ్గ శ్శాన్తిద స్స్రష్టా కుముదః కువలేశయః ।
గోహితో గోపతి ర్గోప్తా వృషభాక్షో వృషప్రియః ॥ 63

అనివర్తీ నివృత్తాత్మా సంక్షేప్తా క్షేమకృ చ్ఛివః ।
శ్రీవత్సవక్షాః శ్రీవాసః శ్రీపతిః శ్రీమతాం వరః ॥ 64

శ్రీద శ్శ్రీశః శ్రీనివాసః శ్రీనిధి శ్శ్రీవిభావనః ।
శ్రీధర శ్శ్రీకర శ్శ్రేయః శ్రీమాన్ లోకత్రయాశ్రయః ॥ 65

స్వక్ష స్స్వఙ్గ శ్శతానన్దో నన్ది ర్జ్యోతి ర్గణేశ్వరః ।
విజితాత్మా విధేయాత్మా సత్కీర్తి శ్ఛిన్నసంశయః ॥ 66

ఉదీర్ణ స్సర్వత శ్చక్షుః అనీశ శ్శాశ్వత స్థిరః ।
భూశయో భూషణో భూతిః విశోక శ్శోకనాశనః ॥ 67

అర్చిష్మా నర్చితః కుమ్భో విశుద్ధాత్మా విశోధనః ।
అనిరుద్ధోఽ ప్రతిరథః ప్రద్యుమ్నోఽమితవిక్రమః ॥ 68

కాలనేమినిహా శౌరిః శూర శ్శూరజనేశ్వరః ।
త్రిలోకాత్మా త్రిలోకేశః కేశవః కేశిహా హరిః ॥ 69

కామదేవః కామపాలః కామీ కాన్తః కృతాగమః ।
అనిర్దేశ్యవపు ర్విష్ణుః వీరోఽనన్తో ధనఞ్జయః ॥ 70

బ్రహ్మణ్యో బ్రహ్మకృత్ బ్రహ్మా బ్రహ్మ బ్రహ్మవివర్ధనః ।
బ్రహ్మవి ద్బ్రాహ్మణో బ్రహ్మీ బ్రహ్మజ్ఞో బ్రాహ్మణప్రియః ॥

మహాక్రమో మహాకర్మా మహాతేజా మహోరగః ।
మహాక్రతు ర్మహాయజ్వా మహాయజ్ఞో మహాహవిః ॥ 72

స్తవ్య స్తవప్రియ స్తోత్రం స్తుత స్తోతా రణప్రియః ।
పూర్ణః పూరయితా పుణ్యః పుణ్యకీర్తి రనామయః ॥ 73

మనోజవ స్తీర్థకరో వసురేతా వసుప్రదః ।
వసుప్రదో వాసుదేవో వసు ర్వసుమనా హవిః ॥ 74

సద్గతి స్సత్కృతి స్సత్తా సద్భూతి స్సత్పరాయణః ।
శూరసేనో యదుశ్రేష్ఠః సన్నివాస స్సుయామునః ॥ 75

భూతావాసో వాసుదేవః సర్వాసునిలయోఽనలః ।
దర్పహా దర్పదోఽదృప్తో దుర్ధరోఽథాఽపరాజితః ॥ 76

విశ్వమూర్తి ర్మహామూర్తిః దీప్తమూర్తి రమూర్తిమాన్ ।
అనేకమూర్తి రవ్యక్త శ్శతమూర్తి శ్శతాననః ॥ 77

ఏకో నైక స్సవః కః కిం య త్తత్పద మనుత్తమమ్ ।
లోక బన్ధు ర్లోకనాథో మాధవో భక్తవత్సలః ॥ 78

సువర్ణవర్ణో హేమాఙ్గో వరాఙ్గ శ్చన్దనాఙ్గదీ ।
వీరహా విషమ శ్శూన్యో ఘృతాశీ రచల శ్చలః ॥ 79

అమానీ మానదో మాన్యో లోకస్వామీ త్రిలోకధృత్ ।
సుమేధా మేధజో ధన్యః సత్యమేధా ధరాధరః ॥ 80

తేజో వృషో ద్యుతిధరః సర్వశస్త్రభృతాం వరః ।
ప్రగ్రహో నిగ్రహో వ్యగ్రో నైకశృఙ్గో గదాగ్రజః ॥ 81

చతుర్మూర్తి శ్చతుర్బాహు శ్చతుర్వ్యూహ శ్చతుర్గతిః ।
చతురాత్మా చతుర్భావః చతుర్వేదవి దేకపాత్ ॥ 82

సమావర్తో నివృత్తాత్మా దుర్జయో దురతిక్రమః ।
దుర్లభో దుర్గమో దుర్గో దురావాసో దురారిహా ॥ 83

శుభాఙ్గో లోకసారఙ్గః సుతన్తు స్తన్తువర్ధనః ।
ఇన్ద్రకర్మా మహాకర్మా కృతకర్మా కృతాగమః ॥ 84

ఉద్భవ స్సున్దర స్సున్దో రత్ననాభ స్సులోచనః ।
అర్కో వాజసన శ్శృఙ్గీ జయన్త స్సర్వవి జ్జయీ ॥ 85

సువర్ణ బిన్దు రక్షోభ్యః సర్వవాగీశ్వరేశ్వరః ।
మహాహ్రదో మహాగర్తో మహాభూతో మహానిధిః ॥ 86

కుముదః కున్దరః కున్దః పర్జన్యః పావనోఽనిలః ।
అమృతాశోఽమృతవపు స్సర్వజ్ఞ స్సర్వతోముఖః ॥ 87

సులభ స్సువ్రత స్సిద్ధః శత్రుజిత్ శత్రుతాపనః
న్యగ్రోధోదుమ్బరోఽశ్వత్థః చాణూరాన్ధ్రనిషూదనః ॥ 88

సహస్రార్చి స్సప్తజిహ్వః సప్తైధా స్సప్తవాహనః ।
అమూర్తి రనఘోఽచిన్త్యో భయకృ ద్భయనాశనః ॥ 89

అణు ర్బృహత్కృశ స్స్థూలో గుణభృ న్నిర్గుణో మహాన్
అధృత స్స్వధృత స్స్వాస్యః ప్రాగ్వంశో వంశవర్ధనః ॥ 90

భారభృత్ కథితో యోగీ యోగీశ స్సర్వ కామదః ।
ఆశ్రమ శ్శ్రమణః క్షామః సుపర్ణో వాయువాహనః ॥ 91

ధనుర్ధరో ధనుర్వేదో దణ్డో దమయితా దమః ।
అపరాజిత స్సర్వసహో నియన్తా నియమో యమః ॥ 92

సత్త్వవాన్ సాత్త్విక స్సత్యః సత్యధర్మ పరాయణః ।
అభిప్రాయః ప్రియార్హోఽర్హః ప్రియకృత్ ప్రీతివర్ధనః ॥ 93

విహాయసగతి ర్జ్యోతిః సురుచి ర్హుతభు గ్విభుః ।
రవి ర్విలోచన స్సూర్యః సవితా రవిలోచనః ॥ 94

అనన్త హుతభు గ్భోక్తా సుఖదో నైకదోఽగ్రజః ।
అనిర్విణ్ణ స్సదామర్షీ లోకాధిష్ఠాన మద్భుతః ॥ 95

సనా త్సనాతనతమః కపిలః కపి రవ్యయః ।
స్వస్తిద స్స్వస్తికృత్ స్వస్తి స్వస్తిభుక్ స్వస్తిదక్షిణః ॥ 96

అరౌద్రః కుణ్డలీ చక్రీ విక్రమ్యూర్జిత శాసనః ।
శబ్దాతిగ శ్శబ్దసహః శిశిర శ్శర్వరీకరః ॥ 97

అక్రూరః పేశలో దక్షో దక్షిణః క్షమిణాంవరః ।
విద్వత్తమో వీతభయః పుణ్యశ్రవణకీర్తనః ॥ 98

ఉత్తారణో దుష్కృతిహా పుణ్యో దుస్స్వప్ననాశనః ।
వీరహా రక్షణ స్సన్తో జీవనః పర్యవస్థితః ॥ 99

అనన్తరూపోఽనన్త శ్రీః జితమన్యు ర్భయాపహః ।
చతురశ్రో గభీరాత్మా విదిశో వ్యాదిశో దిశః ॥ 100

అనాది ర్భూర్భువో లక్ష్మీః సువీరో రుచిరాఙ్గదః ।
జననో జనజన్మాదిః భీమో భీమపరాక్రమః ॥ 101

ఆధారనిలయో ధాతా పుష్పహాసః ప్రజాగరః ।
ఊర్ధ్వగ స్సత్పథాచారః ప్రాణదః ప్రణవః పణః ॥ 102

ప్రమాణం ప్రాణనిలయః ప్రాణభృత్ ప్రాణజీవనః ।
తత్త్వం తత్త్వవిదేకాత్మా జన్మమృత్యుజరాతిగః ॥ 103

భూర్భువ స్స్వస్తరుస్తారః సవితా ప్రపితామహః
యజ్ఞో యజ్ఞపతి ర్యజ్వా యజ్ఞాఙ్గో యజ్ఞవాహనః ॥ 104

యజ్ఞభృత్, యజ్ఞకృత్, యజ్ఞీ యజ్ఞభు గ్యజ్ఞసాధనః ।
యజ్ఞాన్తకృ ద్యజ్ఞగుహ్య మన్న మన్నాద ఏవ చ ॥ 105

ఆత్మయోని స్స్వయంజాతో వైఖాన స్సామగాయనః ।
దేవకీనన్దనః స్రష్టా క్షితీశః పాపనాశనః ॥ 106

శఙ్ఖ భృ న్నన్దకీ చక్రీ శార్ఙ్గ ధన్వాగదాధరః ।
రథాఙ్గపాణి రక్షోభ్యః సర్వప్రహరణాయుధః ॥ 107
వనమాలీ గదీ శార్ఙ్గీ శంఖీ చక్రీ చ నన్దకీ ।
శ్రీమన్నారాయణో విష్ణుః వాసుదేవోఽభిరక్షతు ॥ 108

ఫలశ్రుతి :-

ఇతీదం కీర్తనీ యస్య కేశవస్య మహాత్మనః ।
నామ్నాం సహస్రం దివ్యానాం అశేషేణ ప్రకీర్తితమ్ ॥ 1

య ఇదం శృణుయా న్నిత్యం యశ్చాపి పరికీర్తయేత్ ।
నాశుభం ప్రాప్నుయాత్ కించిత్ సోఽముత్రేహ చ మానవః॥

వేదాన్తగో బ్రాహ్మణస్స్యాత్ క్షత్రియో విజయీ భవేత్ ।
వైశ్యో ధనసమృద్ధస్స్యాత్ శూద్రస్సుఖమవాప్నుయాత్ ॥

ధర్మార్థీ ప్రాప్నుయాద్ధర్మం అర్థార్థీ చార్థమాప్నుయాత్ ।
కామానవాప్నుయాత్కామీ ప్రజార్థీ చాప్నుయాత్ప్రజాః ॥

భక్తిమాన్ యస్సదోత్థాయ శుచిస్తద్గతమానసః ।
సహస్రం వాసుదేవస్య నామ్నామేతత్ప్రకీర్తయేత్ ॥ 5

యశః ప్రాప్నోతి విపులం యాతి ప్రాధాన్యమేవ చ ।
అచలాం శ్రియమాప్నోతి శ్రేయః ప్రాప్నోత్యనుత్తమమ్ ॥ 6

న భయం క్వచిదాప్నోతి వీర్యం తేజశ్చ విన్దతి ।
భవత్యరోగో ద్యుతిమాన్ బలరూపగుణాన్వితః ॥ 7

రోగార్తో ముచ్యతే రోగాత్ బద్ధో ముచ్యేత బన్ధనాత్ ।
భయాన్ముచ్యేత భీతస్తు ముచ్యేతాపన్న ఆపదః ॥ 8

దుర్గాణ్యతితరత్యాశు పురుషః పురుషోత్తమమ్ ।
స్తువన్నామసహస్రేణ నిత్యం భక్తిసమన్వితః ॥ 9

వాసుదేవాశ్రయో మర్త్యో వాసుదేవపరాయణః ।
సర్వపాపవిశుద్ధాత్మా యాతి బ్రహ్మ సనాతనమ్ ॥ 10

న వాసుదేవభక్తానాం అశుభం విద్యతే క్వచిత్ ।
జన్మ మృత్యు జరా వ్యాధి భయం నాప్యుపజాయతే ॥ 11

ఇమం స్తవమధీయానః శ్రద్ధాభక్తిసమన్వితః ।
యుజ్యేతాత్మా సుఖక్షాన్తిః శ్రీధృతిస్మృతికీర్తిభిః ॥ 12

న క్రోధో న చ మాత్సర్యం నలోభో నాశుభా
భవన్తి కృతపుణ్యానాం భక్తానాం పురుషోత్తమే

ద్యౌ స్సచన్ద్రార్క నక్షత్రం ఖం దిశో భూర్మహోదధిః
వాసుదేవస్య వీర్యేణ విధృతాని మహాత్మనః ॥

ససురాసురగన్ధర్వం సయక్షోరగ రాక్షసమ్ ।
జగద్వశే వర్తతేదం కృష్ణ స్య సచరాచరమ్ ॥

ఇన్ద్రియాణి మనో బుద్ధిః సత్త్వం తేజో బలం ధృ
వాసుదేవాత్మకా న్యాహుః క్షేత్రం క్షేత్రజ్ఞ ఏవ

సర్వాగమానా మాచారః ప్రథమం పరికల్పతే
ఆచారప్రభవో ధర్మో ధర్మస్య ప్రభు రచ్యుతః

ఋషయః పితరో దేవాః మహాభూతాని ధాతవః
జఙ్గమాజఙ్గమం చేదం జగన్నారాయణో ద్భవమ్

యోగో జ్ఞానం తథా సాంఖ్యం విద్యా శ్శిల్పాదిక
వేదా శ్శాస్త్రాణి విజ్ఞానం ఏత త్సర్వం జనార్దనాత్

ఏకో విష్ణు ర్మహద్భూతం పృథగ్భూతా న్యనేకశ
త్రీన్ లోకాన్ వ్యాప్య భూతాత్మా భుఙ్క్తే విశ్వ

ఇమం స్తవం భగవతో విష్ణో ర్వ్యాసేన కీర్తితమ్
పఠేద్య ఇచ్ఛే త్పురుషః శ్రేయః ప్రాప్తుం సుఖాని

విశ్వేశ్వర మజం దేవం జగతః ప్రభు మవ్యయమ్
భజన్తి యే పుష్కరాక్షం న తే యాన్తి పరాభవ
న తే యాన్తి పరాభవమ్ ఓమ్ నమ ఇతి.

అర్జున ఉవాచ -

పద్మ పత్ర విశాలాక్ష ! పద్మనాభ ! సురోత్తమ ।
భక్తానా మనురక్తానాం త్రాతా భవ జనార్దన ! 23

శ్రీ భగవా నువాచ -

యో మాం నామసహస్రేణ స్తోతు మిచ్ఛతి పాణ్డవ !
సోఽహ మేకేన శ్లోకేన స్తుత ఏవ న సంశయః ॥ 24
స్తుతయేవ న సంశయ ఓమ్ నమ ఇతి.

వ్యాస ఉవాచ -

వాసనా ద్వాసుదేవస్య వాసితం తే జగత్త్రియమ్ ।
సర్వభూత నివాసోఽసి వాసుదేవ ! నమోఽస్తు తే ॥ 25
శ్రీవాసుదేవ నమోస్తుత ఓమ్ నమ ఇతి.

పార్వ త్యువాచ -

కేనోపాయేన లఘునా విష్ణోర్నామసహస్రకమ్ ।
పఠ్యతే పండితై ర్నిత్యం శ్రోతు మిచ్ఛా మ్యహం ప్రభో! 26

ఈశ్వర ఉవాచ -

శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే ।
సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే ! 27
శ్రీ రామనామ వరానన ఓమ్ నమ ఇతి.

బ్రహ్మోవాచ -

నమో స్త్వనన్తాయ సహస్ర మూర్తయే ।
సహస్రపాదాక్షి శిరోరుబాహవే ।
సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే ।
సహస్రకోటీ యుగధారిణే నమః ॥

శ్రీసహస్రకోటీ యుగధారిణ ఓమ్ నమ ఇతి.

సఞ్జయ ఉవాచ -

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః ।
తత్ర శ్రీ ర్విజయో భూతిః ధ్రువా నీతి ర్మతి ర్మమ ॥

శ్రీ భగవా నువాచ -

అనన్యా శ్చిన్త యన్తో మాం యే జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభి యుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే ॥

ఆర్తా విషణ్ణా శ్శిథిలా శ్చ భీతాః
ఘోరేషు చ వ్యాధిషు వర్తమానాః ।
సంకీర్త్య నారాయణశబ్దమాత్రం
విముక్తదుఃఖా స్సుఖినో భవన్తి ॥

యదక్షరపదభ్రష్టం మాత్రాహీనం తు యద్భవేత్ ।
తత్సర్వం క్షమ్యతాం దేవ ! నారాయణ ! నమోఽస్తుతే ॥

(ఇతి శ్రీ మహాభారతే - శతసాహస్రికాయాం సంహితాయాం వైయాసిక్యాం - ఆనుశాసనికపర్వణి - మోక్షధర్మే - భీష్మ యుధిష్ఠిర సంవాదే - శ్రీ విష్ణోః దివ్య సహస్ర నామ స్తోత్రం నామ - చతుః పంచాశ దధిక ద్విశతతమోధ్యాయః ఓం తత్సత్. సర్వం శ్రీ కృష్ణార్పణ మస్తు.)

## 15. మఱికొన్ని విష్ణు స్తోత్రములు

పైన పేర్కొనఁబడిన విష్ణుసహస్రనామస్తోత్రమె గాక, మఱియింకను - పురాణేతిహాసములందును, తదితర గ్రంథములందును - విష్ణు, నారాయణ, హరి - నామాంకితములైన స్తోత్రములు కొన్ని కానవచ్చుచున్నవి. ఇట్టి వానిలో - (1) విష్ణో ర్నామాష్టకము (2) విష్ణో రష్టావింశతినామస్తోత్రము (3) శ్రీవిష్ణోః షోడశనామస్తోత్రము (4) శ్రీవిష్ణు దశావతారస్తోత్రము (5) శ్రీ త్రైలోక్య మంగళ విష్ణు కవచము (6) విష్ణు పంజర స్తోత్రము (7) విష్ణు హృదయ స్తోత్రము (8) విష్ణు స్తవ రాజము (9) విష్ణు శతనామ స్తోత్రము (10) విష్ణు పాదాది కేశాంత వర్ణన స్తోత్రము (11) సంకటనాశ విష్ణు స్తోత్రము (12) శ్రీవిష్ణోః అష్టావింశతినామ స్తోత్రము (13) విష్ణుపూజా స్తోత్రము (14) శ్రీ విష్ణుమహిమ్న స్తోత్రము (15) విష్ణోః అపామార్గ స్తోత్రము (16) విష్ణు షట్పదీ స్తోత్రము (17) విష్ణో ర్నామాష్టక స్తోత్రము (18) నారాయణ హృదయము (19) శ్రీ నారాయణ కర్మ స్తోత్రము (20) ఆర్తత్రాణ నారాయణాష్టాదశ స్తోత్రము (21) నారాయణాష్టకము (22) శ్రీ హరినామాష్టకము (23) హరినామమాలా స్తోత్రము (24) లక్ష్మీనృసింహ స్తోత్రము (25) శ్రీ రామ రక్షా స్తోత్రము (26) శ్రీరామ స్తుతి (27) శ్రీరామ స్తోత్రము (28)

శ్రీరామ స్తవము (29) శ్రీరామాష్టకము (30) శ్రీ సీతారామాష్టకము (31) శ్రీరామచంద్ర స్తుతి (32) శ్రీరామ మంగళా శాసనము (33) గోవిందాష్టకము (34) గోవింద దామోదర స్తోత్రము (35) మధురాష్టకము (36) గోపికా విరహ గీతములు (37) కమలాప త్యష్టకము (38) శ్రీ రమా ప త్యష్టకము (39) శ్రీ రంగనాథాష్టకము (40) శ్రీ రంగరాజ స్తోత్రము (41) శ్రీ వేంకటేశ్వర వజ్రకవచ స్తోత్రము (42) శ్రీ వేంకటేశ్వర మంగళా స్తోత్రము (43) ఆర్త్రాణ పరాయణ అష్టాదశ స్తోత్రము (44) శ్రీ వరదరాజ స్తోత్రము (45) శ్రీమాలా స్తోత్రము (46) ముకుంద మాల (47) ఆళవందార్ స్తోత్రము (48) గద్య త్రయము (49) పంచ స్తవము (50) శ్రీ లక్ష్మీనారాయణ స్తోత్ర మణిమాల - మున్నగు నవి - విఖ్యాతములై యున్నవి.

## 16. ఫలితాంశము

పైన పేర్కొనఁబడిన స్తోత్రములు - వాని వానిలోఁ గల బీజ సంపుటిని బట్టియు, ఆ యా స్తోత్రములందును, ఆ యా స్తోత్రములలో ప్రతిపాదింపఁబడిన దైవము లందును, ఆ యా స్తోత్ర పారాయణ పరుల కేర్పడు భక్తి విశ్వాసములనుబట్టియు - తగిన ఫలముల నొసగుచుండును.

## 17. సందేశము

"నిర్గత కర్మంబై, నిరుపాధికంబైన జ్ఞానము - హరిభక్తి లేకున్న, విశేషంబుగ శోభితంబు గాదు. ఫలంబు గోరక, కర్మం బీశ్వరునకు సమర్పణంబు

సేయకున్న, అది - ప్రశస్తంబై యుండదు. భక్తిహీనంబులైన జ్ఞాన వాదా కర్మ కౌశలంబులు నిరర్థకంబులు. కావున, వృధాప్రయాసంబున ఆయుర్వ్యయంబు సేయంజనదు. హరిభజనంబున మోక్షంబు సిద్ధించు. విష్ణుండు సర్వభూతంబులకును ఆత్మేశ్వరుండు, ప్రియుండు. ముముక్షువైన దేహికి - దేహావసానపర్యంతంబు నారాయణ చరణారవింద సంసేవనంబు కర్తవ్యంబు."

ఇయ్యది - భాగవత మహా పురాణములో - పరమ భాగవతోత్తముఁ డగు ప్రహ్లాద బాలుఁడు - లోకమున కొసంగిన దివ్య సందేశము. అదియునుగాక, పరమ భక్తాగ్రగణ్యు లగు కులశేఖ రాళ్వారులు తమ ముకుందమాలలో చేసిన మహోపదేశము - ఎల్లరకును గమనావశ్యకమై యున్నది.

"భవ జలధి గతానాం ద్వంద్వ వాతా హతానాం
సుత దుహితృ కళత్ర త్రాణ భారార్థితానామ్ ।
విషమ విషయ తోయే మజ్జతా మప్లవానాం
భవతు శరణ మేకో - విష్ణుపోతో నరాణామ్."

సంసార మను సముద్రమును పొందినట్టి మానవులు - ద్వంద్వము లను వాయువులచే కొట్టబడును. కుమారులు, కుమార్తెలు, భార్యలు, మనుమలు - మొదలగు దేహబంధువుల నెల్లతిని పోషించుట యను భారము కలిగి యుండును. అందుచే, ఈ సంసార సముద్రమున మునిగినవానికి - పైఁ జెప్పఁబడిన నావ మఱి యొకటి లభింపని యెడల, జీవించుట దుర్లభము కనుక, అట్టివానికి - విష్ణువు యొక్క అనుగ్రహము కలిగిననే - చేతనుడు సంసారమునుండి తరించి, అనంతమైన ఆనంద నిలయ మగు పరమ పదమును పొందగలఁడు. లేని-చో - భయంకరమైన సంసార మహా సముద్రమునందే మునిగియుండు నని

ముకుందమాలలో - కులశేఖరాళ్వారులు - ప్రబోధించియున్నారు.
(12 శ్లో.)

కావున, ఇట్టి ప్రమాణములనుఁబట్టి, విష్ణుభగవానుఁడే సర్వాధికుఁ డనియు, ఆ స్వామియే సర్వజగదాధారుఁ డనియు, ఆ శ్రియఃపతిని భక్తిప్రపత్తులతో స్తుతించి, ఆ విష్ణుభగవానుని శరణించు తరించుటే మానవమాత్రుల కర్తవ్య మనియు - వ్యక్త మగును.

"విష్ణుం - శారదచంద్రకోటి సదృశం - శంఖం రథాంగం గదా
మంభోజం దధతం-సితాబ్జ నిలయం - కాన్త్యా జగ న్మోహనమ్
ఆబద్ధాంగద హార కుండల మహా మౌళి స్ఫురత్కంకణం
శ్రీవత్సాంక ముదార కౌస్తుభ ధరం - వన్దే మునీంద్రైః స్తుతమ్."



# శ్రీ స్తవము

-: సంస్కృత మూలము :-

**శ్రీవత్సాంక మిశ్రులు**

-: ఆంధ్ర వ్యాఖ్యానము :-

" ఉభయ వేదాంత శిరోమణి "

## శ్రీమాన్ పరవస్తు అప్పన్ గోవిందాచార్యులు

★

('కూరనాథులు' - అను నామాంతరము గల శ్రీవత్సాంకమిశ్రులు - మహా పండితులు. భగవద్రామానుజులకు గల అంతరంగిక శిష్యులలో - ముఖ్యులు. భగవద్భక్తి పరవశులు. వీరు - 1. శ్రీ స్తవము. 2. వరదరాజ స్తవము. 3. సుందరబాహు స్తవము. 4. అతిమానుష స్తవము. 5. శ్రీ రంగరాజ స్తవము - అను అయిదు స్తవములను - భక్తిరస ప్లావితములుగా రచించిరి. వీనిని - 'పంచ స్తవములు' - అను పేర - వ్యవహరించుట పరిపాటి. ఈ స్తవములలో మొదటి దగు శ్రీ స్తవము - ఇచట వ్యాఖ్యా సహితముగ పొందుపరుపబడుచున్నది.

— సంపాదకుడు.)

## ఉపోద్ఘాతము

శ్రీవైష్ణవ మతమున లక్ష్మిని విడచి నారాయణుని, నారాయణుని విడిచి లక్ష్మిని - పూజింపకూడదు. లక్ష్మీనారాయణుల నిరువురను పూజించుటయే సంప్రదాయము. లక్ష్మిని స్తుతించుట - పురుష

సూక్తము, శ్రీ సూక్తము, విష్ణు పురాణము - మొదలగు గ్రంథము లనుబట్టి ఉండును.

యామునాచార్యులు - 'చతుశ్శ్లోకిలో' - లక్ష్మిని స్తుతించిరి. రామానుజులు - శరణాగతి గద్యమున లక్ష్మిని స్తుతించిరి. కూర నాథులు ఈ శ్రీ స్తవముచే స్తుతించిరి. పరాశర భట్టరు - శ్రీగుణ రత్న కోశముచే లక్ష్మిని స్తుతించిరి.

లక్ష్మి - శక్తి కాదు, జగత్కారణము కాదు. నారాయణుని దేవేరి. విష్ణు పరతంత్రురాలేకాని, స్వతంత్రురాలు కాదు. కాని, ఈమె-పురుషకారభూరురాలుగా సుప్రసిద్ధము. లక్ష్మి పురుషకారము సర్వార్థ దాయకము. అందుచే, ఈ లక్ష్మిని ప్రసన్నము గావించు కొనుట - ఎల్లఱకును ఆవశ్యకము.

సమస్తమైన వేదాంతముల యొక్క తత్త్వార్థములను - యాము నాచార్యుల శిష్యరత్న మగు భగవద్రామానుజులనుండి పొందినట్టి శ్రీవత్సాంకమిశ్రులు - మొట్టమొదట - "నమోఽచింత్యాద్భుతా క్లిష్ట" - అని యారంభించి, "పితామహం నాథమునిం విలోక్య" - అని - స్తోత్రమును సమాప్తిని పొందించి, చతశ్శ్లోకిని చెప్పిన యామున ముని ననుసరించి, మొదట 'యోనిత్య మచ్యుత' - అని, 'రామాను జస్య చరణౌ శరణం ప్రపద్యే'-అని ఉపక్రమించి, నాలుగు ప్రబంధ ములను రచించి, 'రామానుజాఙ్ఘ్రి శరణోఽస్మి వరదాస్మిత తవేక ణీయః''-అని పరిసమాప్తము గావించి, భగవత్సమాశ్రయణమునందు ఉద్యోగించినట్టి, సమస్తమైన చేతనులకు పురుషకారముగ - మొదట

ఆశ్రయింపదగిన లక్ష్మిని - 11 శ్లోకములలో స్తుతింపదలచి, విఘ్నపు పరిహారమునకు ఆశీర్వచన రూపమైన మంగళమును - "స్వస్తిశ్రీర్దిశతాత్" అని ప్రారంభించి చెప్పుచున్నారు.

" స్వస్తిశ్రీర్దిశతా దశేష జగతాం సర్గోపసర్గస్థితీ
స్స్వర్గం దుర్గతి మాపవర్గికపదం సర్వం చ కుర్వన్ హరిః
యస్యావీక్ష్య ముఖం తదింగిత పరాధీనో విధత్తేఽఖిలం
క్రీడేయం ఖలు నాన్యథాస్య రస దాస్యా దైక రస్యా త్తయా ॥" 1

భగవంతునకు జగత్సృష్ట్యాదుల వలన నేమి ప్రయోజనము? అందువలన - భగవంతుని జగత్కారణత్వము ప్రకృతి కలది కాదు'- అను శంకను - 'ఈ సృష్ట్యాదులు భగవంతుని లీలయే'యని - పెద్దలు పరిహరించిరి. "**క్రీడతో బాలకస్యేవ - చేష్టాం తస్య నిశామయమ్**" "**లోకవత్తు లీలా కైవల్యమ్**" (బ్ర. సూ:) అని - ప్రాచీన గ్రంథములలో నున్నది. భగవంతుడు జగత్తులకు సృష్టి స్థితి సంహారములు, స్వర్గము, నరకము, మోక్షము - మొదలగువాని నన్నింటిని - లక్ష్మి ముఖమును చూచి, ఆమె యభిప్రాయము ననుసరించియే చేయును. లక్ష్మి యొక్క ఆనందము వలననే భగవంతుని యానందము. లక్ష్మికి ఆనందము కలుగురీతి గాక, మరియొక విధముగా ఆ లీల జరిపినచో - భగవంతునకు ఆనందము కలుగదు. అట్టి లక్ష్మి - శుభమును కలుగజేయుగాక !

**అవతారిక** :- 'స్వస్తి శ్రీర్దిశతా' అనుదానినే మరల విశదీకరించుచున్నారు :-

" హే శ్రీ ర్దేవిసమస్త లోక జననీం త్వాం స్తోతు మీహామహే
యుక్తాం భావయ భారతీం ప్రగుణయ ప్రేమ ప్రధానాన్ ధియమ్
భక్తిం బంధయ నందయాశ్రిత మిమం దాసం జనం తావకం
లక్ష్యం లక్ష్మికటాక్ష వీచి విసృతే స్తై స్యామధామీ వయమ్ " 2

ఓ లక్ష్మీ ! సకల జనులకు తల్లి వగు నిన్ను స్తుతింపబూన చున్నాను. యుక్తమైన వాఙ్మయమును ప్రసాదింపుము. ప్రీతికారిమైన బుద్ధిని ప్రసాదింపుము. కల్యాణమైన భక్తిని కలుగజేయుము. ని దాసుల మగు మమ్మానందింపజేయుము. మేము నీ కటాక్షపాత్రుల మగుదుముగాక ! బ్రహ్మ - **నారాయణ** నాభికమల సంజాతు డగుట చేతను, రుద్రుడు బ్రహ్మపుత్రు డగుటచేతను - **నారాయణు**డే సర్వా ధికు డనుట స్పష్టము. అట్టి **నారాయణుని భార్య య**గు లక్ష్మీదేవి సమస్త లోక జనులకు తల్లియై యున్నది. స్తుతి భక్తి పూర్వకముగ స్తుతించుట కుపయోగించు వా క్సంతతి - నీ కటాక్షము వలన కలుగవలె నని ప్రార్థించుచున్నాను.

**అవతారిక :-** స్తవమునకు అనుకూల మగు వాక్కు మొదల కొని, నిత్యకింకరత్వము వరకు ప్రసాదింపవలసిన దని-కవి లక్ష్మీదేవి కోరుచు, జనులకు లభిమతమైన ఆ లక్ష్మీదేవి యొక్క విలక్షణమై గుణములను ఇపుడు అభివర్ణించుచున్నారు :-

"స్తోత్రం నామక మామవంతి కవయో యద్య న్యదీయాన్ గుణాన్
అన్యత్ర త్వసతోఽధిరోప్యఫణితి స్సా తర్హి వంధ్యా త్వయి
సమ్య క్సత్య గుణాభివర్ణనమథో బ్రూయుః కథం తాదృశీ
వాగ్వాచస్పతిసాపి శక్య రచనా త్వ త్సద్గుణా ర్ణోదధౌ ॥

స్తోత్ర **మనగా** - ఏ మని చెప్పుచున్నారు ? స్తుతింపదలచిన వారి వద్ద లేనివియు, ఇతరులవద్ద నున్నవియు, స్తుతింప దలచినవారి **యందు** ఆరోపించి, స్తుతించి వర్ణించిన దో - అది నీ యెడల వ్యర్థము. నీ**యందు లేని** - ఇతరులయందు గల గుణములు ఏవి కలవు ? అట్లు **గాక**, ఉన్నది ఉన్నట్లు వర్ణింపవలె నన్న దో - నీ శుభ గుణము లనేకము లనుటచే, నిన్ను స్తుతింప బూనుట - ఆ బృహస్పతికైనను **శక్యము కాదు.**

(లక్ష్మీ దేవికి - అనంతములైన కల్యాణ గుణములు కల వని - దీని భావము.)

**అవతారిక** :- ఇట్లు గుణములు అపరిచ్ఛిన్నము లైనపుడు స్తోత్రమునందు ప్రవర్తించుట ఎట్లని శంకించి, దృష్టాంతముతో పరిహ రించుచున్నారు.

"యే వాచాం మనసా చ దుర్గ్రహతయా ఖ్యాతా గుణాస్తావకా
స్తా నేవ ప్రతినాంబుజిహ్వాముదితా హైమామికా భారతీ
హాస్యం తత్తు నమస్మహే నహి చ కోర్యేకాఖిలాం చంద్రికాం
నాలం పాతు మితి ప్రగృహ్య రసనా మాసీత సత్యాం తృషి."

ప్రసిద్ధమైన నీ స్తుతిని స్తుతించుటకే - తడియాడుచున్న న జిహ్వా ప్రవర్తించినది. స్తోత్రము చేయలేకపోవుట తెలిసియుండియు ఇట్లు ప్రవర్తించుట పరిహాసపాత్ర మనియు తలపను. ఒక చకోరి దాహాము కలదియై, వెన్నెల నంతయును త్రాగవజాలకున్నను - తే జిహ్వాను నిగ్రహింపలేదుగదా ! అట్లే, అన్ని గుణములను పూర్తి

స్తోత్రము చేయలేకపోయినను, నా ఆశక్కొలది - చేతనైనంతవరకు స్తోత్రము చేయుదును.

**అవతారిక :-** తాను గుణశూన్యుడ వగుటచే - స్తోత్రము చేయుటకు వీలు లేక, స్తోత్ర ప్రవృత్తియందు లజ్జా - భయములు కలిగియుండుటను స్తుతింపబడు విషయమునకు దోష స్పర్శమును శ్ఙంకించి, దృష్టాంతమును చెప్పుచు, పరిహరించుచున్నారు.

"క్షోదీయా నసి దుష్టబుద్ధి రపినిస్స్నేహో వ్యసీహోసితే
కీర్తిన్తే విలి హన్నహంస చ బిభే ద్యఙ్జోన బిభ్రేమి చ
దుష్యే త్స్వాతున తావతాన హి శునాలీడాపి బాగీరథీ
దు ష్యే చ్ఛ్వాపి న లజ్జతే న చ బిభే త్యార్తి స్తు శాష్యేచ్ఛ నమ్."

లక్ష్మీ ! నేను క్షుద్రుడను, బుద్ధియందు దోషము గలవాడను. స్నేహము లేనివాడను. నీ భక్తుడ ననుకొనదగిన ఏ కైంకర్యము చేష్టయు లేనివా డను. ఇట్టి నేను - నీ కీర్తిని మననము చేయుట యను రుచి చూచుట లెస్స గాదు. భయపడవలసినది - సిగ్గుపడవల సినది. గొప్పవారును. యదార్థము తెలిసికొనుట కుపయోగించు నిర్దుష్టమైన బుద్ధి గలవారును, భక్తిపూర్వకముగ కైంకర్యము చేయు వారే స్తుతించుట కర్హులు. నే నెట్టి యర్హతయు లేనివాడను. ఐనను- నీ కీర్తిని మననము చేయుట యను ఆస్వాదము చేయుటకు భయ పడను. సిగ్గుపడను. క్షుద్రుడ నగు నా సంబంధమువలన - నీ కీర్తి - దోష యుక్తము కాదు. కుక్క త్రాగుటచే - గంగానది దోష యుక్తము కాదు కదా ! కుక్క భయపడలేరుగదా ! ఆ త్రాగుట వలన - కుక్కయొక్క దాహము శాంతించునుగదా ! అట్లే, నిన్ను స్తోత్రము చేయుటచే, నా యార్తి శాంతించును.

**అవతారిక :-** అల్పోదకములకేగాని, మహః ప్రవాహోదకములకు శ్వాడ స్పర్శ దోషము లేదు. కుక్క-గంగోదకము త్రాగనిచో - దాహము శాంతించదు - నేను వర్ణించుటవలన - నీ గుణములకు లోపము లేదు. పవిత్రతయు చెడదు. నా యాసక్తి తీరును. అందువలన స్తుతించెద'ననుచున్నారు.

("న శ్వానవీర మపి - తీర్థంమ తీర్థమాహూర్నో దశ్వతాపి చ లఙ్ఘితవ్యం" (వైకుంఠ స్తవము - 8)

ఇట్లు స్తోత్రము చేయుటను ప్రస్తావించి, స్తోత్రము చేయుచున్నాను.

**"ఐశ్వర్యం మహాదేవవాల్ప మథవా దృశ్యేత పుంసా హి య**
**త్ర లక్ష్మ్యా స్సముదీక్షణా త్తదయత స్సార్వత్రికం వర్తతే**
**తేనై నేతననవిస్మయేవ హి జగన్నాథోఽపి నారాయణో**
**ధన్యం యస్య త ఈక్షణా త్తవయత స్స్వాత్మాన మాత్మేశ్వరః॥"6**

పురుషుల ఐశ్వర్యము కొంచమైనను, గొప్పదైనను - నీ కటాక్షముననే యగును. ఇందు ఆశ్చర్యము లేదు. తన కంటె ఈశ్వరుడు మరి యొకడు లేక, తానే ఈశ్వరుడై, సకల జగన్నాథుడై యున్న నారాయణుడే నీ కటాక్షమువలన, తాను ధన్యుడ నని యనుకొనుచున్నారు. ఇట్లుండగా, జీవుల మాట చెప్పనేల ?

**"ఐశ్వర్యం యదిపుంసి విదితం సౌందర్య లావణ్యయో**
**రూపం య చ్చ హి మంగళం కి మపి య ల్లోకేన దిత్యుంచ్యతే**

త త్సర్వం త్వధీన మేవ యదితి శ్శ్రీరి త్యభేదేన వా
యద్వా శ్రీమదితీదృశేన వచసా దేవి! ప్రథా మశ్నుతే॥" 7

అందరియందునుండెడి యైశ్వర్యమును, సొగసును, కాంతియు, మంగళమైనదియు, మంచి యని చెప్పబడునది యంతయు - నీ యధీన మయ్యే యున్నందున, 'శ్రీ' యని గాని, 'శ్రీమత్' అని గాని - చెప్పబడుచున్నది.

(ఏ విధమైన యుత్కర్ష మైన, లక్ష్మివలననే కలుగుచున్నదని భావము.)

**అవతారిక :-** ఇట్టి నీ యైశ్వర్యముచేతగూడ - ఇంత యని చెప్ప వీలులేని దనుచున్నారు.)

"దేవి ! త న్మహిమావది ర్నహరిణా నాపి త్వయా జ్ఞాయతే
యద్యప్యేవ మథాపి నైవ యువయో స్సర్వజ్ఞతా హీయతే
యన్నాస్త్యేవ తదజ్ఞతా మనుగుణాం సర్వజ్ఞతాయా విదుః
వ్యోమాంభోజ మిదంతయా కిల విద న్భ్రాంతోయ మి త్యుత్యతే." 8

లక్ష్మిదేవీ ! నీ మహిమ యొక్క - ఆవలి హద్దు - నీ భర్త యగు భగవంతునకును, నీకును తెలియదు. అయినను, ఈ తెలియక పోవుటచే, మీ సర్వజ్ఞత్వమునకు భంగము లేదు. లేనిదానిని లేదనుట - సర్వజ్ఞత్వమునకు అనుగుణమైనదే యని చెప్పుదురు. గగనార విందమనునది - లేదు. అట్టి యరవిందము ఇట్టి దని చెప్పువాడు - భ్రమ కలవా డని చెప్పబడును. జ్ఞానము స్వవిషయకముగా నుండును. నీ యొక్క మహిమకు హద్దు లేకపోవుటచే, దానిని తెలియకుండుట -

మిా సర్వజ్ఞత్వమునకు భంగము కాజాలదు. హద్దు ఉండినకదా దానిని తెలిసికొనుట !

"లోకే వనస్పతి బృహస్పతి తారతమ్యం
యస్యాః ప్రసాద పరిణామ ముదాహరంతి ।
సా భారతీ భగవతీ తు యదీ యదాసీ
తాం దేవదేవ మహిషీం శ్రియ మాశ్రయామః ॥ 8

సరస్వతి యనుగ్రహ మున్నచో-బృహస్పతి యంతటివాడగును. లేనిచో - వృక్షమువంటివాడు (మొద్దు) అగును. ఈ తారతమ్యము - ఆ సరస్వతి ప్రసాదమువనే యుండును. ఆ సరస్వతి - ఎవరికి కోడలై, సేవకురాలై యున్నదో - అట్టి లక్ష్మికి నమస్కారము.

"యస్యాః కటాక్ష మృదు వీక్షణ దీక్షణేన
సద్య స్సముల్లసిత పల్లవ ముల్లలాస ।
విశ్వం విపర్యయ సముత్థ విపర్యయం ప్రాక్
తాం దేవ దివ్య మహిషీం శ్రియ మాశ్రయామః ॥" 10

సృష్టికి పూర్వము - ప్రళయ కాలమున - ఈ ప్రపంచము లక్ష్మి కటాక్షము లేకుండుట చేతనే - కార్య రూపమును ధరింప కుండెను. విమ్మట - లక్ష్మీకటాక్షము కలుగుట చేతనే - వెంటనే చిగిర్చి, ఉల్లాసము గలదియై, వృద్ధి పొందెను. అట్టి లక్ష్మీదేవిని ఆశ్రయించుచున్నాము.

**అవతారిక :-** ఇట్లు తన కంటెను ఇతరమైన విషయమందు చూడబడిన లక్ష్మీ కటాక్ష వైలక్షణ్యమును తన యందు కూడ ప్రార్థించి, స్తోత్రమును సమాప్తి చేయుచున్నారు.

"యస్యాః కటాక్ష వీక్షణ లక్ష్యం లక్ష్మితామ హేశాస్స్యుః ।
శ్రీరంగరాజ మహిషి సామా మపి(ఖి)వీక్షితాం లక్ష్మీః ॥"

ఎవరి కటాక్షమునకు క్షణ కాలము పాత్రులైనవా రధిక ఐశ్వర్యవంతు లగుదురో - ఆ శ్రీరంగనాథుని మహిషి యగు శ్రీరంగనాయకి - నన్ను కూడ కటాక్షించుగాక !



# దశావతారములు - తద్విశేషములు

'సాహిత్య విద్యాప్రవీణ'
డాక్టర్ : సముద్రాల వేంకట రంగరామానుజాచార్యులు
ఎం. ఏ., పి. హెచ్. డి.

★

## 1. మత్స్యావతారము

శ్లో॥ శ్వాసోద్గీర్ణ జల చ్ఛటాతి విపులం - ఖం దేశ మేకార్ణవం
కృత్వా స్వాశ్రయభూత వారినిధి మ ప్యాకాశ దేశం తథా
శృంగోత్తుంగ - మహా వపుః ప్రచలన క్షుబ్ధాబ్ధి గర్భే భ్రమత్
యాదోరాశి రమేయ మీన సుతను ర్వైకుంఠనాథో జయేత్ ॥

— (వైకుంఠనాధ విలాసము)

మత్స్యావతారమును గురించిన ప్రస్తావన - శతపథ బ్రాహ్మణములో నున్నట్లు - 'అవతార తత్త్వము - దశావతారములు' - అను రచనలో - ఇంతవరకు మున్నే నిరూపింపబడినవి. మత్స్య పురాణములో - ఈయవతారమునకు సంబంధించిన గాధ విస్తృతముగానున్నది. మత్స్యావతార విషయములో - మన భారతీయ పురాణములందు వలననే - గ్రీసు పురాణములు కూడ - చక్కని వర్ణన చేసియున్నవి. ఈ సమస్త బ్రహ్మాండమును ఒకే మహా మత్స్యము తన కొమ్ముపై ధరించుచుండునని గ్రీసు పురాణములు చెప్పుచున్నవి. మత్స్యావతారమునకు సంబంధించిన రెండు కథలు ప్రచారములో నున్నవి.

1. సోమకు డను రాక్షసుడు - వేద రాశిని అపహరించి, సముద్ర మధ్యములో దాగినపుడు - శ్రీమన్నారాయణుడు మత్స్య దేహమును ధరించి, సముద్ర గర్భములో ప్రవేశించి, సోమకుని సంహరించి, వేదములను సంరక్షించెనని ఒక కథ.

2. రెండవది - ప్రళయానంతరము సర్వ ప్రపంచము జలాకీర్ణమై, కాలు మోపు వీలు కాని దశలో - స్రష్టృయైన మనువును - నావతో బాటు - తన శృంగమునకు తగిల్చికొని రక్షించెనని వేరొక గాథ కలదు.

ఈ రెండు గాథలను గురించి శ్రీమద్భాగవతము లెస్సగా వర్ణించినది.

ఇదియే ప్రథమావతారముగాన - భాగవతములో పేర్కొన బడి యున్నందున కల్పాంతమునందు బ్రహ్మాండమైన నైమిత్తిక ప్రళయము ఏర్పడినపుడు - సకల లోకములు నీటిలో నిండినపుడు - చతుర్ముఖుడు కాలానుగుణముగా నిద్రాపరవశుడైనపుడు - ఆతని మొగము నుండి బయల్వెడలిన వేదములను - 'హయగ్రీవు' డను రాక్షసుడు హరించెను. ఆ దుష్కృత్యము నెఱింగిన శ్రీహరి - మత్స్యావతారమును ధరించి, ఆ రాక్షసుని సంహరించి, వేదములను బ్రహ్మకు అందజేసెను. ప్రళయ కాలములో - సత్యవ్రతుడను రాజర్షిని - తన కొమ్మునకు కట్టిన నావలో రక్షించి, తనకు సంబంధించిన తత్త్వ రహస్యమును తెలియజేసెను. ఈ విషయమును భాగవతము ఈ క్రింది విధముగా వివరించుచున్నది :-

"ప్రళయ పయసి ధాతుః గుప్త శక్తే ర్మఖిఖ్యః
శ్రుతి గణ మపనీతుం ప్రత్యుపాదత్త హత్వా
దివిజ మకభయో బ్రహ్మ సత్యవ్రతానాం
త మహ మఖిల హేతుం జిహ్మ మీనం నతోఽస్మి."

శ్రీరంగరాజ స్తవమునందు ఉత్తర శతకములో - ఈ వృత్తాంత మును శ్రీ పరాశరభట్టరువారు ఈ విధముగా అభివర్ణించినారు :-

"మీన తను స్త్వం, నావి, నిధాయ
స్థిర చర పరికర మను మను భగవన్ ।
వేదసనాభిస్వోక్తి వినోదైః
అకలిత లయ భయ లవ మము మవహః." (ఉ. శ. 60)

భగవంతుడా! మీన శరీరము గల నీవు - మనువు సమీప మందు - ఓడ యందు స్థావర జంగముల పరికరముల నుంచి, వేద సమానమైన వినోదోక్తులచేత - ప్రళయ భయ లేశమును చింతింపక - నడచితివి," ఇదియే ఈ శ్లోక తాత్పర్యము.

శ్రీ వేదాంతదేశికులు - తమ దశావతార స్తోత్ర మందును, మఱికొన్ని రచన లందును - అవతార ప్రస్తుతి చేసియున్నారు. దశావ తార స్తవము నందలి ఈక్రింది శ్లోకము - మత్స్యావతారమును లెస్సగా నిరూపించుచున్నది :-

"నిర్మగ్న శ్రుతి జాల మార్గణ దశా దత్త క్షణై ర్వీక్షణై
అన్తస్త న్వ దిఠారవింద గహనా న్యౌదన్వతీనా మపామ్ ।
నిష్ప్రత్యూహ తరంగ రింగణ మిథః ప్రత్యూఢ పాథశ్ఛటా
డోలారోహ సదోహలం భగవతో మాత్స్యం వపుః పాతు నః" (2)

సోమకాసురునిచేత సముద్ర గర్భములో దాచబడిన శ్రుతి జాలమును స్వామి వెదకుచుండెనట ! ఆ సమయములో - సముద్ర గర్భమునందు అటు నిటు - నలువైపులందును ప్రసరింపజేయబడిన చూపులు - సముద్రాంతర్జలమును - పద్మములతో నిండినట్లు చేయు చున్నవట ! సముద్రమునకు పద్మ శోభ - సహజముగా నుండదు. కాని, వేదాన్వేషణా తత్పరుడైన స్వామి నయనములే దానికి ఆ సొగసును కలిగించినవట ! ఇక - తరంగములు స్వేచ్ఛగా - అటు నిటు కదలుచుండ - ఆ తరంగములపైన నున్న స్వామి తనువు ఉయ్యాల ఊగుచు న్న'దని - మనోజ్ఞముగ వర్ణించినారు దేశికులు.

క్షేమేంద్రుడు - తన దశావతార స్తవములో - మత్స్యావతా రమును అరువది (60) శ్లోకములలో వర్ణించినాడు. ఈ కథ - శత పథ బ్రాహ్మణములోని కథ నాధారముగావించుకొని వర్ణింప బడి నది. అదియును గాక - ఈ మత్స్యావతారముతో సంబంధించిన 'న్యగ్రోధ శయనావతారము'ను సైతము - మత్స్యావతార వర్ణనా సందర్భమున క్షేమేంద్రుడు నిరూపించినాడు.

ఆళ్వారుల దివ్య ప్రబంధములందలి పాశురములలో - ఈ మత్స్యావతారమును గురించిన ప్రసక్తి - అంతగా - కానరాదు. వీరి రచనలలో — ముఖ్యముగా - రామ, కృష్ణ, త్రివిక్రమ, నారసింహావ తారములు కీర్తింపబడినవి. 'అమలనాది పిరాన్' అను ద్రావిడ దివ్య ప్రబంధము నందలి రెండవ పాశురములో - తిరుప్పాణాళ్వారులు - భగవానుని న్యగ్రోధ శయన మూర్తిగా భావించి ప్రస్తుతించినాడు. నమ్మాళ్వారులును - తమ 'తిరువాయి మొళి' దివ్య ప్రబంధములో -

నాల్గవ శతకమందలి రెండవ దశకములో - స్వామిని వటపత్రశాయిగా భావించి వర్ణించిరి. కాని మత్స్యావతార ప్రసక్తి లేదు. అయినచో - భగవానుని కారుణ్య గుణమును కీర్తించుటకై - ప్రథమ శతకము లోని అష్టమ దశకమున - మత్స్య వరాహావతారములు విద్యావతార ములుగా - అనగా - తత్త్వ విద్యను, అందించుటకు స్వీకరించిన అవతారములుగా నిర్దేశింపబడినవి.

## 2. కూర్మావతారము

ఈ కూర్మావతార విషయమునందును - రెండు గాథ లున్నవి. సముద్ర మథనము గావించిన సందర్భమున - మందర పర్వతము నీట మునిగిపోవుచున్నప్పుడు భగవానుడు దేవతలచే ప్రార్థింపబడి, కూర్మ రూపమును ధరించి, తన వీపుపై - ఆ పర్వతమును మోపినాడని శ్రీమద్రామాయణము నందునూ, విష్ణుపురాణము నందును ఈ గాథ ఉన్నది. శ్రీమద్రామాయణము నందలి బాల కాండలోని 45 - వ సర్గలో -

"ఇతి శ్రుత్వా హృషీకేశః - కామఠం రూప మాస్థితః
పర్వతం పృష్ఠతః కృత్వా - శిశ్యే, తీర్థే దధే హరిః"

అని ఉన్నది.

విష్ణు పురాణములో -

"క్షీరోదమధ్యే భగవాన్ - కూర్మరూపీ స్వయం హరిః
మందరాద్రే రధిష్ఠానం - భ్రమతోఽభూ న్మహామునే !" — (1-9 88)

ఇత్యాదిగా - కూర్మావతార గాథ వర్ణింపబడినది. ఇచటనే -

"మాయయా మోహయిత్వా తాన్ - విష్ణుః స్త్రీరూప సంస్థితః
దానవేభ్యస్త వాదాయ - దేవేభ్యః ప్రదదే ప్రభుః."

అని - మోహినీ అవతార ప్రశంస చేయబడినది.

శ్రీ గోదాదేవి - నాచ్చియార్ 'తిరుమొళి'లోని -

"కడలే కడలే యున్నై క్కడైందు కలక్కుఱుత్తు"

అను పాశురములో - సముద్ర మథనము చేసి, సారభూతమైన అమృతమును వెలికి దీసిన స్వామిని కీర్తించినది. ఇట్లే - 8 - వ తిరుమొళిలోని - "విణ్ణీల మేలప్పులన్" అను - మేఘసందేశము నందు -

"శంగమాకడల్ కడైందున్ తన్ ముకిల్ గాళ్."

ఇత్యాదిగా - శంఖములచే నిండియున్న మహా సాగరమును మథించి, అమృతమును సంపాదించి, దేవతలను రక్షించినవానిగా స్వామి కీర్తింప బడినాడు. ఇచట - కూర్మావతార విశేష ప్రసంగము లేదు.

కూర్మావతారము కేవలము సముద్ర మథనమునకు మాత్రమే పరిమితము కాక, సమస్త బ్రహ్మాండమును మహా కూర్మరూపములో భగవానుడు నిరంతరము మోయుచు, దానికి ఆధారమై యుండు నను భావము కూడ పురాణములలో నున్నది. ఈ భావమును శ్రీహర్షుడు తన నైషధ కావ్యములో - ఇట్లు వ్యక్తము గావించును.

"భూరి సృష్టి ధృత భూవలయానాం సృష్టసీమని కిటి రివచక్రైః
సూచితావతు జగత్ క్షిత రక్షా కర్మఠస్య కమఠ స్తవ మూర్తిః."

సప్తపాతాళముల చివఱ - (అడుగున) తన సహస్రఫణా మండలము మీద స్వామి తాను - 'అనంత' రూపముతో భువిని మోయుచుండును. దానికంటెను క్రింద బ్రహ్మాండపు క్రింది కటాహ భారమును తన పృష్ఠముపై (వీపుపై) మోయుచు, బ్రహ్మాండమునకు ఆవరముగా నున్న జలములో - కూర్మరాజు ఉండును. ప్రతిసృష్టి యందును అనంతమైన బ్రహ్మాండ మండలమును స్వామి తన వీపుపై ధరించుచుండుట వలన, చక్రాకార వలయములు అసంఖ్యాకముగ ఏర్పడెనట. ఈ విధముగా స్వామి - నిరంతరము క్షితి రక్షా కర్మరుడై యుండెనట.

మాఘ కవియు - శిశుపాల వధ కావ్యమున -

"బిభ్రతే భువన మథః సనాథ బ్రహ్మణో వ్యపది తిష్ఠతే నమః"

అని - నిరంతరము భూభారమును వహించు మూర్తియే కూర్మమూర్తి యని కీర్తించెను. ఇది - స్వామి మహత్వమునకు నిదర్శనమని కవి తాత్పర్యము. వరదరాజ స్తవములో - శ్రీవత్సాంక - కౌస్తుభ - లక్ష్మీసనాథమైన కూర్మమూర్తి యొక్క వక్షఃస్థల శోభను ఈవిధముగా కీర్తించుచున్నారు శ్రీవత్సాంకమిశ్రులు -

"మథ్యమానచల ఫేనిలసింధుప్రోత్థితక్షణదళాంగ మితౌ తే
వక్షసి స్ఫురిత మౌక్తిక హారే! కౌస్తుభ శ్చ కమలాచ కరీశ!" (శ్లో॥ 29)

కరిగిరీశ ! ప్రకాశించు ముత్యముల హారములు గల నీ వక్షఃస్థలమం దున్న కౌస్తుభమును, లక్ష్మియు - మధింపబడుచున్న -

కదలుచున్న నురుగు గల సముద్రమున - అప్పుడు పుట్టిన దశను కలిగియున్నది' అని కీర్తించిరి.

ఈ కామఠ మూర్తిని ప్రస్తుత వ్యాసకర్త —తన వైకుంఠనాథ విలాసములోని వైభవ విలాసమునందు ఇట్లు స్తుతించినాడు :-

"క్షీరోదో న్మథన ప్రభూత కమలా లీలా విలోలాతురా
చ్ఛార్ద్రాపాంగ తరంగ సంగమ సమిద్భోత్సాహ కమ్రాననః
శ్రీమత్కామఠ పృష్ఠపీఠ విలురన్ మంథాచలో ద్ధారకృత్
ధీరో ధర్మ సుపీరితాం విశదయన్ జీయా ద్వికుంఠప్రభుః."

క్షీరోద మథన వేళలో ఆవిర్భవించిన లక్ష్మి - తన కొఱకు స్వామి చేయు పరిశ్రమను చూచి, ప్రీతితో చంచలములు, ఆతుర తతో కూడినవి, స్వచ్ఛములు — ఆర్ద్రములు అయిన తన అపాంగ తరంగములను స్వామి చూపులతో సంగమింపజేయగా - రెచ్చించిన ఉత్సాహముతో - మనోజ్ఞమైన వదన బింబము గలిగినస్వామి - తన కామఠ పృష్ఠముమీద గిర గిర తిరుగుచున్న మంథనాచలమును ధీర తతో మోసి, తన ధర్మసువేదతను లోకమునకు చాటుచున్నారట !

ఈ కూర్మావతారమును గురించిన ప్రస్తావన - శతపథ బ్రాహ్మణములో నున్నట్లు - ఇంతకుమున్నే తెలుపబడినది కదా !

## 3. వరాహావతారము

దీవ్య చ్చాంద్ర కలా విలాస రుచిర స్వచ్ఛోర్ధ్వ భంగీ లసన్
దంష్ట్రాగ్రోర్భియ మాబిబమ్మ ధరణీ చించోజ్జ్వల శ్రీధరః
శ్రీమ త్ఫుల్ల కుశేశయోద్ధరణ కృ చ్చృందావిలోసోల్లసన్
దిగ్దంతీవ మహాహ్రదోత్థిత వపుః జీయా ద్వికుంఠ ప్రభుః.

— (వైకుంఠనాథవిలాసము)

వరాహ పురాణములో - ఈ వరాహావతార విశేషములు నిరూపింపబడి యున్నవి. వరాహావతార వర్ణనము - విష్ణుపురాణ ములో మిగుల మనోజ్ఞముగానున్నది. ఈ ఘట్టములో - పురాణ శైలి కాక, ప్రబంధ శైలి హృద్యముగా సాగినది.

"అకరోత్ స్వతమా మన్యాం - కల్పాదిషు యథా పురా
మత్స్యకూర్మాది కాం తద్వత్ - వారాహం వపు రాస్థితః."

కల్పాదుల యందు మత్స్య కూర్మా ద్యవతారములు పరిగ్ర హించినట్లే, జలాంతర్లీనమైన పృథివిని ఉద్ధరించుటకు వారాహ రూప మును ధరించి, స్వామి - జలములో ప్రవేశించెను. ఒకప్పుడు - హిరణ్యాక్షుడను రాక్షసుడు భువిని అంతటిని చాప చుట్టవలె చుట్టి, పాతాళమునకు తీసికొనిపోయెనని - అతనిని సంహరించి, పృథి విని - వరాహ రూపుడైన పరమాత్మ ఉద్ధరించెననియు పౌరాణిక గాథ ఉన్నది. కాని, విష్ణు పురాణములో ఈ కథ - ప్రస్తావింపబడలేదు. వరాహావతారము కూడ - కూర్మావతారము వలె - ప్రతి ప్రళయ ముతో ముడివడి ఉన్నదే. ప్రళయాబ్ధినుండి తనను ఉద్ధరించవలసినదని ప్రార్థించిన పృథివిని - స్వామి వరాహ రూపధారణము చేసి రక్షించి నట్లు పూర్వ శ్లోకము చెప్పుచున్నది.

"తత స్సముత్క్షిప్య ధరాం స్వ దంష్ట్రయా
మహా వరాహః స్ఫుట పద్మలోచనః
రసాతలా దుత్పలపత్ర సన్నిభః
సముత్థితో నీల ఇవాచలో మహాన్."

తన కోరపై పుడమిని ధరించుచు వికసించిన పద్మముల వంటి సుందర నయనములు కలిగిన మహా వరాహము - తామరస పత్రము వంటి పచ్చని దేహ కాంతి కలిగి, నల్లని పెద్ద కొండ వలె పైకి వచ్చె నట. మఱి యొక శ్లోకములో ఇట్లు వర్ణింపబడినది— పైకి లేచుచున్న ఆ మహా వరాహమూర్తి యొక్క ముఖ వాయు ప్రేరితమైన సముద్ర జలము జన లోక పర్యంతము పైకి చిమ్మబడి, అచ్చట - మహా వరాహ దర్శనము చేయుచున్న సనక సనందాది మునులను పవిత్రుల గావించె నని - విష్ణు పురాణము వర్ణించుచున్నది. ఆ వరాహావతారము యొక్క లక్ష్యము - కేవలము ధరణీ వలయము నుండి ఉద్ధరించుట మాత్రమే కాదు, ప్రళయమునకు పూర్వము పర్వతాదులు ఎట్లు ఉన్నవో - అట్లు యథావిభాగము పూర్వ స్థితి కల్పించుట కూడ మహా వరాహ రూపములో నున్న స్వామి - ఈ పని చేసె నని విష్ణు పురాణ మనుచున్నది :-

"తతః క్షితిం సమాం కృత్వా – పృథివ్యాంసోచినోద్గిరీన్
యథా విభాగం భగవాన్ – అనాదిః పరమేశ్వరః."
— (విష్ణు పురాణము : 1-4-47)

విష్ణు పురాణములో వర్ణించబడిన ఈ మహా వరాహ స్వరూపము యజ్ఞమయమైనది. స్వామి యొక్క నయనములు అహోరాత్రములు. ఓంకారమే శిరస్సు. సమస్త వైదిక సూక్తులు జటాజూటము. సమస్త హవి ద్రవ్యములు ఘ్రాణము. స్రుక్కు-పొడవైన ముఖాగ్రమే కంఠనాదము సామ వేదము. సమస్త శరీరము ప్రాద్వంశము (అగ్నిశాలయొక్క ప్రాక్ ప్రదేశము) సత్రమే సంధి బంధములు— ఇష్టా పూర్త ధర్మములే శ్రోత్రయములు. నాల్గు పాదములు నాల్గు

వేదములు. దంష్ట్రిలు యూప దండములు. దండములలో యజ్ఞములు, ముఖములో - చేతులు ఉన్నవి. ఆ మహా వరాహ జిహ్వయే అగ్ని. శరీరము మీాది కేశములు దర్భలు. ఈ విధముగా, యజ్ఞ స్వరూప ముగా - మహా వరాహావతారము వర్ణింపబడినది. ఈ వర్ణనమునుబట్టి యజ్ఞ వరాహమూర్తి గా స్వామి ఇచట నిరూపింపబడె ననుట స్పష్టము. వరాహ పురాణము కూడ - ఈ విషయమును స్పష్టము గావించు చున్నవి :-

> "కల్పే కల్పే భవా నేవం - మాం సముద్ధరసి ప్రభో
> సదాహం వేదతే మూర్తిం - ఆదిసర్గే చ కేశవ."

అని ప్రళయ కాలయములో తనను ఉద్ధరించుచున్న స్వామిని గురించి జిజ్ఞాస చేసిన పృథివికి, స్వామి తన తత్త్వమును విపులీకరించుట - వరాహ పురాణములోని విశేషము. వరాహ మూర్తి స్తవనము వైష్ణవాచార్యులచే చేయబడినను - ఆళ్వారుల దివ్య ప్రబంధము లలో - వరాహావతార స్తవము విశేషముగా కానవచ్చును. నాచ్చి యార్ తిరుమొళిలో - 'పాశియాత్తు కుఓడన్ద్రిపాల్ ముకట్కు' - ఇత్యాది పాశురములో - పూర్వము ప్రళయ జలధిలో మలినము పట్టి యున్న పృథివిని ఉద్ధరించుటయే - జలము ఓడుచు, మానమును విడచి, సుందర రూపమును ధరించి, దివ్య తేజశ్శాలియైన రంగనా థుడు భూదేవితో -

> "తతః స్మ్రియమాణ స్తు - కాష్ఠ పాషాణ సన్నిభమ్
> అహం స్మరామి మ ద్భక్తం - నయామి పరమాం గతిమ్"

అని పలికి, వారాహ చరమశ్లోకమును అనుగ్రహించినాడట. ఆమాట లను గోదాదేవి - ఈ పాశురములో - మరువక భావన చేయుచున్న దట !

ఈ వరాహ మూర్తిని - ప్రస్తుత వ్యాసకర్త - వైకుంఠనాథ విలాస కావ్యములో - ఇట్లు వర్ణించెను :-

"పాశ్చాత్యంనిజపాదయుగ్మమననే శుద్ధారజార్ధంపయో
రాశేరంత రశేష నాగ నిలయె - పాతాల దేశే స్థితమ్
సంస్థాప్యోర్ధ్వముఖేన పూర్వచరణ ద్వంద్వేన ఖందేవహ
ఘ్యల్లిఖ్యాద్భుత పోత్రిమూర్తి కవితో వైకుంఠ నాథో జయత్."

భూమిని ఉద్ధరించుటకు తన వెనుక కాళ్ళను రెంటిని సము ద్రాంతర్భాగనిలయమైన పాతాళములో గట్టిగా ఊన్చి, ఊర్ధ్వ ముఖముగా నున్న ముందరి రెండు పాదములను పైకెత్తి, దానినే ఆకాశమున ఒరసిన అద్భుత వారాహమూర్తిధారియైన వైకుంఠ నాథుడు - జయించునుగాక !

యజుర్వేదాంతర్గతముగా - 'వరాహోపనిషత్తు' అను పేర నొకటి ప్రత్యేకముగ ఆవిర్భవించియుండుటనుబట్టి, ఈ యవతార ప్రాశస్త్యము అవగత మగుచున్నది.

## 4. నృసింహావతారము

ఆళ్వారుల స్తుతికి పాత్రమై, లెస్సగా వర్ణింపబడిన అవతారము లలో - నృసింహావతారము ఒకటి వరాహోపనిషత్తు వలెనే అథర్వ ణీయ నృసింహ తాపి న్యుపనిషత్తు - నృసింహ తత్త్వమును, మంత్రా

నుష్ఠాన విధానమును నిరూపించుచున్నది. భగవద్రామానుజుల కంటెను చాలముందు కాలమునకు జెందిన వైష్ణవ రుద్ర సంప్రదాయ ప్రవర్తకునిగా భావింపబడు విష్ణుస్వామి - నృసింహ తత్త్వ పారమ్యమును నిరూపించిరి. రుద్ర సంప్రదాయమును అనుసరించి - నృసింహ మూర్తియే పరతత్త్వము. తన పూర్వ వ్యాపకతా లక్షణమును లోక విశదము చేయుట కొరకు - స్వామి అవతారమును ధరించినట్లు శ్రీ భాగవతము చెప్పుచున్నది.

> "సత్యం విధాతుం నిజభృత్యభాషితం
> వ్యాప్తిం చ భూతే ష్వఖిలేషు చాత్మని
> అదృశ్యతా త్యద్భుత రూప ముద్వహన్
> స్తంభే సభాయాం న మృగం న మానుషమ్." (7-8-18)

తన భృత్యుని మాటను సత్యము గావించుటకు, సర్వ భూతములందును తన వ్యాప్తిని చాటుటకును, మృగము - మానుషము కాని - అద్భుతమైన రూపములో - శ్రీమన్నారాయణుడు - సభా స్తంభములో ఆవిర్భవించినాడు. స్తంభములో నుండి ఆవిర్భవించిన నృశింహస్వామి యొక్క ఆవిర్భావ సన్నివేశమును శ్రీభాగవతము మిగుల మనోజ్ఞముగా వర్ణించినది. నృసింహావతారము స్తంభములో నుండి అయినట్లు శ్రీ భాగవతము వర్ణించగా, శ్రీ నారదీయ పురాణము - స్తంభములోనుండి కాక, ఎచ్చటనుండియో బాహ్యప్రపంచమునుండియే సాక్షాత్కరించి, సభా ప్రవేశము చేసినట్లు వర్ణించినది. శ్రీ విష్ణుపురాణము - వరాహ కల్పమునకు జెందిన ప్రహ్లాద వృత్తాంతమును పరామర్శింపగా, నారదీయ పురాణము - పాద్మ కల్పమునకు జెందిన - ఈ వృత్తాంతమును వర్ణించినవి. వానినిబట్టి కల్ప

భేదము ననుసరించియు - అవతార వర్ణనములలో - స్వల్పముగా వ్యత్యాసముండవచ్చును-అని స్పష్ట మగుచున్నది. విష్ణు పురాణ ములో ప్రహ్లాద చరితమున్నను - శ్రీ నృసింహావిర్భావ ఘట్టములేదు.

అయినచో - ఆళ్వారులు - స్తంభమునుండి ఆవిర్భవించి, తన సర్వ వ్యాపకతను నిరూపించిన నరసింహమూర్తిచే తమ ప్రబంధము లలో వర్ణించినారు. శ్రీ శఠకోపులు (నమ్మాళ్వారులు) తమ తిరు వాయి మొళిలోని ద్వితీయ శతకమందలి అష్టమ దశకములో :-

"ఎంగు మిళిన్ కణ్ణనెన్ఱ మగలై క్కాయ్ న్దు
ఇంగిల్లై యాలెన్ఱురణియన్ యాణ్ పుడైప్ప,
అంగప్పొళే అవన్ యత్తోన్ఱియ, ఎన్
శింగప్పిరాన్ పెరుమై ఆరాయుమ్ శీర్ మైతే."

అని వర్ణించినారు. ఈ ద్రావిడ పాశురమునకు ఆంధ్ర పద్యానువాద మిది :-

"పరమ పురుషుండు సర్వత్ర పరగు ననుచు
బలుకు ప్రహ్లాదునెడల లే దనుక పూని
యట్లు లగునేని - యీ స్తంభమందు జూపు
మని హిరణ్యకశిపుడు బట్టిన క్షణంబె
సింహ రూపంబు గొని, వాని జీల్చినట్టి
నారసింహాని మహిమ వివాదణంబు
జేయవశెనాళ్కా! - లోక ప్రసిద్ధముగద!!"

— (శ్రీముఖ సూక్తి : 2-8-రి)

'విష్ణువు అంతటను వ్యాపించియున్నాడు' అని పలికిన - కుమారుడైన ప్రహ్లాదుని కోపించి, 'ఇచ్చట లేడు' అని హిరణ్యకశిపుడు స్తంభమును కొట్టగా, అచ్చట - అపుడే ఆ రాక్షసుని అంతమొందించుటకు అవతరించిన నృసింహస్వామి యొక్క ప్రభావము విస్మరింపదగినదియా ?' అని - నృసింహ వైభవమును అంగీకరింపనివారి గతి - 'హిరణ్యకశిపుని గతియే' యని హెచ్చరిక చేయుచున్నారు నమ్మాళ్వారులు.

'అమలనాది పిరాన్' ప్రబంధములో తిరుప్పాణాళ్వారులు నృసింహస్వామిని -

" పరియా వాకినన్ద నపుణ మదట్ కీణ్ణ. "

బలిష్ఠ శరీరుడై, ప్రహ్లాదుని బంధింపవచ్చిన హిరణ్యకశిపుని ఒడలు చీల్చినవాడని - స్వామిని కీర్తించిరి.

సుందరబాహు స్తవములో - శ్రీవత్సాంకమిశ్రులు నృసింహావతార సన్నివేశమును అత్యంత సుందరముగా వర్ణించిరి.

"నఖక్రకచక వ్రధిక్రథిత దైత్యవక్షస్థలీ
సముత్థ రుధిర చ్ఛటా చ్ఛురిత బింబితం స్వం వపుః
విలోక్య రుషితః పునః ప్రతి మృగేంద్ర శంకావశాత్
య ఏష నరకేసరీ స ఇహ దృశ్యతే సుందరః " (97 శ్లో॥)

తన వాడియైన గోళ్ళనే రంపపు టంచుతో - హిరణ్యకశిపుని కఠోర వక్షస్థలమును కోసివేసినపుడు - వెలికి వచ్చిన రక్త ధారలు

వచ్చి క్రింద ప్రవహించినపుడు - ఆ రక్తపుమడుగులో తన ప్రతిబింబమును చూచిన నృసింహస్వామి - వేరొక మృగేంద్రమా! అనునట్లు అసహన భావముతో రోషమును ప్రదర్శించుచున్నపుడు - స్వామి యొక్క ఆకారము - దర్శనీయముగా ఉన్నదట!

వేదాంత దేశికు లీ నరసింహావతారమును మరి యొక రీతిలో - చమత్కారముగా వర్ణించిరి. ప్రాతపడిపోయిన ఆయుధము లన్నియు స్వామి విడిచిపెట్టి, ఒక్క క్షణము తన నఖముల చేతనే మూడు లోకములను ఆ వైకుంఠ కంఠీరవుడు రక్షించవలె ననిరి. స్వామి అద్భుతమైన నారసింహ రూపమున ఆవిర్భవించినపుడు - రాక్షస గృహములో - ఊరు, పేరు - లేక, పడియున్న ఒక స్తంభము - తన కడుపు పండి, నిఖిల బ్రహ్మాండములందును గల చతుర్ముఖబ్రహ్మలకు తాను నాయనమ్మ అయి కూర్చున్నాడట ! చూడుడు :-

"ప్రత్యావిష్ట పురాతన ప్రహరణగ్రామః క్షణం పాణిజైః
అవ్యాత్త్రీణి జగన్త్యకుణ్ఠ మహిమా వైకుంఠ కంఠీరవః
యత్ప్రాదుర్భవ నాదవన్ధ్య జఠరా యాదృచ్ఛికా ద్వేధసాం
యా కాచిత్ సహసా మహాసుర గృహ స్థూణాపితా మహ్యభూత్."

ఇక ప్రస్తుత వ్యాసకర్త - తన వైకుంఠనాథవిలాసములో నృసింహ స్వామి యొక్క వీక్షణములను ఇట్లు వర్ణించెను :-

"క్రూరోద్వృత్త హిరణ్యపూర్వకశిపూ న్మాథస్ఫులింగోద్గిర
ద్ధూమాన్తతతను జన్మలాలన కలా లీలా విలోలాపదమ్
క్షీరాబ్దేస్తనయాం భయత్రివికలా మాలోకితుం శీకలాః
నూనం శ్రీనరసింహ మూర్తివదిమా శ్చేతోవిచిత్రాదృశః."

క్రూరతతో తీవ్ర స్వభావియై ప్రవర్తించిన హిరణ్యకశిపుని వధించుటకు – నిప్పురవ్వలు చిమ్ముచు, భయము గొలుపుచున్న స్వామి చూపులు - ఆప్రక్క - తన అపూర్వ రూప మును దర్శించి, భయ చకితమైన క్షీరాబ్ధి కన్యను దర్శించుటలో - శ్రీవిలాస రుచిరములై నవి. ఈ విధము - శ్రీ నరసింహమూర్తి వలెనే - ఆయన చూపులును చిత్ర విచిత్రములుగా నున్నవని అభిప్రాయము.

## 5. వామనావతారము

వేదములో - త్రివిక్రమ రూపముగా ఈ వామనావతారము కీర్తింపబడినది. వాస్తవమునకు త్రివిక్రమత్వము శ్రీ మహా విష్ణువు యొక్క స్వరూపస్య రూపక ధర్మములలో ఒక్కటిగా మనకు కాన వచ్చును.

> "ఇదం విష్ణు ర్విచక్రమే త్రేధా నిదధే పదమ్"
> "యస్యోరుషు త్రిషు విక్రమణేషు. అధిక్షియన్తి భువనాని విశ్వా."

ఇత్యాదిగా - ఋగ్వేదీయ సూక్తములో కీర్తింపబడిన త్రివిక్రమత్వమునకు వామనావతారము పౌరాణిక కథాకల్పన మని చెప్పుట సముచితము. ఆళ్వారులు తమ దివ్య ప్రబంధములలో - రామ - కృష్ణావతారముల తరువాత - తరచుగా ప్రస్తుతింపబడిన దీ త్రివిక్రమావతారమే తిరువాయిమొళిలోని ప్రథమ శతకాంతర్గతమైన దశమ దశకములోని మొదటిపాదములో - వామన మూర్తిని ఇట్లు కీర్తించిరి :-

"పొరుమానీళ్ పడై ఆళిశంగత్తొడు
    విరుమానీళ్ కళల్ ఏలలగుమ్ తావ
అరుమాణి కుఱళాగినిమిర్న్ద అ
    క్కరుమాణిక్కమ్ ఎన్కణ్ణుళవాగుమే."

ఈ ద్రావిడ పాశురమునకు ఆంధ్ర పద్యానువాద మిది :-

"బలిని బంధింప మనసు లోపల దలంచి
    సంగరోన్ముఖ భాసురోజ్జ్వలములైన
శంఖ చక్రాది సాధన సహితు డగుచు
    లలిత సంపూజ్య సౌందర్య రాసు లనగ
వెలయు నిడుద లౌ పాదారవిందములను
    అఖిల లోకంబుల జగంబు లాశ్రయింప
పరమ సుకుమారి వామన బ్రహ్మచారి
    లోకముల గొల్వ బెరిగిన రూపధారి
నీల మాణిక్య కాంతుల డాలుతోడ
    దర్శనానంద మొసగె నా తనివిదీర."

— (శ్రీ ముఖ సూక్తి : 1-10-1)

యుద్ధము గావించుచున్న మహాదీర్ఘ శంఖ చక్రములతో కూడి, శ్రీ సంపన్నమైన మహా దీర్ఘ చరణమును సప్త లోకములు ప్రణమిల్లుచుండగా, ద్వితీయ మాణవక వామనుడై వృద్ధి చెందిన ఆ నీల మాణిక్యము - నేత్రములలో అంతర్భవించునుగాక !' అని - నమ్మాళ్వారులు భావించిరి. అట్లే - ద్వితీయ శతకమునందలి ద్వితీయ దశకములో - మూడవ పాశురమున - పరమ పద వాసులు తనను ఆశ్రయించునట్లుగా ఊర్ధ్వ లోకములు మించు విధముగా పెరిగి, భూమిం

నంతటిని కొలిచిన శ్రియఃపతి కంటెను మేలైన దైవము లేదనియు, మఱి యొక తావున - ఆ స్వామి - ఏడు లోకములను కొలిచిన సర్వేశ్వరు డనియు - బహు భంగులుగా శరకోపులు కీర్తించిరి.

'తిరుమాలై' దివ్య ప్రబంధములో - తొండరడి ప్పొడియా ళ్వారులు - 'త్రిలోకములను దోచుకొనబడినపుడు — లోకము నంతటిని కొలిచి, జనుల శిరస్సునందు తన శ్రీ చరణములు పడునట్లు చేసిన నా స్వామి' యని - త్రివిక్రమ మూర్తిని కీర్తించిరి. ఇట్లే - 'తిరుప్పావై' దివ్య ప్రబంధములో - గోదాదేవి - 'ఓంగి ఉలగళన్ద ఉత్తమన్ పేర్ పాడి' ఇత్యాదిగా - త్రివిక్రమ వైభవమును ప్రస్తుతించినవి. అట్లే, నాచ్చియార్ తిరుమొళిలో కూడ - 'కొండకోల కుఱళురువాయ్ చెన్రు' ఇత్యాది పాశురములో - త్రివిక్రమ వైభవమును కీర్తించుచున్నది. అదియునుగాక, ఇట్లు ముల్లోకములను కొలిచిన వామనమూర్తియైన స్వామి యొక్క శ్రీపాదమును గోదాదేవి - 'అన్రి వ్వులగ మళన్దా యడిపోత్తి' అని - మంగళాశాసనము చేసెను.

వేద ప్రసిద్ధమైన త్రివిక్రమ - వామనావతార ప్రశంస - ఆది కావ్యమైన శ్రీమద్రామాయణములో నున్నది. బాలకాండలో - సిద్ధాశ్రమ వర్ణన సందర్భమున విశ్వామిత్రుడు - వామనావతార ప్రసక్తి చేసెను.

"అథ విష్ణుః మహాతేజా అదిత్యాం సమజాయత
వామనం రూప మాస్థాయ - వైరోచన ముపాగమత్."

మత్స్య - కూర్మ - వరాహ - నారసింహావతారములకంటెను విలక్షణమైనది వామనావతారము. మిగిలిన పూర్వావతారములలో -

భగవానుడు - గర్భవాస సంబంధము లేకనే - స్వేచ్ఛా పరిగృహీత దేహుడై ఆవిర్భవించినాడు. మిగిలిన అవతారములలో - తన ఆవిర్భావమునకు కారణముగా - జననీ జనకులుగా - ఎవరిని పరిగ్రహింపలేదు. ఈ వామనావతారమునుండి ప్రారంభించి, శేషించిన అవతారములందును - తనకు మాతా పితరులుగా పుణ్య పరిపాకము గల కొందరిని భగవానుడు ఎన్నికచేసి, వారిని తరింపజేసెను.

వామనావతారమున - అదితి కశ్యపులను తల్లి దండ్రులుగా భావించి, అదితి గర్భములో - తన పదునారవ యంశతో స్వామి నివసించెను. ఈ యంశము - వామన పురాణములో -

"స్వాంశేన చైవ తే గర్భే సంభవిష్యామి కశ్యపాత్."
దైత్యానా మపిసర్వేషాం గర్భస్థే మధుసూదనే
సదదర్శోదరే తస్యాః ప్రహ్లాదో వా కునాకృతిమ్
క్రమేణైవ హరిర్వృద్ధిం తేవ । ప్రాప్తో మహాయశాః"

"తతో మాసేతు దశమే కాలే ప్రసవ ఆగతే
అజాయత స గోవిందో - భగవాన్ వామనాకృతిః."

— (వామన పురాణము ; 8 అం)

అదితి గర్భములో పది నెలలు నివాస మున్న స్వామి - తాను ఆవిర్భవించి, కపట వామన రూపముతో మహాబలి సభను చేరి, ఆత డొసంగిన మూడు అడుగుల దానమును స్వీకరించుటకు తన విశ్వ రూపమును ప్రదర్శించెనని - వామన పురాణ వక్కాణ. వామన పురాణములో వర్ణింపబడిన ఆ విశ్వ రూప వర్ణనము - అర్జునునకు కృష్ణుడు గీతోపదేశము చేయుచు, తాను చూపిన విశ్వరూపము

యొక్క వర్ణనవలె నున్నది. "అజాయమానో బహుధా విజాయతే" అను శ్రుతి వచనమును బట్టి, పుట్టుక లేని స్వామి - తాను స్వాశ్రిత దైన్య వినోదార్థముగా - గర్భవాస క్లేశమును సైతము సహించి జన్మించి, వికృతమైన వామన రూపముతో - తన పరత్వమును మరచి, హేయముగ మూడడుగుల బిచ్చమెత్తి, ఆ మూడడుగు లను రక్షించు భారమును వహించుట - తన త్రివిక్రమత్వ ప్రదర్శ నము ద్వారా ఇంద్రుని స్వారాజ్య ప్రతిష్ఠితుని గావించి, తాను ఉపేం ద్రుడుగా రక్షణ భారమును వహించుట - ఈ వామనావతారము నందలి సౌలభ్యమును ప్రకటించుచున్నది. అందువలన, ఆళ్వారులు ఈ త్రివిక్రమావతారమును విశేషముగా కీర్తించిరి.

శ్రీ విష్ణు పురాణములో - వామనావతారము మన్వంత రావతారముగ వర్ణింపబడినది. శ్రీమద్భాగవతము అష్టమ స్కంధ ములో - వామనావతార ఘట్టము మిగుల మనోజ్ఞముగ వర్ణింపబడి నది భగవానుడు తన త్రివిక్రమత్వమును దర్శింపజేయుటకై - విరాట్ స్వరూపముతో విశ్వాంతరాళములను వ్యాపించినపుడు - ఊర్ధ్వ లోకములో (సత్య లోకములో) పైకి ఎత్తబడియున్న స్వామియొక్క పాదమును - తన కమండలము నందలి జలముతో కడిగెను. ఆ జలము తోనే ఆకాశ గంగ ఆవిర్భవించినదని భాగవతము వివరించుచున్నది.

"ధాతుః కమండలు జలం త దురుక్రమస్య
పాదావనే జన పవిత్రతయా నరేంద్ర !
స్వర్ధు న్యభూ న్నభసి సా పతితే నిమార్ష్టి
లోక త్రయం భగవత్ విశ దేవ కీర్తిః."

ఈ రీతిగా ఆవిర్భవించిన అన్వర్థని - భగవానుని కీర్తింపవలె నని శ్రీమద్భాగవతము వర్ణించుచున్నది. ఇచట–వామనమూర్తియే త్రివిక్రమ మూర్తిగా, 'ఉరుక్రముడు'గా - కీర్తింపబడినాడు. శ్రీమ ద్రామాయణము నందలి బాలకాండ (29-19-28) - భగవానుని త్రివిక్రమత్వమును బహు భంగుల ప్రస్తుతించుచున్నది.

ఇక - ప్రస్తుత వ్యాసకర్త రచించిన నైకుంఠవాథ విలాసము నందలి వామనావతార వర్ణనము :-

"శశ్వల్లులిత పుండరీక నిలయా - శ్రీపాణిలీలాకల
క్రూరోద్వృత్తసురప్రదీప దనుజవ్రాతోత్సవో ద్భంజనః
లోకవ్రాత మహాభయావగ మనోదగ్రో ఒభయ శ్రీధర !
లోకేశస్య కరః కృపా పరికరః యాజ్ఞా విధేన్యంచతి"

నిరంతరము శ్రీదేవియొక్క పాణి పరామర్శముచేత మనోజ్ఞ మైనదియు, క్రూరులు, దుర్మార్గులు, దేవవిరోధులు నగు దైత్యుల యొక్క ఉద్యమమును భంగము గావించి, సమస్త లోకముల మహా భయమును దూరము చేయుటలో - అగ్రగామిగా నున్నది. నిరవధిక కృపయే పరికరముగా కలిగిన లోకేశుని కరము కూడ క్రిందయై యాచించుచున్న దనగా - అయ్యది - స్వామి యొక్క ఆశ్రిత వాత్స ల్యమునకు నిదర్శనము. స్వామి - తాను లోకమునకు తన త్రివిక్రమ త్వమును దర్శింపజేసెనని, శ్రుతులు, ఇతిహాసములు, పురాణములు, ఆళ్వారుల దివ్య ప్రబంధములు - వర్ణించియున్నను, వాస్తవమునకు- తన చతుర్విక్రమత్వమును స్వామి చూపెను. ఎట్లనగా - ఒక పాద మునన్ భూమిని, వేరొక పాదముతో అంతరిక్షమును, మూడవ

పాదముతో మహాబలి శిరస్సును - ఈవిధమైన స్వాశ్రిత జన స్వాంత ములో నాల్గవ పాదమును కూడ - స్వామి మోపి, తాను - త్రివి క్రము డని నిరూపించుకొనెను.

నా యీ భావనను - ఈ క్రింది శ్లోకములో దర్శింపవచ్చును :-

పాదేన ప్రథ మేన సర్వ ధరణిం, అన్యేన చాకాశమ
స్యాక్రమ్యాసురనాథమూర్ధ్ని నిహతః పాదఃతృతీయః పునః
కృత్వా పాద మనన్య భావ భరితే స్వాంతే తురీయః పునః
చాతుర్థ్యం నిజ విక్రమస్య తనుతే వైకుంఠనాద స్వహో !
— (వైకుంఠకలాపము)

## 6. పరశురామావతారము

ఈ యవతారము - ఆవేశావతారముగ పరిగణింపబడుచున్నది. అందువలన, ఈ యవతారమూర్తి - ఉపాస్యము కాదని, మన పురా ణేతిహాసములు, ఆగమ శాస్త్రములును వక్కాణించుచున్నవి. కను కనే, ఆళ్వారులు - తమ దివ్య ప్రబంధములలో - ఈ పరశురామ మూర్తి ని కీర్తి రచియుండలేదు.

"యః శ్చ పంచాశతి సహస్రోపలక్షణ కాలావసానే - భగవ న్నారాయణాం శేన పరశురామ ఉపసంహృతః. వర్ష సహస్రోపలక్షణ కాలావసానే - భగవన్నారా యణాంశేన పరశురామ సంజ్ఞం, భగవత స్సకల లోక గురోః నారాయణ స్యాంశం జమదగ్నిః రజీజనత్."

అని - విష్ణు పురాణము - కార్తవీర్యార్జున చరిత్ర ప్రసంగములో - నారాయణాంశ సంభవుడైన పరశురామునిచే సంహరింపబడెనని - ఒక తావున నిర్దేశింపబడినది. మఱియొక తావున -

"తస్యాం చ రేణుకాయా మశేష రామ సంజ్ఞం భగవత స్సకల లోక గురోః నారాయణ స్యాంశం జమదగ్ని రజోజనత్."

అని - నిర్దేశింపబడినది. విష్ణు పురాణ - ప్రథమ పాదమున, లక్ష్మీ స్తుతి సందర్భమున, లక్ష్మీదేవి యొక్క- అవతారములు వర్ణింపబడినవి.

"యదా చ భార్గవో రామః । తదాఽభూతే ధరణీ త్వియమ్."

భగవానుడు - తాను భార్గవ రామునిగా అవతరించినపుడు - లక్ష్మి - ధరణిగా అవతరించెనని చెప్పబడుటచేత, లక్ష్మీ సమేత ముగ భగవ దవతారము జరిగెననుట స్పష్టము. కావున, ఈ పరశు రామావతారము - ప్రాముఖ్యమును సంతరించుకొన్నది. శ్రీమద్భా గవతము కూడ - పరశురామ చరితమును వర్ణించినది. నవమ స్కంధ ములో -

"యదీయాన్ జజ్ఞ ఏతేషాం - రామ ఇ త్యభివిశ్రుతః
య మాహు ర్వాసుదేవాంశం - హైమయానాం కులాన్తకమ్."
— (శ్రీభాగవతము : 9-15-14/15)

ఈ యవతార లక్ష్యము కూడ - భూ భారమును తగ్గించు టయే. అయినచో - ఇచట - దుష్ట ప్రవృత్తి కల క్షత్రియులను ఇరు వదిరెండుమారులు నిశ్శేషముగ సంహరించి, భూమండలముపై సద్ధ ర్మమును స్థిరము చేయుటయే - అని వివరించినది.

"శ్రీః సప్త కృత్వో య ఇమాం చక్రేని క్షత్రియాం మహీమ్
దుష్టం క్షత్రం భువో భార మబ్రహ్మణ్య మనీనశత్."
(9-15-14|157)

"ఏవం భృగుషు విశ్వాత్మా - భగవాన్ హరి రీశ్వరః
అవతీర్య పరం భారం భువ్యహన్ బహుశో నృపాన్." (9-16-27)

అని - సంస్కృత సాహిత్యమునందును - ఈ పరశురామావతార మును వర్ణించిన కవిశేఖరు లనేకు లున్నారు. ఇక - వైష్ణవ సంప్ర దాయములో - పరశురామావతారమును వేదాంత దేశికులు తమ దశావతార స్తోత్రములో స్తుతించియున్నారు. మఱియు - దయాశత కమునందును - "పరశ్వధ తపోధన !" ఇత్యాదిగా - పరసురాముని స్తుతించిరి.

సుందరబాహు స్తవములో శ్రీవత్సాంకమిశ్రులు -

"భార్గవః కిల భవన్ - భవాన్
సున్దసున్దర ! వానాచలేశ్వర !
అర్జునస్య - బల దర్పితస్య తు
ఛ్ఛే త్స్యతి స్మరతి బాహుకాననమ్." "(99 శ్లో.)

మల్లెలచే సుందరమైన వనగిరి యందు నివసించెడి ఓ స్వామీ! పూర్వకాలమందు పరశురాముడవై, బలముచే గర్వించిన కార్తవీర్యా ర్జునుని చేతులను ఛేదించితివి. అది జ్ఞాపక మున్నదా ?" అని, పరశు రాముని ప్రస్తుతించియున్నారు.

ఇట్లు - ఈ పరశురామావతారము సైతము - ప్రాముఖ్యమును పొందియున్నది.

# 7. రామావతారము

భగవ దవతారములలో - రామావతారమునకు ఒక ప్రాముఖ్య మున్నది. తాను భగవ దవతారమె యైనను, ఆ యంశమును మఱచి మనలో నొకడుగా కలసిపోయి, మానవత్వమును వ్యక్తీకరించి, స్వాశ్రిత రక్షణలో-తన ప్రత్యేకతను ప్రదర్శించినది ఈ యవతార మందే. ఈ రామావతారమును సమగ్ర సుందరముగా, తనివితీర, తన మహా కావ్యములో కీర్తించిన ఆదికవి యైన వాల్మీకి మహర్షి - శాశ్వతమైన కీర్తిని పొందియున్న విషయము-జగ ద్విదితము. పద్మ-విష్ణు పురాణములతో ఆరంభించి, దాదాపు - అన్ని పురాణము లందును, భారతేదిహాసము నందును - వాల్మీకి నామధేయము, రామ చరితము - చోటు చేసికొన్నవి. ఆళ్వారులు - ఈ రామావతారమును ఒక ఆదర్శ మానవావతారముగ - తమ దివ్య ప్రబంధములలో వర్ణించియున్నారు. వాల్మీకి మహాముని - రాముని కేవలము మానవ మాత్రుడుగ కాగ, మహా విష్ణు స్వరూపముగనే సంభావించి, కీర్తించుచు - నిరూపించినాడు.

శ్రీమద్రామాయణము - బాలకాండలోని 15 వ సర్గ లో - దశరథ యజ్ఞ వర్ణన సందర్భమున-హవి ర్గ్రహణమునకు స్వయముగా వచ్చిన శ్రీ మహా విష్ణువు నుద్దేశించి బ్రహ్మాదులు - రావణ దౌష్ట్య మును నిరూపించి, రామావతారమై దశరథుని భార్యలును - తనను నాల్గు భాగములుగా చేసికొని, ఆవిర్భవింపవలసినదని ప్రార్థించిరి.

"విష్ణో ! పుత్రత్వ మాగచ్ఛ - కృత్వాత్మానం చతుర్విధమ్
తత్ర త్వం దైవతం విష్ణో ! సమరేజహి రావణమ్."

అని ప్రార్థింపబడిన శ్రీ మహా విష్ణువు - బ్రహ్మాదులకు అభయ మిచ్చి, క్రూర రావణుని సంహరించి, పదునొకండువేల సంవత్సరములు మనుష్య లోకములో - పృథివీ పాలనము చేయగలనని చెప్పెను.

బాలకాండ యందలి 18 - వ సర్గలో - రామావతార ఘట్ట మును - వాల్మీకి యిట్లు వర్ణించియున్నాడు :-

"కౌసల్యా జనయే ద్రామం - సర్వ లక్షణ సంయుతమ్
విష్ణో రర్ధం మహాభాగం - పుత్ర మైక్ష్వాకు వర్ధనమ్."

శ్రీమద్రామాయణానుసారము - విష్ణువు యొక్క అర్ధాంశతో ఆవిర్భవించిన శ్రీరామ చంద్రుని మాత్రమే దశావతారములలో చేర్చుట జరిగినది. కాని, లక్ష్మణ-భరత-శత్రుఘ్నులు కూడ విష్ణ్వంశతోడనే ఆవిర్భవించినట్లు - రామాయణము స్పష్టముగా పేర్కొన్నను, రాముడు ఒకడు మాత్రమే అవతారముగా గుర్తింప బడుటకు కారణము - సీతగా ఆవిర్భవించిన లక్ష్మి యొక్క పాణి గ్రహణము చేసి, ధర్మరక్షణ బాధ్యతను తానే స్వీకరించుట వలననే, బాల రామాయణము - ఎవరికిని వేయబడని రక్షకత్వ విశేషమును కేవలము - రామునకు మాత్రమే వేసియున్నది.

"రక్షిత స్స్వస్య ధర్మశ్చ - ధర్మ శ్చ పరిరక్షితః
రక్షిత స్సర్వ ధర్మ శ్చ - లోకస్య పరిరక్షితః."

అని, ముందు నుండి, చివరి వఱకును - శ్రీరాముని మాత్రమే విష్ణ్వ వతారముగా పరిగణించుట జరిగినది. పరశురామునిచే ఈయబడిన వైష్ణవ ధనుస్సును ఎక్కు పెట్టిన పిమ్మట -

"అక్షయం మధుహన్తారం - జానామి త్వాం సురోత్తమమ్
ధనుష్యోఽస్య పరం కుర్యాత్ । స్వస్తి తేఽస్తు పరంతప !"

అరణ్య కాండలో - శరభంగ మహర్షి దర్శన సందర్భమున - ఆశ్రమమునకు వచ్చిన రాముడు - దేవేంద్రుని గుర్తించుట, దేవేంద్రుడు రాముని చూచి, అహంకార పురుషునిగా నిశ్చయించి -

"జితవన్తం కృతార్థం చ ద్రష్టాఽహ మచిరా దిమమ్
కర్మ హ్యనేన కర్తవ్యం మహ దన్యైః స్సుదుష్కరమ్."

అచిరకాలముననే నేను - విజయుడై, కార్యమును సాధించిన రాముని చూచెదను. ఇతరులకు సాధ్యము కాని గొప్ప కార్యమును నిర్వహించవలసియున్నాడు" - అనుటనుబట్టియు - అవతార లక్ష్యము స్పష్టపరుప బడుచున్నది. ఇట్లే - తపోనిష్ఠులైన మహర్షులు స్వయముగా రామునితో -

"తత స్త్వాం శరణార్థం చ శరణ్యం సముపస్థితాః
పరిపాలయ నో రామం - వధ్యమానా న్నిశాచరైః."

రామా ! రక్షకుడ వగు నిన్ను శరణు కోరి వచ్చియున్నాము. రాక్షసులచే బాధింపబడుచున్న మమ్ములను రక్షింపుము.' అనుటను బట్టియు రాముని అవతార రహస్యము - స్పష్టమగుచున్నదిగదా !

బాలకాండ ఆరంభముననే విశ్వామిత్రుడు - 'అహం వేద్మి మహాత్మానం' నీవు మహాత్ముడవు వని నే నెఱుగుదును' - అని అనుట చేతనే - రాముడు భగవ దవతార మను రహస్యము వ్యక్తమం

కాగా, ఇచట - తాపసు లెల్ల లు ఏక కంఠముగా - శరణాగతి చేయు టయు - అవతార రహస్యమును స్పష్టము గావించుచున్నది.

రామాయణములో - రామావతార రహస్యము నెఱింగినవారు కొంద ఱున్నారు. అట్టివారిలో - 'మందోదరి' ప్రథమురాలు. యుద్ధ కాండలో శ్రీరామచంద్రుడు సాక్షాత్తుగా - శ్రీమన్నారాయణుడే యని - గుర్తించిన దీమెయే.

ఆమె ఇట్లనును :-

"వ్యక్త మేష మహా యోగీ - పరమాత్మా సనాతనః
అనాది మధ్య నిధనో - మహతః పరమో మహాన్

తమసః పరమో ధాతా - శంఖ చక్ర గదాధరః
శ్రీవత్స వక్షా నిత్యశ్రీ రజయ్యః శాశ్వతో ధృవః

మానుషం వపు రాస్థాయ - విష్ణుః సత్యపరాక్రమః
సర్వైః పరివృతో దేవైః - వానరత్వ ముపాగతైః

సర్వ లోకేశ్వర స్సాక్షాత్ - లోకానాం హిత కామ్యయా
స రాక్షస పరీవారం హతవాం స్త్వాం మహాద్యుతిః."

— (వా. రా. యుద్ధ కాండ : 114 - స. శ్లో. 14-17)

స్పష్టముగా - ఈ మహానుభావుడు - మహాయోగియైన - సనాతన పరమాత్ముడే. ఆది మధ్యాంతములు లేక, మహత్తు కంటెను పరమ మహాత్ముడై, ('మహతో మహీయాన్' అని శ్రుతి పలికినట్లు, తమో గుణమునకు అతీతమైన నిఖిల జగద్ధాత, శంఖ చక్ర గదాధారి, శ్రీవత్స లాంఛనుడు, నిరంతర లక్ష్మీ సనాథుడు, శాశ్వతుడు, స్థిరుడు - అయిన శ్రీ మహా విష్ణువే. మనుష్య రూపమును ధరించి,

సత్య పరాక్రముడై, వానర రూపములను ధరించిన దేవతలతో పరివృతుడై, సాక్షాత్తు - సర్వ లోకేశ్వరుడు లోక హితమును కోరి, రాక్షస పరివార సహితము - నిన్ను సంహరించినాడు' అని - మందోదరి - పల్కిన పలుకులు - రామావతార రహస్యమును స్పష్టీకరించుచున్నవి. ఇంతటి స్పష్టముగ - రామావతార రహస్యమును ఎఱింగినవారుగాని, ఎఱిగి చెప్పినవారుగాని - రామాయణములో లేకుండుట - కడుంగడు ఆశ్చర్యకరమైన విషయము. ఇంచుమించుగా - అందఱు - రాముని ధర్మనిష్ఠను, సత్యపరాక్రమత్వమును - భావించి, ఒక మహామహునిగా ఆరాధించిరేగాని, అవతార తత్త్వమును ఆవిష్కరింపలేదు. 'తార' కూడ -

" నివాస వృక్షః సాధూనామ్ "

అని - రాముని కల్యాణ గుణములను మాత్రమే కీర్తించెనుగాని, పరతత్త్వమును మాత్రము కాదు. ఇక, యుద్ధకాండ చివరలో - సీత - అగ్ని ప్రవేశము చేయు సందర్భమున - బ్రహ్మ - శ్రీరాముని పరతత్త్వ ప్రాశస్త్యమును ఇట్లు కీర్తించెను :-

"కర్తా సర్వస్య లోకస్య - శ్రేష్ఠో జ్ఞానవతాం వరః
ఉపేక్షసే కథం సీతాం - పతన్తం హవ్యవాహనే
కథం దేవగణశ్రేష్ఠ మాత్మానం నావబుధ్యసే
ఋతధామా వసుః పూర్వం - వసూనాం త్వం ప్రజాపతిః
త్రయాణాం త్వం హి లోకానా మాదికర్తా స్వయం ప్రభుః
రుద్రాణా మష్టమో రుద్రః - సాధ్యానా మపి పంచమః
అశ్వినే చాపి తౌకర్ణే - చంద్రసూర్యౌ చ చక్షుషే
అన్తేఒవతారే లోకానాం - దృశ్యసే త్వం పరంతప !"

సమస్త లోకములకు కర్తవు, జ్ఞాన శ్రేష్ఠుడవు - అయిన నీవు – సీత అగ్నిలో పడుచుండగా – ఉపేక్షించుచున్నావే ! నీవు దేవతా గణములో - సర్వ శ్రేష్ఠుడ వని తెలియకున్నావు. నీవు - వసువు లందఱకును ప్రజాపతివైన ఋతధాముడవు, వసుడవు. మూడు లోక ములకును ఆది కర్తవు సాధ్యులలో - ఐదవ వానివి. అశ్వినులు - నీ చెవులు. సూర్య చంద్రులు - నీ నేత్రములు. సమస్త లోకముల ఆద్యంతములందును నీవే కానవచ్చుచున్నావు' - అని యిట్లు స్తుతిం చుటకు ఆరంభించగా, అపుడు రాముడు తాను - తన పరతత్త్వమును ఎఱుగనట్లు, తాను కేవలము మనుష్యమాత్రునిగా, దశరథ పుత్రు నిగా భావించుచున్నట్లు చెప్పి, తన తత్త్వమును ఎఱుకపఱచు మనుసు. అపుడు మఱల బ్రహ్మ –

"భవాన్ నారాయణో దేవః - శ్రీమాన్ చక్రాయుధో విభుః
ఏకశృంగో వరాహ స్త్వం - భూత భవ్య సపత్నజిత్
అక్షరం బ్రహ్మసత్యం చ - మధ్యేచాంతే చ రాఘవ !
లోకానాం త్వం పరోధర్మో - విష్వక్సేన శ్చతుర్భుజః."

అని యారంభించి, వరాహావతార - త్రివిక్రమావతారముల ప్రసక్తి చేసి, విరాట్ స్వరూపముగా రాముని నిరూపించిరి, చివఱకు -

"సీతా లక్ష్మీః – భవాన్ విష్ణుః, దేవః, కృష్ణః, ప్రజాపతిః
వధార్థం రావణ స్యేవం ప్రవిష్టో మానుషీం తనూమ్."

నీవు సాక్షాత్తు - శ్రీ మహావిష్ణుడవు రావణ వధార్థమై మనుష్య దేహమును ధరించితివి' - అని యిట్లు బ్రహ్మ పలికిన

పల్కులు – ఈ రామావతార రహస్యమును స్పష్టము గావించు చున్నవికదా !

ఇట్లే సుతీక్ష్ణుని ఆశ్రమములో - మునిని దర్శించుటకు వచ్చిన దేవేంద్రుని గుర్తింపగల సామర్థ్యముకూడ రాముని అతిమానుష లక్షణమునే స్పష్టము చేయుచున్నది. వీని యన్నింటి కంటెను ముఖ్యముగా - ఉత్తర కాండలో సీత – ధరణీ ప్రవేశము గావించిన తరువాత, రాముడు క్రోధావిష్టుడై, మహీతలము నంతటిని – తన శస్త్రముతో నశింపజేయబూనుట, బ్రహ్మాదులు అడ్డు వచ్చి ఆపుటయు – రాముని అతి మానుష లక్షణమును నిరూపించుచున్నది. స్వయముగా రాముడు చతుర్ముఖ బ్రహ్మతో -

"త్రయాణా మపి లోకానాం - కార్యార్థం మమ సంభవమ్
భద్రం తేఽస్తు - గమిష్యామి – యతేవాహ మాగతః."

ముల్లోకముల రక్షణ కార్యార్థమై నేను ఆవిర్భవించితిని. నే నెచటినుండి వచ్చితినో, అచటికే పోగలను' అని పలికిన పలుకుల వలన, తాను లోక రక్షణార్థము అవతరించితి నను విషయము – రామునకు తెలియు నని స్పష్ట మగుచున్నది.

ఈ సందర్భములో - బ్రహ్మ కూడ - మధుకైటభు లనువారి వృత్తాంతమును ఎఱుక పఱచి, తాను - నాభికమల సముద్భవుడ నను విషయము - తనపై శ్రీమన్నారాయణుడు సృష్టి భారము నుంచిన విషయమును చెప్పి,

"సంక్షిప్య హి పురా లోకాన్ - మాయయా స్వయ మేవ హి
మహార్ణవే శయానోఽప్సుమంత్వం పూర్వ మజీజనః."

అని, అవతార రహస్యమును వెల్లడిచేయుట జరిగినది.

106 వ-సర్గలో - రామ పరిత్యక్తుడైన లక్ష్మణుని - విష్ణువు యొక్క చతుర్థ భాగముగా-సమ్మానించి, సశరీరముగా స్వర్గలోకమునకు వచ్చిన లక్ష్మణుని దేవర్షులు పూజించుటయు రాముడు మహాప్రస్థానము చేయుచున్నప్పుడు - ఇరుపార్శ్వము లందును శ్రీ భూదేవులు పరివేష్టించి యుండుటయు, రాముడు తన వైష్ణవ తేజముతో ప్రవేశించుటయు - రామావతార తత్త్వమును అభివ్యక్తముగావించుచున్నవి.

"వివేశ వైష్ణవం తేజః - సశరీర స్సహానుజః
తతో విష్ణుమయం దేవం - పూజయన్తి స్మ దేవతాః"

— (ఉత్తర కాండ : 110 - శ్లో. 18.)

రామావతార ప్రయోజనమును, రాముడు అవతార పురుషుడే యనియు - పురాణములు, ఉద్ఘోషించుచున్నవి.

అయినచో - రామ తత్త్వమును వాల్మీకిరామాయణము అందించినంతగా, మధురముగా, ఇతర గ్రంథములు ఏవియు అందింపలేకపోవుటవలన, శ్రీమద్రామాయణమే తత్త్వభావనాపరులైన తత్త్వవేత్తలకు ఏకైకాశ్రయ మైనది.

**శ్రీమద్రామాయణము - శ్రీవైష్ణవ సంప్రదాయము :-**

శ్రీమద్రామాయణ మహా కావ్యమును, శ్రీరామ చరిత మును సమాశ్రయించినట్టియు, సమాదరించినట్టియు సంప్రదాయము లనేకములు వెలసినను, శ్రీవైష్ణవ సంప్రదాయము చూపినంతగా - రామ తత్త్వమునుగాని, ఆ తత్త్వమును నిరూపించు రామాయణ మునుగాని - పరమప్రమాణముగా, తత్త్వ దృష్టితో సంభావించిన వేరొక సంప్రదాయము లేదు.

శ్రీవైష్ణవ సంప్రదాయములో శ్రీమద్రామాయణము ప్రపత్తి శాస్త్రముగా పరిగణింపబడుచున్నది. శ్రీమద్రామాయణము వేదావతార మని - వేదవేద్యే పరే పుంసి ఇత్యాది శ్లోకము ప్రతిపాదింపగా, దానిని అక్షరశః అన్వయించినవారు ఆళ్వారులే. వారి యనుభవములో శ్రీమద్రామాయణము - సకల వేద సారము. శ్రీ రామచంద్రుడు - జగద్రక్షకుడైన శ్రీమన్నారాయణుడే. ఆళ్వారులు ఈ యనుభవమును ఆధారము గావించుకొనియే శ్రీమద్రామాయణము అష్టాక్షర - ద్వయ మంత్రములకు నిదర్శనమని - సంప్రదాయాభిజ్ఞులైన వైష్ణవ ప్రముఖుల అభిప్రాయము.[1] కావున, అట్టి శ్రీవైష్ణవ సంప్రదాయమునందు - ప్రసిద్ధులును, మహాభక్తులును అగు ఆళ్వారుల భావ పరంపరలను ఇట మొదట పరిశీలింతము .-

---

(1) ప్రముఖ వైష్ణవ పండితు లగు శ్రీమాన్ గోపాలాచార్యస్వామివారి - 'రామాయణ రత్నాకరము' లో - 40 పుట మొదలు, 54 పుట వఱకు గల యంశములు - పరిశీలనీయములు.

అందమైన లంకాపురిని భస్మము గావించిన దివ్య జ్యోతియే రాము డనియు, [2] శ్రీరామచంద్రుడు శేషశయనుడైన శ్రియఃపతియే యనియు [3] - నమ్మాళ్వారులు భావింపగా, లంకను దహించివేసిన దేవుడే రాముడు [4] - అని - తొండరడిప్పొడియాళ్వారులును, ఖర దూషణాది క్రూర రాక్షసులను సంహారించిన మహనీయుడే శ్రీరాము డనియు, [5] నలుచదరముగా - మహా ప్రాకారములతో కూడిన నగరమునకు రాజగు రావణుని పట్టుపెత్తించి, ఆతని పదిశిరస్సులను తాటిపండ్లవలె రాలునట్లు - తీవ్రమైన ఒక బాణమును వదలినవాడైన సముద్రము వంటి నీలవర్ణు' డనియు, అతడే రంగనాథు' [6] డని-తిరుప్పాణాళ్వారులును, హింసా స్వభావము గల రాక్షసి యొక్క ముక్కు, కోయించిన దశరథరాజు కుమారుని వార్త అసత్యమైనచో - నేను జన్మించుట అసత్యమే [7] అనియు, సీతాదేవిని తీసుకొని వచ్చుటకు గాను - సేతువును నిర్మించి, రాక్షసకులమును మొత్తమును మట్టుపెట్టి, లంకను యుద్ధమయముగా చేసిన వీరుడా ! మమ్ము బాధింపకుము' [8] అని గోదాదేవియు - శ్రీరాముని కీర్తించియున్నారు.

వైష్ణవాచార్యులెందఱో - వారి వారి స్తోత్రములలో - రామావతారమును బహు భంగులుగా వర్ణించియున్నారు. రామావ

---

(2) திருவாய்மொழி . 2-9-10.

(3) திருவாய்மொழி : 2-5-7.

(4) திருமால.

(5) அமலனாதி பிரான் :

(6) அமலனாதி பிரான் :

(7) நாச்சியார் திருமொழி :

(8) நாச்சியார் திருமொழி :

తారములో విశేషముగా కీర్తింపబడిన గుణములు - శరణాగతివత్సలత్వము, కృపాళుత్వమున్నూ. తన పత్ని పట్ల అకృత్యము గావించిన వాయసమును దయతో క్షమించిన శ్రీరాముని కృపా విశేషమును - 'అతి మానుష స్తవములో శ్రీవత్సాంకమిశ్రులును, స్తోత్ర రత్నములో యామునాచార్యులును, రఘువీర గద్యలో వేదాంత దేశికులును - ఇట్లే మఱి కొందఱు వైష్ణవాచార్యులును - తమ తమ గ్రంథములలో - రాముని కల్యాణ గుణములను బహుధా స్తుతించియున్నారు.

**రామావతారము - సామాజిక ఆదర్శము :-**

భగవానుడు ఎన్ని అవతారములు ధరించి, దుష్ట నిగ్రహము, శిష్టపరిగ్రహము చేసినను - సార్వకాలికము, సార్వజనీనము అయిన ధర్మమును ఆచరణ ద్వారా చూపి, సమాజమునకు మార్గదర్శక మగుట ద్వారా - హృదయ సన్నిహితమైన అవతారము - శ్రీరామావతారము.

"రామో విగ్రహవాన్ ధర్మః"

రాముడు మూర్తీభవించిన ధర్మ మని కీర్తింపబడిన మహానుభావుడు. తండ్రిమాటను జవదాటలేని ధర్మనిష్ఠ, భ్రాతృప్రీతి, పత్నీ ప్రణయములోని స్నేహ భావన, సౌశీల్యము, ఎన్నికష్టములు కల్గినను - అనిన మాటను నిలబెట్టుకొనవలెనను అభినివేశము, సజ్జన సాంగత్యముపట్ల నిర్వ్యాజమైన ఆదరము, దుష్ట నిగ్రహముపట్ల ఆగ్రహము, ధర్మము కొఱకు - అయినవారినైనను, సన్నిహితులనైనను

త్యజింపగల హృదయ దార్ఢ్యము, అప్రతిహతమైన ప్రతాపము, మీదుమిక్కిలి - శరణాగత పరిత్రాణ దీక్ష - ఇత్యాది అసంఖ్యాకము లైన గుణములు మూర్తీభవించిన అవతార మగుటచేతనే శ్రీరాముడు - మర్యాదా పురుషోత్తముడుగా జనుల హృదయము లలో స్థిరముద్ర వేసికొన్నాడు.

"ఆత్మానం మానుషం మన్యే - రామం దశరథాత్మజమ్."

దశరథుని సుతుఁడనగు రాముఁడనని - నన్ను నేను తలంచు చున్నాను' - అను మాటనుబట్టి, తనను తాను మానవునిగనే భావించువాడును, ఉత్తమ ధర్మములకు ఆలవాలమైన మనుష్య సత్తమునిగా, ఆదర్శ పురుషునిగా ఆదరించి కీర్తించుటయు - సర్వాను భవసిద్ధమే తాను మానవునిగా - తన కాలమునాటి సమాజమున జీవించి, తన జీవితము మానవజన్మ నైజమైన సుఖ దుఃఖములకు, క్లేశములకు ఆస్పదము చేసికొని, నిఖిల లోకవంద్యుడై న పరాత్పరుడు, శ్రీమన్నారాయణుడు అయిన తానే, గుణములచేతను, ప్రభావము చేతను - తనకంటె తక్కువవారును, తనను ఆశ్రయింపవలసి వచ్చిన వారును, అయిన వారిలో తన అభిమానుమత్వ లక్షణమును - లోకమునకు చాటుకున్నాడు. దీనినే ప్రస్తుత వ్యాస కర్త - తన వైకుంఠనాథ విలాసములో -

"అగ్రదక్ష దీక్షా పరి కలిత రక్షోఽఖిల విభుః
సమస్త బ్రహ్మాండ ప్రచయ నతతా నన్య శరణః
శరణ్యం సుగ్రీవం స్వయ ముపగతః కాల మవశః
మనుష్యత్వే హ్యార్తి ద్విదశయతి సర్వేశ్వర మిహ."

'జగ ద్రక్షణ' మను దీక్షతో - నడుము కట్టుకొనిన లోక నాథుడు - నిఖిల బ్రహ్మాండములకు నిరంతరము - ఏక శరణ్యుడు - అయిన శ్రీమన్నారాయణుడే, తాను మనుష్య దేహమును స్వీకరించి నంత మాత్రముచేతనే, సుగ్రీవుడు స్వయముగా శరణు జొచ్చినాడు గదా !

శక్తిభద్రుడు అను నొక కవిశేఖరుడు - 'ఆశ్చర్య చూడామణి' యను తన నాటకములో -

"యః స్వదైర్యం నిరాకార్షీ న్నిర్వికారం చ యానవే "

అని, సీతారాముల అతిమానుషత్వమును విలక్షణముగా నిర్వచించి నాఁడు.

**రామావతారములో - ఆధ్యాత్మిక సూత్రము :-**

రామావతార కథను ఒక మహా కావ్యముగా, రసబంధురమైన ఒకే వర్ణచిత్రముగా దర్శించి, అనువదింపగల సాహితీ ప్రియుల అవ గాహనము, అనుభవము - ఒకే తీరున నున్నచో, సంప్రదాయిక ధారానుగతమైన తాత్త్వికావగాహనాసరళి - వేరొక విధముగా నున్నది.

శ్రీవైష్ణవ సంప్రదాయములో - శ్రీమద్రామాయణము - దీర్ఘ శరణాగతి యనియు, ప్రపత్తి శాస్త్ర మనియు, అష్టాక్షరీ - ద్వయ - చరమశ్లోకములకు దర్పణ మనియు - ఇంతకు మున్నే ఇందు విన్నవించుట జరిగినది. పరమాత్మ అయిన శ్రీమన్నారాయణుడు - తాను మానవునిగా అవతరించి, మానవు లెల్లఆకును ఆచరణ

యోగ్యమైన సామాజిక ధర్మమును నిరూపించి. ఆదర్శప్రాయు డగుటయేగాక, తన ప్రవృత్తుల మూలమున, మానవాళికి ఒక పారమార్థిక తత్త్వమును కూడ దర్శింపజేయుచున్నాడని భావించుట కలదు. ఉదాహరణకు - రాక్షస సంహారమునకై బహు శ్రమ కోర్చి, సేతు బంధనము చేసి, రాక్షస సంహారము చేయుట అనునది - సర్వ మానవులు - బహువిధ దుఃఖసంకులమైన సంసార సాగరమును - శ్రమ కోర్చి దాటవలెనని, ప్రతిబోధించుటయే యని, శ్రీ వేదాన్త దేశికులు - తమ వరదరాజ పంచాశత్తులో - ఇట్లు ప్రబోధించినారు:-

"యేనాచల ప్రకృతినా రిపు సంక్షయార్థే
వారాం నిధిం వరద పూర్వ మలంఘయ స్తమ్
తం వీక్ష్య, సేతు మధునాఽపి శరీరవ స్తః
సర్వే షడూర్మి బహులం జలధిం తర న్తి."

సర్వ జగ ద్రక్షకత్వము పరమాత్మ యొక్క అసాధారణ స్వభావము. అయినచో - రక్షణ కొఱకు తనను అనన్య భావనతో ఆశ్రయించినవారికి - తన శరణ్యతను అనుగ్రహించుట - స్వామి యొక్క అసాధారణ ధర్మము. శ్రీమద్రామాయణములో - శ్రీరామచంద్రుడు -

"సకృ దేవ ప్రపన్నాయ - తవాస్మీతి చ యాచతే
అభయం సర్వభూతేభ్యో - దదా మ్యేత ద్వ్రతం మమ."

అనిన మాట - శ్రీరామ చరమశ్లోకముగ సుప్రసిద్ధమై, మనుష్య భావనను ఆశ్రయించిన దశయందును - తన పరమాత్మ దశయందును

సులభముగా అన్వయించుచున్నది. అనన్య భావనతో - తననే ఆశ్రయించిన ఋషులను, సుగ్రీవాదులను, విభీషణుని, చివరకు - తన ధర్మపత్నియైన సీతను, వారి వారి దుఃఖములను దూర దూరము చేయుట ద్వారా ఉద్ధరించుట – అనునది - అనన్యాశ్రయ బుద్ధి కల సర్వ చేతన వర్గమును సముద్ధరించి, మోక్షమును ప్రసాదించుటయే యని, సంప్రదాయకమైన తాత్త్విక భావన.

## 8. బలరామావతారము

ఈ బలరామావతారమును కృష్ణావతారముతో కలిపి, ఏక రూపముగా భావించుట కలదు. అయినచో - విష్ణుపురాణము –

"సా ద్వారకా సంప్రవిశ తత్రబాస్తే
స కేశవాంశో బలదేవ నామా."

అని, బలదేవుని - కేశవాంశముగా వర్ణించుచున్నది. ఇందువలన, ఈ బలరామావతారమును సాక్షాత్తు అంశావతారమా ? అంశాంశావతారమా ? అను సందర్భములో –

"హతేషు తేషు కంసేన శేషాఖ్యాంగ స్తతో మమ
అంశాంశేనోదరే తస్యా స్సప్తమ స్సంభవిష్యతి."

అని ఇత్యాదిగా - విష్ణు పురాణము - బలరామావతారమును భగవదంశముగా నిరూపించుచున్నది విష్ణు పురాణము. అయినను - విష్ణు పురాణ - భాగవత పురాణములు రెండును - కృష్ణావతారమున నొసంగినంత ప్రాధాన్యమును ఈయకుండుట – గమనింపదగిన

యంశము. కావున, బలరామావతారము - అంశాంశావతారమే యని స్పష్ట మగుచున్నది.

బలభద్రుడు విష్ణువు యొక్క అంశాంశ మన్నపుడు—విష్ణువు యొక్క అంశ మేది? అనునది ప్రశ్న. దానికి సమాధానము - విష్ణు పురాణములో లభించుచున్నది. ఎట్లనగా :—

విష్ణు పురాణములో - ద్వితీయాంశమునందలి పంచమాధ్యాయములో - పాతాళ వర్ణన చేయుచు, పాతాళములో భగవానుడు - తన తామస మూర్తి యగు 'శేష' రూపమును ధరించి, తన సహస్ర ఫణములపై ఈ బ్రహ్మాండము నంతటిని మోయుచు, చిట్టచివరకు - తన నోటి నుండి ఆవిర్భవించిన సంకర్షణ రూపు డగు రుద్రుని ద్వారా, సమస్త బ్రహ్మాండమును దహించి, ప్రళయ కారకు డగునని చెప్పబడినది.

ఇచట వర్ణింపబడిన లాంగల ముసల ధారి మదిరా మదము చేత, ఎఱ్ఱబడి తిరుగుచున్న కన్నులు కలవాడును, నీలాంబర ధారియు నగు అనంతమూర్తి విష్ణ్వంశమై, బలభద్రావతారముగ ఆవిర్భవించెను.

శ్రీ విష్ణు పురాణము భగవ దవతారములలో బలరామావతారమును పరిగణింపగా, శ్రీ భాగవత ప్రథమ స్కంధము - ద్వితీయాధ్యాయములో నిర్దేశింపబడిన - అవతారములలో, రామ-కృష్ణావతారములు రెండును - 19, 20 అవతారములుగా పరిగణింపబడినవి.

"ఏకోనవింశే వింశతిమే – వృష్ణిషు ప్రాప్య జన్మనీ
రామకృష్ణా వితి భువో – భగవాన్ అహరద్భరమ్." — (1-2-23)

విష్ణుపురాణములో వర్ణింపబడిన సంకర్షణ రూపుడైన బలభద్రుని రూపము – ఈ విధముగా నున్నది :–

"పాతాలానా మధశ్చాస్తే – విష్ణో ర్యా తామసీ తనుః
శేషాఖ్యా యద్గుణాన్ వక్తుం న శక్తా దైత్య దానవాః
స దాఘూర్ణి నేత్రోఽసౌ – య స్సదైవైక కుండలః
కిరీటీ స్రగ్ ధరో భాతి – సాగ్నిః శ్వేత ఇవాచలః
నీలవాసా మదోద్రిక్తః – శ్వేతహారోపశోభితః
లాంగలాసక్త హస్తాగ్రో – బిభ్రన్ ముసల ముత్తమమ్
కల్పాంతే యస్య వక్త్రేభ్యో – విషానల శిఖోజ్జ్వలః
సంకర్షణాత్మకో రుద్రో – నిష్క్రమ్యాత్తి జగత్త్రయమ్
స బిభ్ర చ్ఛేఖరీభూత మశేషం క్షితి మండలమ్
ఆస్తే పాతాల మూలస్థః శేషోఽశేష సురార్చితః," అని.

ఈ శేషాఖ్య సంకర్షణ తత్త్వమే – దేవకీ గర్భములో – సప్తమ సంతానముగా ప్రవేశించి, భగవానునిచే ఆదేశింపబడిన యోగ మాయచే, దేవకీ గర్భము నుండి వెలికి దీయబడి, రోహిణీ గర్భములో ప్రవేశ పెట్టబడుటవలన, "గర్భ సంకర్షణాత్ సంకర్షణః" గర్భము నుండి వెలికి లాగబడుటను బట్టి, సంకర్షణ నామమును సమర్థించినను, వాసుదేవ నామమును పొందినట్లు భాగవతము నిర్దేశించుచున్నది. అయినచో – ఇచట – కథానుగతముగా – సంకర్షణ నామమును సమర్థించి నను, వాసుదేవ నామము వలె సంకర్షణ

నామము భగవ ద్వ్యూహ నిరూపక మే. "శేషాఖ్యం ధామమామకమ్" అని యనుటనుబట్టి, భగవ దంశమైన సంకర్షణ మూర్తిగా పాతాళమును అతిశయించియున్న మూర్తియే బలభద్ర రూపముగా ఆవిర్భవించెను కనుక, ఇది - అంశాంశావతార మని మనము గుర్తింప వలయును.

ఆళ్వారులు ఈ బలభద్ర మూర్తిని స్మరించినను, కృష్ణ తత్త్వ నిరూపణమందే ఇది చేర్చబడినది. వేదాంత దేశికులు కూడ ఈ బలదేవుని యవతారమును తమ దశావతార స్తోత్రములో వర్ణించుచు -

> "వక్ర- త్కారవ వట్టిణ ప్రభృతయః ప్రాస్త ప్రలంబాదయః
> తాలాంకస్య తథావిధా విహృతయ స్తన్వ స్తుభద్రాణి నః
> క్షీరం శర్కర యేవ యాభిర పృథగ్భూతాః ప్రభూతై ర్గుణైః
> ఆకౌమారక మస్వద స్త జగతే కృష్ణస్య తాః కేలయః."

పాలలో పంచదారవలె - కృష్ణలీలలలోనే ఈ బలరాముని లీలలును చేరిపోయినవి' - అని నిర్ధారించిరి.

శ్రీరంగరాజ స్తవము నందలి ఉత్తర శతకములో శ్రీ పరాశరభట్టరు ఈ బలరాముని వర్ణించుచు -

> "యద్భ్రూత్యే విజయాపదానగణనా కాళింగ దస్తాంకురైః
> య ద్విశ్లేషలవోఽపి కాళియమవే కోలాహలాయాభవత్
> దూత్యేనాపి చ యస్య గోపవనితాః కృష్ణాగసాంవ్యస్మరన్
> తం త్వాం క్షేమకృషీవలం హలధరం రంగేశ ! భక్తాస్మహే."(70 శ్లో.)

ఓ రంగేశా ! కళింగ రాజుతో జూదమాడుచు - జయ మంది, వాని దంతములను రాలగొట్టి, వానిచేతనే లెక్క బెట్టించితివి. నీవు క్షణముగూడ లేకపోవుటచేతనే - కాళియునివలన అట్టి కోలాహలము కలిగినది. నీవు చేసిన దూత్యముచేతనే గోపికలు - కృష్ణుడు చేసిన అపరాధములను మరచిరి. నీవు క్షేమమును పండించు కృషీవలుడవు. అట్టి హాల ధరుడ వగు బలరాముడవైన నిన్ను భక్తితో గొలుచు చున్నాము' - అని స్తుతించిరి.

స్తోత్రప్రాయ మగు ఈ వర్ణనలో - బలరాముని మూడు వ్యవహారములు వివరింపబడుచున్నవి. వానిలో మొదటిది - ప్రద్యు మ్నుడు రుక్మి పుత్రికను వివాహ మాడిన సమయములో - ద్యూతము ద్వారా బలరాముని జయించవలెనని ఇతర నృపు లన్నపుడు - రుక్మి దానికి అంగీకరించి, ద్యూతమున కాహ్వానించి, అపహసింపగా, కళింగరాజుయొక్క దంతములను బలభద్రుడు ఊడగొట్టెను. ఈ వృత్తాంతము - విష్ణుపురాణములోని 29 వ అధ్యాయములో ఉన్నది. ఈ యంశమును—పై శ్లోకములో - మొదటి పాదమున పరాశర భట్టారకులు నిర్దేశించిరి. రెండవది :- శేషుడు కాళియ రూపమును ధరించిన సందర్భములో - తాను భగవ త్సాన్నిధ్యము లేశమాత్రి ముగ కోలుపోయినపుడు - ఆ లేశమాత్రమైన భగవ ద్విశ్లేష మే - పెద్ద కోలాహలమునకు దారి తీసినది. ఈ ఘట్టమును రెండవ పాద ములో వర్ణించినారు. మూడవ పాదములో - గోప స్త్రీలను కృష్ణుని పక్షమున దౌత్యము జరిపి, ఊరట కలిగించినాడని నిర్దేశించిరి.

ఈ విధముగనే - బలరామావతారములో – ముష్టిక వధ, యమునాకర్ష ణము, ద్వివిధ వధ - మొదలైన అనేక లీలలను చేసి

నను, ప్రధానముగ - శ్రీకృష్ణ సాహాయ్యమే ఈ అవతార ప్రధాన లక్ష్యముగా కావచ్చును. కనుక నే, విష్ణు పురాణము - శ్రీకృష్ణావ తార లక్ష్యమును నిరూపించుచు -

"ఏవం దైత్యవధం కృష్ణో - బలదేవ సహాయవాన్
చక్రే దుష్ట క్షితీశానాం - తథైవ జగతః కృతే "

అని, అనుచున్నది. దీనినిబట్టి ఈ బలరామావతారము అంశాంశావ తార మనియు, శ్రీకృష్ణ సహాయ విధానమే దీని ప్రధాన లక్ష్య మనియు చెప్పుట సముచిత మగును.

శ్లో॥ యో దేవో ధృతశేషభావమహితో - నారాయణాంశో బలో
భూత్వా, విష్ణు సహాయతా ముపగతో - భూభార శంగో ద్యతః
ఆతామ్రాయత లోచనో ముసలగృ న్నీలాంబరో రేవతీ
జానిర్మాక్షిక ముఖ్య దుష్ట హనన స్సంకర్షణాఖ్యో జయేత్॥
— (వైకుంఠనాధ విలాసము)

## 9. శ్రీకృష్ణావతారము

భగవ దవతారములలో పూర్ణతమావతారముగా కీర్తింపబడి, సాక్షాత్తు - అవతార తత్త్వముగనే వర్ణింపబడినది - శ్రీకృష్ణావతా రము. శ్రీవైష్ణవ సంప్రదాయములో - ఈ కృష్ణ తత్త్వానుభవము నకు ఈయబడిన ప్రాధాన్యము - మఱి యే అవతారమునకు ఈయ లేదనుట స్పష్టము.

ఆళ్వారుల మధురానుభవమునకు, ఆస్పదమైనది - ఈ కృష్ణా వతారమే. శ్రీకృష్ణ తత్త్వము - అవతార తత్త్వమా ? అన్న యః

తారములకు మూలమైన అవతార తత్త్వమా ? - అను విషయ మున - పురాణములలో విభిన్నాభిప్రాయములు కానవచ్చుచున్నవి. విష్ణుపురాణము కృష్ణుని అవతారముగా, విష్ణ్వంశముగా - ప్రతిపా దించినవి [9] పంచమాంశములో మైత్రేయుడు -

"అంశావతారో బ్రహ్మర్షే ! యోఽయం యదుకులోద్భవః
విష్ణో స్తం విస్తరేణాహం - శ్రోతు మిచ్ఛామి తత్త్వతః"
— (వి పు : 5 : 1-2)

అని,

"చకార యాని కర్మాణి భగవాన్ పురుషోత్తమః
అంశాంశేనావతీర్యోర్వ్యాం - తత్ర తాని మునే ! వద"

అని అడిగినపుడు - శ్రీ పరాశర మహర్షి -

---

9 విష్ణు పురాణము - యదువంశ ప్రస్తావన చేయుచు, కృష్ణావతారమున గురించి ఇట్లు నిర్దేశించినది -

"యత్ర అశేషలోక నివాస మనుష్య, సిద్ధ, గంధర్వ దేవర్షిభి ముముక్షుభిః ధర్మార్థ కామ మోక్షార్థిభి శ్చ, తత్తత్ఫల లాభాయ సద అభిష్టుతః, అపరిచ్ఛేద్యమాహాత్మ్యాంశేన భగవాన్ అనాది నిధనో విష్ణ రవతతార"

(ఏ యదు వంశములో నయినచో) నిఖిల జగత్తులకు ఆశ్రయుడై మనుష్య, సిద్ధ, గంధర్వ, యక్ష, రాక్షస - దేవ ఋష్యాదులచేతను ధర్మ - అర్థ - కామ - మోక్ష పురుషార్థములు కావలెనని కోరబడుచు పరిచ్ఛిన్నము కాని - సర్వోత్కృష్ట మహిమ గల అంశముతో, ఆద్యంత రహితుడైన విష్ణుభగవానుడు అవతరించినాడు" ఆ యదువంశమున గురించి వివరింతును — (వి పు 4-11-21

"విష్ణో రంశాంశ సంభూతి చరితం జగతో హితమ్"

అని సమాధాన మిచ్చినాడు

ఇచ్చట ఒకసారి–"అంశావతారః" అనియు, మఱియొకసారి– "అంశాంశేన అవతీర్యతోర్వ్యాం" అనియు, 'విష్ణో రంశావచరితం' అనియు–అంశాంశావతారముగ చెప్పుట - విరుద్ధముగా కానవచ్చునను - మొదటిమాట - శ్రీకృష్ణ తత్త్వమునకు, రెండవది - బలదేవ తత్త్వమునకును సమన్వయింపవలసినదనియు - పెద్ద లందురు విష్ణు పురాణమునందును, త దితర గ్రంథములందును కూడ -

"సాంశో విష్ణుమయం స్థానం ప్రవివేశ మునే! నిజమ్" అని,

"అయం హి సర్వ లోకస్య - విష్ణోరఖిల జన్మనః
అవతీర్ణో మహీమంశో - నూనం భారాహరో భువః"

తన అంశతోపాటు - విష్ణు మయమైన తన స్థానమును ప్రవేశించెను' ఈయన - అఖిల జన్ముడు, సర్వలోకాత్మకుడును అయిన - విష్ణువు యొక్క - అంశము.

"ఏవం బహువిధై రూపై శ్చరా మీహ వసుంధరామ్
బ్రహ్మలోకం చ కౌంతేయ! గోలోకం చ సనాతనమ్"

పద్మపురాణము గోలోకమును మిగుల విస్తారముగ వర్ణించినది. రాధా తత్త్వమును గుఱించియు, స్పష్టముగ నిరూపించినది పద్మ పురాణము నందును, బ్రహ్మవైవర్త పురాణము నందును, దేవీ

భాగవతము నందును, బృహద్ధ్యామన పురాణము నందును - ఈ గోలోక ప్రశంసయు, రాధా విశిష్ట తత్త్వ ప్రశంసయు కలవు భగవద్రామానుజ సంప్రదాయమునకు పిమ్మట, వైష్ణవ సంప్రదాయములుగా ఉత్తర దేశమున ప్రసిద్ధి గాంచిన వల్లభ - నింబార్క - చైతన్య సంప్రదాయులు - శ్రీకృష్ణ తత్త్వము అవతార తత్త్వముగా - రాధా తత్త్వముతో కలిపి స్వీకరించియున్నవి

**ఆళ్వారులు అనుసరించిన కృష్ణ తత్త్వము -**

ఆళ్వారుల అనుభవములో కృష్ణుడు - అవతారియా ? అవతారమా ? అను విషయమును మనము సూక్ష్మ దృష్టితో పరిశీలించినచో - అవతారి - అవతార తత్త్వములకు వారు ఏమాత్రము భేదమును చూడలేదని మనకు స్పష్టమగును అన్ని అవతారములకంటెను - కృష్ణ తత్త్వానుభవమునకు ఆళ్వారులు విశిష్ట స్థానమును ఇచ్చినట్లు కానవచ్చును దివ్య ప్రబంధములలో - కృష్ణ తత్త్వమే ఇతర తత్త్వములకంటెను ప్రాముఖ్యమును పొందియుండుటను మనము స్పష్టముగా గుర్తింపవచ్చును శ్రీకృష్ణ తత్త్వములోని సౌలభ్యమును - తిరువాయి మొళిలో - నమ్మాళ్వారులు ఇట్లు కీర్తించిరి -

"పత్తుడై యడియవర్కెళియవన్ పిరర్ కళుక్కరియ
విత్తకన్ మలర్ పళికళ్విరుంబుమ్ నమరుమ్పెరులడికళ్
మత్తురు కడై వెణ్ణెయ్ కళవినిలురవిడై యాప్పుణ్డు
ఎత్తిరమురవినోడిణై న్దిరున్దేంగియ వెళివే" (1-8-1)

భక్తిమంతులైన వారలకు సులభుడు, ఇతరులకు దుర్లభుడు, ఆశ్చర్య కారకుడు, శ్రీ లక్ష్మీ దేవిచే ఆదరింపబడినవాడు, మనకు

దుర్లభుడైన స్వామి - కవ్వముతో - పెరుగును తీవ్రముగా మధించి నచో పుట్టిన వెన్నను దొంగిలించి, నడుమున కట్టబడెడివాడు, రోళ టితోపాటు కదలక, భీతితో నిలుచున్న స్వామి సౌలభ్య మెంతటిది" అని. ఇంతటి సౌలభ్యమును భావించు "విడవేనో వేన్విళక్కై మెన్నావియై" - నా దీపమును, నా ప్రాణమును ఎట్లు విడువగలను? రని యందురు ఒక్కొక్క చోట - నారాయణుని సంబోధించి, నీవు సమస్త వేదమయుడవు, కారణము, కర్మ, క్రియ - అనువానికి కారణము, నిత్యసూరులకు, సంసారులకు, అందఱకు - సమముగనే స్తుతి పాత్రుడై యుండి, కువలయాపీడ దంతమును విరచెనని - కృష్ణ లీలలను భావింతురు. ఇచట - నారాయణ తత్త్వమునకు, కృష్ణ తత్త్వమునకు తాదాత్మ్యమునే ఆళ్వారులు భావించిరి చాల తాళ లలో - కృష్ణుని సంబోధించి, వామనాది అవతార లీలలను-తత్వ ముగా వర్ణించుటయు కానవచ్చును కృష్ణావతార ప్రశంస చే నవుడు - ఉత్తర మధురై పిరన్ద మాయనే" ఉత్తర మధురలో - ఆవిర్భవించిన మాయావి అని సంబోధింతురు "అవతరించిన మాయా విగా - భారత యుద్ధములో - పోరుసల్పిన నీవు - సులభుడవై యున్నను, పంచ భూతములలో అంతర్యామిగా ఉన్నవాడవు పాలలో నెయ్యి వలె - ఈ సమస్త వస్తువులలో అంతర్గతముగా K సిన్ను - ఎట్లు సేవింపగలను ? అని యందురు.

"పిఱన్ద మాయం పాదకమ్ పొరుళ్" (8-5-11

అను పాశురములో - 'తాను స్వయముగా కృష్ణప్రేమోన్మాది యైన అంగనగా - తాదాత్మ్యమును పొంది, ఆమె చేత - ఉన్మా దశలో కూడ -

"ఎల్లా వులకు కణ్ణన్ పడై పెన్నుమ్"

సమస్త లోకములు - కృష్ణుని సృష్టియే అని యందురు

"కుడై దిల్ తరఙ్గడల్ కోళరవేఱ త్తన్ కోలత్తెన్నామరై క్కణ్
ఉడై వసన్పోలవోర్ యోగుపుణర్న్ద ఒళిమణివణ్ణన్ కణ్ణన్
కడైయణి యాక్కుడై వ్పళ్ళి క్కణ్డాని అసురరై క్కాలపున్ద నమ్మా
నిడై పుకళ్ త్తియుంపొన్దియుమ్ యానొరు ముట్టిలనె
— (తిరువాయిమొళి 8-10-

అపరిమితమైన సముద్రములో - బలిష్ఠమైన ఆదిశేషుని అధిరోహించి, తామర పూవులవంటి తన కన్నులను మూసికొ యోగ నిద్రను పొందినట్లు ప్రకాశించు నీలమణి వర్ణుడైన కృష్ణుడు ఎఱ్ఱని ముక్కు గల గరుత్మంతునిపై పయనించి, రాక్షస సంహార చేయగా, ఆ స్వామి పూర్ణ గుణములను, కీర్తిని గానము నర్తించిన నేను ఒక విఘ్నముకూడ పొందలేదు' అని - కృష్ణ సర్వావతారముగా - క్షీరాబ్ధిశాయిగా, నమ్మాళ్వారు మఱిక తావున వర్ణింతురు

ఆళ్వారుల కృష్ణ తత్త్వానుభవము సర్వతోముఖము. శ్రీకృ వలెనే ఇతర భగవదవతారములను కూడ దర్శించుట - ఈ తార సౌలభ్యములోని విశేషము. ఈ యవతారము - వారి హ యములలో హత్తుకొనినంతగా, మఱి యే యవతారము - హృదయములలో హత్తుకొనలేదన, అతిశయోక్తి కాదు. కృ లోనే రాముని, నృసింహుని, వామనుని, శేషశాయిని - ఇట్లు మూర్తులను దర్శించి, హృదయమును కృష్ణ మయముగా చేసిక

పరమ ప్రపన్నులు ఆళ్వారులు- వారి దృష్టిలో శ్రీకృష్ణుని మధు
మూర్తిగా- ('ఆరావముతమ్' తనివి తీరని అమృతము) స్వా
మూర్తిని ఎంతగా అనుభవించినను - తనివి తీరలేదు నమ్మాళ్వా
ఈ యంశమును తమ తిరువాయిమొళి దివ్య ప్రబంధములో ఇ
వర్ణించియున్నారు :-

"ఆరావముతమాయ్ అల్లావియుళ్ కలన్ద
కారార్ కరుముకిల్పోల్ ఎన్నమ్మాన్ కణ్ణనుక్కు
నేరావాయి శెమ్బవళమ్ కణ్ పాతమ్ కై కమలమ్
పేరారవేణ్మడినాణ్ పిన్ను మిహుళవలవే"

— (తిరువాయిమొళి 2-5

తృప్తి తీరని అమృతము వలె భోగ్యుడై, గుణహీనుడనైనను -
మనస్సులో కలిసియుండి, వర్ష కాలమున - నిండైన మబ్బును పో
నా స్వామి కన్నయ్య యొక్క పెదవితో - ఎర్రని పగడము సం
సము కాదు పొడవైన హారము, ఎత్తైన కిరీటము, కటి సూత్రమ
ఇట్లు ఎన్నియో ఆభరణములు నా స్వామికి ఉన్న'వని ఈ ర
మాధుర్యమును తనివితీర గ్రోలుచున్నారు శ్రీకృష్ణలీలానుభ
వీరికి అనుప్రాణనము.

ఇక ఈ నమ్మాళ్వారులకు - మోక్షముతో కూడ -
పురుషార్థములను శ్రీకృష్ణుడే అనుగ్రహించు ఏకైక దై
ఆయన కంటెను సర్వ రక్షకుడు వేరొకడు లేడు. చూడుడు :-

"తిణన్ వీడు ముతల్ ముత్త ముత్తరుమాయ్
ఎణ్ణిన్ మీతియ ఎమ్బెరుమాన్

మణ్ణుమ్ విణ్ణుమెల్లామ్ ఉపసున్దవమ్
కణ్ణన్ కల్లత్తమ ఇల్లైపూర్ కణ్డే" – (తిరువాయిమొళి : 2-2-1)

మోక్షము మొదలు - మొత్తము పురుషార్థములను అనుగ్రహించు వాడు, అసంఖ్యేయ కల్యాణ గుణములు గల మా స్వామి ఆకారము సమస్తమును - ఏక కాలమున క్రుంగ గల నా కన్నయ్యయే రక్షకుడు. అతని కంటెను వేరొక రక్షకుడు లేడు అనునది నిశ్చయము అని యందురు.

**ఆళ్వారుల నాయికానుభవము :-**

ఆళ్వారుల దివ్యప్రబంధములలో - శ్రీకృష్ణుని నాయికా భావించి, తద్విశ్లేషముచేత దుఃఖించి, ఉన్మాద దశను పొంద నాయికగను, శ్రీకృష్ణ సంశ్లేషముచేత ఆనందించు నాయికగను తమను తాము భావించుకొనుట - విశేషముగ కానవచ్చు. నమ్మాళ్వారులు అనుగ్రహించిన 'తిరువాయిమొళి'యందును, గోదేవి రచించిన 'తిరుప్పావై' 'నాచ్చియార్ తిరుమొళి' ప్రబంధము లందును, మఱి ఇతరత్రయును - అనుభవగోచరమై యున్నది. నమ్మాళ్వారులు నాయికగా విరహ వేదనను అనుభవింపగా, దా ఆ నాయిక యొక్క తల్లి -

"వల్లి శేర్ నుణ్ణిడై ఆయిర్చ్చియర్ తమ్మొడుమ్
కొల్లమై శెయిదు కురవై పిణైన్దవర్
నల్లడిమేలణి నాఱుతుళాయ్ యెన్నే
శొల్లుమాల్ శూశ్వినై యాట్టియేన్ పావైయే"
– (తిరు వాయి మొళి 4-

శ్రీకృష్ణావతారమున - గోపికలతో రాసక్రీడ సలిపిన స్వామి యొక్క శ్రీచరణ ధూళి అంటిన తులసీదే - విరహిణీయైన యీ యికకు విరహమును పోగొట్టు ఉపాయ' మని అనుచున్నది. ట్లనుటలో - సమ్మాళ్వారులకు గల శ్రీకృష్ణావతారానుభవము స్పష్ట మగుచున్నది

గోదాదేవి - తాను గోపీ భావముతో - కృష్ణుని భర్తగా పొందుటకు చేసిన నోమును, ఆమె నందగోకులమున ఒక గోపికగా పొందిన తాదాత్మ్యము - గమనింపదగియున్నది -

'వెళ్ళై నుణ్ మణల్ క్కొణ్డు తెరువణిన్దు వెళ్వరై ప్పతన్ మున్నన్దుఱై పడిన్దు
ముళ్ళు మిల్లా చ్చుళ్ళి యెరినుగుత్తు ముయన్ఱునిన్నే నోక్కిన్తేన్ కామదేవా !
కళ్ళవిళ్ వాయ్ పిళన్దానెన్ప దోరిలక్కి విళ్ళువన్నై మెయ్యె త్తిళియే"
- (నాచ్చియార్ తిరుమొళి 1-2-7)

ఓ కామదేవా ! తెల్లని - సన్నని ఇసుక తెచ్చి, వీథుల నలంకరించి, తెల్లవారకమున్నే - సరస్సులో జలక మాడి, దోషము లేని సమిధలతో - అగ్నియందు హోమము జేసి, పరిశుద్ధురాలనై, నీ యారాధనమందు ప్రయత్నముతో - ఆసక్తురాలనై యుందును. నా యీ యారాధనముచే ప్రసన్నుడవైన నీవు - మకరందము స్రవించు పుష్పములను ధనుస్సున నుంచి, సముద్ర వర్ణుడగు కృష్ణుని పేరును మనస్సులో నుంచుకొని, బకాసుర సంహారకు డగు భగవంతు డను లక్ష్యమునకు నన్ను వదలుము.

( ఆ శ్రీకృష్ణ భగవానునితో - నన్ను గూర్చుమని భావము )

వైష్ణవాచార్యుల స్తుతులలో - కృష్ణ తత్త్వము :-

వైష్ణవ లోకములో ప్రసిద్ధి గాంచిన ఆచార్యు లందఱును కృష్ణావతార వైశిష్ట్యమును విశేషముగ ప్రస్తుతించియున్నారు అట్టి వారిలో కూరత్తాళ్వారులు, పరాశర భట్టరులు, వేదాంత దేశికులు మున్నగువారు - ముఖ్యముగా పరిగణింపదగియున్నారు.

వేదాంత దేశికులు సంస్కృత భాషలో - కృష్ణావతార వైశిష్ట్యమును - 'యాదవాభ్యుదయ' మను పేర నొక మహాకావ్యమును రసవత్తరముగా - రచించిన విషయము - సర్వవిదితము.

కూరత్తాళ్వారులు తమ అతిమానుష స్తవములో -

"హా జన్మతాసు - నికతాసు - మయా న లబ్ధం
కాసే త్వయా విరహితాః కిల గోపకన్యాః
యా స్తావకీన పద పంక్తి జుషో జుషన్తో
నిష్పద్య తత్ర నిజమంగ మనంగ తప్తమ్ " (61 శ్లో॥)

అని - కృష్ణుని రాస క్రీడను భావించి, ఆ స్వామి క్రీడను భావించి, ఆ స్వామి క్రీడ సల్పిన ప్రదేశములోని ఇసుక రేణువులలో తమ జన్మ కలుగనందుల కెంతయో ఖేద మందిరి

ఆ స్వామియందు గల అచంచలమైన - నిరుపమానమైన భక్తి భావముతో - ఆ కృష్ణభగవానుని లీల లన్నింటిని - అత్యంత హృదయంగమముగా వర్ణించిరి.

ఇట్లే, కూరత్తాళ్వారులు - తమ సుందరబాహు స్తవము నందును, వరదరాజ స్తవము నందును - కృష్ణావతార సౌలభ్యమును బహుధా - కీర్తించియున్నారు.

ఇట్లే - పరాశర భట్టరులును - తమ శ్రీరంగరాజ స్తవములో - కృష్ణావతార వైభవమును లెస్సగా - వర్ణించియున్నారు. *

## చైతన్యసంప్రదాయములో - కృష్ణతత్త్వము

వైష్ణవ సంప్రదాయములోని ఒక భాగమై, వంగ దేశములో ఆవిర్భవించి, దేశములో - కృష్ణప్రేమను విస్తృతముగా ప్రచారము గావించిన ఘనత - చైతన్య సంప్రదాయమునకు లభించును ఈ సంప్రదాయమునకు చెందిన రూపగోస్వామి - మధురభక్తి సిద్ధాంతమును 'ఉజ్జ్వల నీలమణి' అను గ్రంథము ద్వారా - విశేషముగ ప్రచారములోనికి తెచ్చిరి రాధా మాధవుల మధుర ప్రణయమును ఈ సంప్రదాయము బాగుగా అనుభవగోచర మొనరించినది. ఈ రూప గోస్వామి రచించిన షట్ సందర్భములలోని - 'కృష్ణ సందర్భ గ్రంథము' - శ్రీకృష్ణుని సాధారణావతారముగ గాక, సాక్షాత్తు - గోలోక బృందావనవాసియైన పరమాత్మ తత్త్వముగా నిరూపించుచున్నది మాధుర్య కాదంబిని, భక్తిరసామృతసింధువు, నారద పంచరాత్రము, గోపాల చంపువు, గోవింద లీలామృతము -

---

* 'ముకుందమాల' అను - 40 శ్లోకములు గల తమ స్తోత్ర రచన ద్వారా - లోకమున కృష్ణ భక్తిని ప్రబోధించిన కుల శేఖరాళ్వారులు - మనకు అభివందనీయులు — సంపాదకుడు.

మున్నగు స్తోత్ర గ్రంథము లనేకములు - బృందావన చరు డ
శ్రీకృష్ణుని లీలా విలాసములను అనుభవముగను తీసికొని రాగల

## కృష్ణావతారములోని తాత్త్విక సూత్రము -

రామావతార చరితములో వలెనే - కృష్ణావతారకథయందును
తాత్త్విక సూత్రమును అన్వయించుకొనుట - ఆవశ్యకము అందుల
కృష్ణలీలలలోని తాత్త్విక రహస్యమును మన పూర్వులు నిర్ణయిం
యున్నారు ప్రతి లీల యందును - వెనుక - ఒక ఆధ్యాత్మిక రహ
స్యము ఇమిడి యున్నదని పెద్దల అనుభవము వాస్తవమున
కృష్ణుడు - మన హృదయమందే ఆవిర్భవింపవలెను. కృష్ణావిర్భా
ములో ముడివడిన కంసుడు, వసుదేవుడు, దేవకి, నందుడు, యశో
మాయ, బలరాముడు - మున్నగు పాత్ర లన్నియు - మనలో
మనః ప్రవృత్తులను, వానిలో గల వైరుధ్యములను - ప్రతీకములు
నుంచును ఉదాహరణమునకు - తాత్త్విక సూత్రమును మనః
ఈ రీతగా భావింపవచ్చును

భగవదావిర్భావ వృత్తాంతము - సంగ్రహముగా ఇట్లున్నది
మధురానగరమునకు నిజముగా - పరిపాలకుడు - ఉగ్రసేనమహారా
ఆతని కుమారుడు - కంసుడు అశరీర వాక్కు యొక్క ప్రేరణ
తన సోదరియైన దేవకిని చంపుటకు యత్నించి, బావయైన వసుదే
నిచే - సాంతనస్వరముగా - నివారింపబడినవాడు. తండ్రిని, దే
వసుదేవులను చెర బట్టి, తానే మధురను పాలించుచుండును. దే
వసుదేవులకు జన్మించిన కృష్ణుడు - మధుర నుండి నందవ్రజము

ఇచటనే పెరిగి తన లీలలచే వ్రజ వాసులను ఆనందింపజేయును నంద - యశోదలు - కృష్ణుని పెంచిన తల్లి దండ్రులు - అపుడే - కంస ప్రేరితుడైన పూతనాదులను సంహరించి, కంస ప్రేరణచే మథుర చేరి, కంసుని వధించును. అపుడు - దేవకీ వసుదేవులతో పాటు - ఉగ్రసేనునకు కూడ కారాగార విముక్తిని కలిగి, మథురా నగర పరిపాలకుడుగా ఉగ్రసేనుడు అధికారమును స్వీకరించును నాట నుండి – కృష్ణుడు – మథురా నివాసిగా – తన శత్రు సంహార కార్యక్రమమును కొనసాగించును ఈ అవతార సన్నివేశమును 'మనకు' అన్వయించుకొనవచ్చును. ఎట్లనగా –

(1) మథుర :- మధు = తియ్యగా ఉండు భోగమును, రాతి = స్వీకరించుచున్నది కనుక, భోగాస్పదమైన ఈ శరీరమే మథుర

(2) ఈ శరీరములోని బద్ధ జీవుడు - ఉగ్రసేనుడు,

(3) ఆతనికి సన్నిహితముగా నుండు బుద్ధి - వివేకములే దేవకీ వసుదేవులు.

(4) 'అశరీర వాక్కు' అనగా - శాస్త్ర వచనములు లేక - శ్రుతి వచనములు. విధి నిషేధ బోధకములు.

(5) సంకల్ప - వికల్పాత్మకమైన ఆలోచన - మనస్సు. ఇదియే - కంసలి = హింసలి, హింసించు లక్షణము కలది యగుట వలన, కంసుడు ఈ కంసునకు - అశరీర వాక్కులు (శాస్త్ర వచనములు) అహితములు.

(6) కంసుని మాటలను బదు లాడక, ఆచరించి, వాని వలన గలుగు సుఖ దుఃఖములను అస్వతంత్రముగా అనుభవించు భృత్య వర్గమే పూతనాదులు. అనగా - మనస్సు యొక్క నిర్ణయములను అస్వతంత్రముగా అమలు జరుపు ఇంద్రియములే పూతనాదులు

(7) వివేక - సంపన్నమైన బుద్ధియందే - పరమాత్మ ఆవిర్భవించును. బుద్ధి యనునది - సహజముగనే నిశ్చయాత్మకము. దీనికి దార్ఢ్యమును కలుగజేయు శాస్త్రజన్య సంస్కారమే వివేకము. వీరలే దేవకీ వసుదేవులు. వివేక సంపన్నమైన బుద్ధిలోనే కృష్ణుడు ఆవిర్భవించును.

(8) కృష్ణ శబ్దమునకు - కృష్=నిత్యమైన, ణ=ఆనందము. అని యర్థము.

(9) ఇంద్రియముల సహకారముతో - మనస్సు చేయు అకృత్యములనుండి, తనను తాను పరిరక్షించుకొనుటకై హృదయములో - అంతర్యామిగా ఆవిర్భవించిన స్వామి - నంద వ్రజమునకు చేరెను. "హృదయే ఆనక దుందుభిః" అని కదా భాగవత సూక్తి !

(10) నందతి, నందయతి - తాను భగవ దనుభవముచేత ఆనందించుచు, తనను ఆశ్రయించిన సత్త్వ సంపన్నులైనవారిని (=సాత్త్వికులను) ఆనందింపజేయు ఆచార్యుడే నందుడు.

(11) ఈ ఆచార్యునకు గల - అనన్యమైన భగవత్ప్రీతియే - ఆయనకు యశస్సును కలుగజేయును కావున - యశోద. (యశః = దదాతి ఇతి యశోదా)

(12) భగవానుడు ఆచార్యునకు - తన అనుభవమును అనుగ్రహించి, త న్మూలమున - చేతనులను ఉద్ధరింపజేయును.

(13) తనకు (భగవ దనుభవమునకు) ప్రతిబంధములై, ఇంద్రియములను ఆశ్రయించియున్న తామస ప్రవృత్తు లన్నింటిని అణచి, చివఱకు-'మధుర'ను (శరీరమును) ఏకచ్ఛత్రముగా పరిపాలించుచున్న కంసుని - (మనస్సును) నిగ్రహించి, అతనికి తన సాయుజ్యమును అనుగ్రహించును స్వామి. అనగా - మనస్సు - తన సకల ప్రవృత్తులు అరికట్టబడగా, భగవద్రూపాంకితమై, నిగ్రహింపబడినపుడు - 'కంస' సంహారము అయినట్లే.

(14) ఇట్టుడు - 'మధుర' (శరీరము) కంసుని నుంచి రక్షింపబడినవి దేవకీ వసుదేవులు (బుద్ధి, వివేకము,) వీనికి బంధువైన ఉగ్రసేనుడు (ఆత్మ) - కారాగార బంధ విముక్తిని పొందగలరు

(15) దీనిని బట్టి తేలిన సారాంశ మేమనగా - ఎవరు మనస్సును, దాని నాశ్రయించిన ఇంద్రియములను, వీనికి గల రాజస - తామస ప్రవృత్తులను పూర్తిగా నశింపజేసి, బుద్ధి వివేక సంపన్నమై, ఆత్మోజ్జీవనముచేసి కొనగలరో, వారి హృదయములందే - నిత్యానంద స్వరూపుడైన స్వామి ~ స్థిరనివాసము కల్పించుకొనును, తన సాన్నిధ్యమును నిరంతరము అనుగ్రహించుట ద్వారా - ఈ దేహముతోనే - స్వానుభవమును కలుగజేయుట ద్వారా, చివరకు - మోక్షమును అనుగ్రహించును.

అవతారమునకు గల ఈ తాత్త్వికమైన అంత సూత్రమును సము మననముచేసినపుడు - ప్రతి శరీరము ఒక మధురగను, భగవ ను గ్రహమును పంచియిచ్చు ఆచార్యుడు గను, భగవ ప్రీతి - శోదగను - అనుభవగోచరమై, ఐహిక జీవనమును కూడ సఫలము కునని పెద్దల సమన్వయము.

## 10. కల్కి అవతారము

ఇది - పదియవ అవతారము. ఈ యవతారము - ఇంకను గలేదు. ధర్మము పూర్తిగా అడుగంటి, అధర్మము వికృతముగా - య తాండవము చేయుచు, సజ్జన పీడ హెచ్చుమీరినపుడు - ముఃపతి - ఈ యవతారమును - ఈ యుగమందే ధరించి, దుష్ట గహమును, శిష్ట పరిగ్రహమును చేయగలడని - పురాణములు నుచున్నవి

"వేదాం త్తు ద్వాపరేదస్యస్య, కలే ర న్తే పున ర్హరిః
కల్కి స్వరూప దుర్వృత్తాన్ మార్గే స్థాపయతి ప్రభుః "

విష్ణుపురాణ వచనము. (3-3_59) శ్రీ భాగవతముకూడ -

"అథాఽసౌ యుగ సంధ్యాయాం దస్యు ప్రాయేషు రాజసు
జనితా విష్ణు యశసః నామ్నా కల్కి ర్జగత్పతిః." (1-3-25)

ఇక యుగ సంధిలో - రాజ లోకము అంతయు - గజ దొంగ తయూ రయి, లోకమును పీడించినపుడు — జగత్పతియైన ంరి - కల్కి రూపముగా-'విష్ణు యశస్సు'కు - జన్మ నిచ్చును'- చెప్పుచున్నది. మఱి కొంత విస్తారముగ విజృంభించినపుడు,

శమాది ధర్మములు పూర్తిగా నశించి, ప్రజలు వివిధములైన-
త్రములైన వ్యాధులతో బాధపడుచు, అధర్మము, అన్యోన్య
ము పెచ్చు మీరి, వారి జీవనము దుర్భరమైనపుడు, పరిపాలకు
గల రాజులే - గజదొంగలై, దోచుకొనుచుండగా, కలియు
మున, ధర్మ రక్షణార్థమై, స్వామి అవతరించును శంభల గ్రామ
ష్ఠుడైన బ్రాహ్మణునకు - 'విష్ణు యశస్సు' అను పేరు గల
యందు - 'కల్కి' ఆవిర్భవించును 'దేవ దత్త' యను
మును అధిరోహించి, అష్టైశ్వర్య సంపన్నుడై, మహా ఖడ్గమును
బూని, ప్రపంచ మంతటను సంచరించి, దుష్టులైన పాలకులుగా -
గు వేసికొనియున్న గజ దొంగలను - సమూలముగా నిర్మూ
నను' - అని శ్రీమద్భాగవత మహా పురాణమే మనకు తెలియ
ంచున్నది (12-2-16/23).

ఇట్లే, మఱి కొన్ని పురాణములందును - ఈ కల్కి అవతార
ంస ఉన్నది ఈయుగముగాక, ఈ అవతార వైశిష్ట్యమును
గముగ నిరూపించుచు, 'కల్కి పురాణము' అను పేర నొక
పురాణముకూడ వెలసియున్నది.

ఈ 'కల్కి' అవతారమును గుఱించి, ఆళ్వారుల అనుభవము
ను కానరాదు. కాని, వైష్ణవాచార్య ప్రముఖు లగు శ్రీవత్సాంక
ంల సుందర బాహు స్తవమునందును, పరాశర భట్టరుల శ్రీరంగ
స్తవమునందును, వేదాంత దేశికుల దశావతార స్తోత్రమునం
ు - ఈ యవతార వైభవము - కొంతవరకు వర్ణింపబడియున్నది.

**తారముల వెనుక గల తాత్త్విక భావన :-**

శ్రీవిష్ణు పురాణము - పరమాత్మ యొక్క శక్తి - మూడు ములుగా నుండునని చెప్పినది

1 విష్ణు శక్తి 2. క్షేత్రజ్ఞ శక్తి 3 అవిద్యాత్మక కర్మ ఈ మూడుశక్తులలో - విష్ణు శక్తి శ్రీ లక్ష్మిగను, క్షేత్రజ్ఞ - జీవకోటిగను, అవిద్యా శక్తి కర్మ - ప్రకృతుల ద్వారా డినచో, అవిద్యాశక్తిచేత జీవశక్తి ఆవరింపబడి, సంసారబంధ లో చిక్కుకొనును. ఈ విధముగా - భగవత్సంకల్పాయత్తముగా, వర్గీతగా ప్రవర్తించు యీ సమస్త సృష్టి ప్రక్రియయందును జీవకోటి సహజముగ - జ్ఞానానంద స్వరూపము లైనను, అవిద్యా మగు కర్మశక్తిచేత ఆవరింపబడి, సత్త్వ - రజ - స్తమో గుణత్రయముతో కూడిన ప్రాకృతిక, దేవ - మనుష్య - క - స్థావరాది వివిధ దేహములలో బంధింపబడి, సంసార సుఖ ఖములను అనుభవించుచున్నపుడు, ఈ అవిద్యాపరిణామమైన ంమందే కల రాజస - తామస ప్రవృత్తులు దుఃఖ మోహము కారణమైన ఆసుర లక్షణములు కాగా, వానిని సంహరించి, ప్రవృత్తులైన దైవతి లక్షణములను రక్షించుట కొరకు, ఆరీతిగా ను రాక్షసుల బారినుండి కాపాడుట - భగవంతుడు అనాదిగా, తముగా జరుపు వ్యవహారమే ఇదియే అవతార ప్రక్రియలోని సూత్రము. అన్ని అవతారములకును సమానముగా కానవచ్చు సురుల యుద్ధములు, విష్ణు భగవాను డవతరించి, రాక్షస సంహా చేసి, దేవతలను రక్షించుట అనునది. మనము ప్రతీకలుగా

తీసికొని, మన హృదయములందే భగవంతుడు అవతరించవలెనని భావించినప్పుడే - అవతార లక్ష్యము నిజముగా - సార్థక మగును

ఆధునికుల భావన :-

ఆధునికులు, వైజ్ఞానిక భావన కలవారు, దశావతారముల క్రమమును జీవ సృష్టికి, జీవ లక్షణ పరిణామములకు అన్వయించు చున్నారు వీరి దృష్టిలో - తల్లి గర్భములో ప్రవేశించిన జీవ తత్త్వము పొందు క్రమవికాసమునకు - ఈ దశావతారములు ప్రతీకలు ఈ విషయమై, విమర్శకులు చాల గ్రంథములను రచించిరి ఆ దృష్టి కలవారు - వానినే చదువగలరు.

## ముగింపు

చిట్ట చివటికి - శ్రీ వేదాన్త దేశిక రచిత మగు ఈ దశావతార స్తుతిపరమైన శ్లోకముతో - ఈ వ్యాసమును ముగించు చున్నాను.

"ఇచ్చా మీన (1) విహార కచ్ఛప (2) మహా
పోత్రిన్ (3) యదృచ్ఛాహరే (4)
రక్షా వామన (5) రోష రామ (6) కరుణా
కాకుత్స్థ (7) హేలా హలిన్ (8)
క్రీడా వల్లవ (9) కల్కి వాహన దశా
కల్పిన్ (10) ఇతి ప్రత్య హం
జల్పన్తః పురుషాః పునన్తి భువనం
పుణ్యౌఘ పణ్యాపణాః"

(17)

స్వేచ్ఛా మీనమా! విహార కచ్ఛపమా! మహా వరాహమా స్వచ్ఛంద కేసరీ! రక్షకుండవైన వామనుఁడా! క్రోధావిష్టుడవై ఓ పరశురామా! కృపావశుడవైన ఓ శ్రీరామా! ఓ బలదేవా క్రీడాగోపకా! కల్కీ! అని - నిరంతరము భగవ దవతారములకు చెందిన పది నామములను జపించు పుణ్యాత్ములు - పుణ్యము లోకమునకు విక్రయించు ఆపణములవంటివారలై, లోకమును పవిత్రీకరించుచున్నారు' - అని, భగవ దవతార నామ దశకము సర్వులకును కలిసంతారక మహామంత్ర మను అభిప్రాయము అందఱి హృదయము లందును దృఢపడుగాక!





విష్ణుభగవానుని దశావతారములు

# కలియుగ మహత్త్వము
# కల్కి పురుషుని యవతరణము

‘ ఆగమాచార్య ’

శ్రీమాన్ దిట్టకవి లక్ష్మీ నరసింహాచార్యులు

★

## సృష్ట్యారంభము

“సో౽కామయత బహుస్యాం ప్రజాయేయ । ఆత్మన ఆకాశ స్సంభూతః । ఆకాశా ద్వాయుః । వాయో రగ్నిః । అగ్నే రాపః । అద్భ్యః పృథివీ । పృథివ్యా ఓషధయః । ఓషధీభ్యో౽న్నమ్ । అన్నా త్పురుషః.”

— (తైత్తిరీయోపనిషత్తులో - బ్రహ్మానందవల్లి 2)

శ్రీమన్నారాయణుఁడు ఒకా నొకపుడు - సృష్టి చేయవలె నని సంకల్పించెను. అపుడు ఆ పరమాత్మ నుండి ఆకాశము పుట్టెను ఆ యాకాశము నుండి వాయువు పుట్టెను. ఆ వాయువు నుండి అగ్ని పుట్టెను. ఆ యగ్ని నుండి నీరు పుట్టెను. ఆ నీటి నుండి భూమి పుట్టెను ఆ భూమి నుండి ఓషధులు పుట్టెను. ఆ ఓషధుల నుండి అన్నము పుట్టెను. ఆ యన్నము నుండి పురుషుఁడు (జీవుడు) పుట్టెను ’

జ్యోతి శ్శాస్త్రానుసారము - ఇప్పటికి సృష్టి నుండి 195 కోట్ల 58 లక్షల - 85 వేల - 095 సంవత్సరములు గడచినవి. (= 195, 58 85, 095).

## కాల చక్రము

కాలము పరమాత్మ స్వరూపము. ఆ పరమాత్మ నుంచి ఈ సృష్టి యంతయు జరుగుటయు, సృష్ట్యారంభమునుండి నేటి వఱకు అనంతమైన కాలము జరిగిపోవుటయు, ఇంకను ఈ కాలము జరుగనుండు టయు - ఇది యంతయు - ఒక కాల చక్ర భ్రమణముగా మనకు కానవచ్చును. ఈ కాలమును-జ్యోతి శ్శాస్త్రిజ్ఞులైన మన పూర్వులు-ఈ క్రింది విధముగా విభాగించియున్నారు :-

18 రెప్పపాట్లు - 1 కాష్ఠ
* 30 కాష్ఠలు - 1 కల
30 కలలు - 1 ముహూర్తము
30 ముహూర్తములు - 1 అహోరాత్రము (1 దినము)
30 అహోరాత్రములు - 1 మానవ మాసము
12 మానవ మాసములు - 1 మానవ వత్సరము
(ఇది దేవతలకు ఒక దినము)
30 మానవ వత్సరములు - ఒక దేవ మాసము
12 దేవ మాసములు - ఒక దేవ వత్సరము
4,800 దేవ (దివ్య) వత్సరములు - కృత యుగము
3,600 దేవ వత్సరములు - త్రేతా యుగము
2400 దేవ వత్సరములు - ద్వాపర యుగము
12,000 దేవ వత్సరములు - కలి యుగము

---

* "అష్టాదశ నిమేషాస్తు - కాష్ఠా త్రింశ స్తుతాః కలాః."
— (అమరకోశము)

12,000 దేవ వత్సరములు - ఒక దేవ యుగము

1,000 దేవ యుగములు – బ్రహ్మకు ఒక పగలు

60,000 దేవ యుగములు - బ్రహ్మకు ఒక మాసము

12 బ్రహ్మ మాసములు - బ్రహ్మకు ఒక వత్సరము

100 బ్రహ్మ వత్సరములు - బ్రహ్మకు ఒక కల్పము

| | | |
|---|---|---|
| (1) కృత యుగమునకు | మానవ వత్సరములు | - 17,28,00 |
| (2) త్రేతా యుగమునకు | ,, | - 12,96,00 |
| (3) ద్వాపర యుగమునకు | ,, | - 8,64,00 |
| (4) కలి యుగమునకు | ,, | - 4,32,00 |

మనువులు 14 మంది. ఒక్కొక్క మన్వంతర కాలమునకు 30,77,20,00 మానవ వత్సరములు

## మనువుల పరిపాలన

బ్రహ్మ యొక్క ఒక దినము - (1) స్వాయంభువ (2) స్వారోచిష (3) ఉత్తమ (4) తామస (5) రైవత (6) చాక్షుష (7) వైవస్వత (8) సావర్ణి (9) బ్రహ్మసావర్ణి (10) దక్షసావర్ణి (11) రుద్రసావర్ణి (12) ధర్మసావర్ణి (13) భౌమ (14) భౌచ్య - అనబడు పదునల్వురు మనువుల పరిపాలనముతో పరిసమాప్త మగును

ఇట మన్వంతర మనగా – 71 చతు ర్యుగములు ఇట్టి చతు ర్యుగములు 71 ఒక మన్వంతరము. *

---

* "మన్వన్తరం తు దివ్యానాం । యుగానా మేక సప్తతిః"

— (అమరకోశము

ఇపుడు 7 వది యగు వైవస్వత మన్వంతరములో - 28 వ చతుర్యుగము గడచుచున్నది.

కలి యుగ సంవత్సరముల సంఖ్య - 4 లక్షల 32 వేలు అని-పైన పేర్కొనఁబడినదిగదా ! దీనిని ఇట్లు నాల్గు భాగములు గావించి నచో - ఒక్కొక్క భాగమునకు 1 లక్ష 8 వేల సంవత్సరములు వచ్చును, ఈ 1 లక్ష 80 వేలలో - ఇప్పటికి - 5,0,94 వంవత్సరములు గడచినవి. ఇంకను - కలియుగ ప్రథమ పాదము నందు - 1 లక్ష, 3 వేల, 6 సంవత్సరములు గడువవలసియున్నది,

అనఁగా - కలియుగ వత్సర సంఖ్య 4,32,000 లో - ఇప్పటికి - 5,094 గడువగా, ఇంకను - కలియుగమున - 4,26,006 సంవత్సరములు గడవవలసియున్నవి' అని స్పష్ట మగును.

## కలియుగ లక్షణములు

ఈ కలి యుగమున జనులు ధర్మమును వీడి పాప వర్తనులై, మరణానంతరము - నరక బాధ లనుభవింపఁగలరని, మహా భారతము తెలియఁజేయుచున్నది

మహా భారతములో - అరణ్య పర్వమున - మార్కండేయ మహర్షి - ధర్మరాజుతో - శ్రీమన్నారాయణుని కటాక్షములనసే, గత కవియుగాంతమును, జల ప్రళయమును చూచితి ననుచు, కలియుగాంతమున సంభవించిన సంఘటనలను ఈ విధముగా వివరించియున్నాఁడు :-

"ధర్మ నందనా !

కృతయుగమున ధర్మము నాలుగు పాదములతో ప్రవర్థిల్లు చుండును. త్రేతా యుగమున ధర్మము ఒక పాలు తరిగి, మూఁడు పాదముల వర్తించును. ద్వాపర యుగమున - ధర్మము రెండుపాళ్ళు నశించును. కలి యుగమున - ధర్మము మూఁడు పాదములు క్షీణించి, ఒక పాదము నిలచును. కనుక, ధర్మము మూఁడు పాళ్ళు నశించి - ఒక పాదమే నిలచియుండుట వలన, కలియుగమున - జీవులందఱును అనేక కష్టముల ననుభవింతురు.

జనులలో - సత్య ధర్మములు అంతరించును ఆయువు తరగి పోవును అందువలన, జ్ఞానము నొసఁగు విద్యలను నేర్చుటకు తగిన కాలము లేక, అల్ప విద్యలు మాత్రమే నేర్తురు. అట్టి అల్ప విద్యల వలన మోహము జనించును. ఆమోహము వలన - లోభము, ఆ లోభము వలన కామము, అ కామము వలన క్రోధము పేర్పడును దానివలన వైర భావ ముదయించును. త త్ఫలముగా - సర్వ వర్ణ ములవారును - పరస్పర కలహములతో - ఒకరి నొకరు హింసించు కొందురు. ఒకరి మాటను మరియొకరు వినరు పెద్దలను, గురువులను- పిన్నలు గౌరవింపరు. వర్ణ సాంకర్య మంతటను పేర్పడును.

బ్రాహ్మణులు - జప, తప, నియమ, స్వాధ్యాయములను విడతురు. వేద విద్యను విక్రయింతురు. శూద్రులు - విప్రుల తపో నిష్ఠలను సాధింతురు లోకములో - జనపదము లన్నియు - దయ, దాక్షిణ్యము లేని క్రూర స్వభావు-లగు నీచ జనులతో నిండిపోవును. అరణ్యము లన్నియు - క్రూర, ఘోర, హింసా ప్రవృత్తి గల సింహ

శార్దూలాది క్రూర మృగములతోడను, విష సర్పాదులతోడను నిండి పోవును

క్షత్రియులు - నీచుల సాంగత్యము వలన - పతనధర్ములై, శౌర్యము, తేజము, సంపద - మున్నగువానిని కోల్పోయి, రాజ్యములను పోగొట్టుకొని, బికారులై యుందురు.

రస - గంధములు - వాని గుణములను కోల్పోవును పాడి - పంటలు నశించును వృక్షములు ఫల హీనము లగును ఇట్లగుట వలన, జనులు ఆకలి బాధతో అలమటించును పాలకులు ప్రజలను అనేక బాధలకు గురి కావించి, వారి నుండి మిక్కుటముగ పన్నులు వసూలు చేసి, వారిని హింసింతురు

జనులలో దైవ విశ్వాసము లోపించును వారలు - హేతువాదు లగుదురు. వావి వరుసలను పాటింపక, పర స్త్రీలను చెరబట్టుదురు. పర ద్రవ్య మపహరింతురు. హత్యల గావింతురు. క్రయ - విక్రయ ములలో - మోసము జరుగును.

వివిధ వ్యాధులతో జనులు బాధ లనుభవింతురు సహజమైన ఆహారము లభింపనందున, జంతు మాంస భక్షణము గావింతురు. దేవతలను, పితృదేవతలను విస్మరింతురు బలహీనుల, దీనుల, బంధువుల, మిత్రుల, ధన మన ప్రాణములను హరింతురు. ధనము కొఱకు- తల్లి తండ్రులనూ, అన్న, తమ్ములను, అక్క- చెల్లెండ్రను హతము గావింతురు.

పరిపాలకులు ప్రజలను ధర్మ మార్గమున రక్షింపక, దుష్ట
సకులై, ఉత్తమ స్త్రీలను, సంపదలను, భూములను - తమవిగా
సికొందురు. అహంకార - బల - దర్పములతో ప్రభువులు పరస్ప
ము కలహించుకొని, భీకర యుద్ధము లొనర్చి, తమ తమ దేశముల
ను జను లందఱకును, సర్వప్రాణులకును - వినాశమును గల్గింతురు

కలియుగము పరిసమాప్తమగు కాలమున, మానవులు పదు
రేండ్ల కంటెను ఎక్కువ జీవింపరు ఆడుపిల్లలు - 7, 8 సంవత్సర
ల వయస్సునందే గర్భములదాల్చి, బిడ్డలను కనెదరు జనులు
ంపదలను కోల్పోయి, చోరులుగా మారుదురు.

సూర్య చంద్రులు - తమ కాంతిని కోల్పోదురు. భూకంప
లు వచ్చును. అగ్నిపర్వతములు బ్రద్దలై జన నాశము కల్గును
ప్పెనలు వచ్చి, సముద్ర జలము ఉవ్వెత్తున అలలుగా లేచి,
ూమిని ఆక్రమించును. ఆకసమునుండి తోకచుక్కలు భూమిపై -
ల జల ప్రవాలును, క్రమముగా - పట్టణములు, పల్లెలు - నశించును
కు లుండరు జనులు ప్రాణ భయముతో - పర్వత బిలములందును,
ోయ లందును - దాగుకొందురు. ఇట్టి యుగాంత సమయమున -
శ్రీ మహా విష్ణువు - కల్కి రూపమున అవతరించును.

## కల్కిపురుషుని యవతారము - ధర్మ సంస్థాపనము

లోకములయందు ప్రసిద్ధి గల 'శంబళ' గ్రామమునందు -
ల్కి-పురుషుఁడు - 'విష్ణుయశుఁడు' అను పేర జన్మించి, సంస్మరణ

# శ్రీమద్రామానుజులు - వేదాంత సారము

' సాహిత్య విద్యా ప్రవీణ - విశిష్టాద్వైత వేదాంత విశారద '
డాక్టర్ : కట్టా విజయరాఘవాచార్యులు, ఎం.ఏ., పిహెచ్.డి.

★

## ప రి చ య ము

అనాదియైన వేదము విశిష్టాద్వైత దర్శనమునకు పరమ ప్ర
...ము కర్మబ్రహ్మాత్మకము వేదము. కర్మకాండ, జ్ఞానకాండ - అ
నేదియు రెండు భాగములు. జ్ఞానకాండనే 'బ్రహ్మకాండ' ...
యందురు. పూర్వ భాగము కర్మప్రతిపాదకము. ఉత్తర భా
బ్రహ్మప్రతిపాదకము. కర్మ - బ్రహ్మ ప్రతిపాదక మయిన వేదమ
కర్మచే బ్రహ్మ ఆరాధింపబడుచున్నాడు ఇది వేదాంత పిండితార్థ
...దము యొక్క ఆదినుండి అంతము వఱకు చెప్పబడినవి. అర్థ
...శకములైన వేదాంతములు, అనగా - ఉపనిషత్తులు - అట్టి ఉ
...త్తులు - పరమాత్మకు సన్నిహితములుగా నుండు నవి' యని
ప్రకాశికాచార్యులు వివరించియున్నారు * మంత్రములందు,
...ద్ధములైన ఉపనిషత్తులందును - సర్వ కర్మ సమారాధ్యుడు, ...
...ష్టి సంహార నిత్యవిభూతి విహారావతారాది సత్యక్రియా శీల
...పు పురుషుడు, సర్వ శబ్ద వాచ్యుడైన ఆ పరమాత్మను ప్ర
...ించు వేదాంతము లన్నింటిని - సమ్మిళితము చేసి, సమాలో
...రము - సులభావగాహన నిమిత్తమై, సంగ్రహ సూత్రము...

---

* బ్రహ్మ ణ్యుపనిషణ్ణే త్యుపనిషత్ — శ్రుతప్రకాశికాచార్య

రచించినాడు వ్యాసుడు అత డిట్లు వేదమును సూత్రములుగా విభజించి, వేదవ్యాసు డయ్యెను. అట్టి వేదాంత సూత్రములే బ్రహ్మ ప్రతిపాదకములు కావున, బ్రహ్మసూత్రములుగా పేరందినవి ఆచార్యు లనేకులచే బహు విధములుగా భాష్యములు వ్రాయబడిన యీ బ్రహ్మసూత్రముల సారమును తెలియజేయుచు, అధికరణములుగా విభజించి, వాని సారము నందించుచు - భగవద్రామానుజులచే రచింపబడినది - వేదాంత సారము అట్టి వేదాంత సారము నందలి సూత్రములు 545, పాదములు 16 అధ్యాయములు 4 - అధికరణములు 156

## ప్రథమాధ్యాయ - ప్రథమ పాదము

**1 జిజ్ఞాసాధికరణము -**

**"అథాఽతో బ్రహ్మ జిజ్ఞాసా"**

అని - ప్రథమ సూత్రము. వేదాధ్యయనానంతరము-కర్మజ్ఞానము సంపాదింపవలెను. తదనంతరము-బ్రహ్మజ్ఞానమును సంపాదింపవలెను. వేదార్థైక దేశ మగుటవలన - కర్మవిచారము ప్రథమ కర్తవ్యవ అటుపిమ్మట కర్తవ్యము బ్రహ్మవిచారము కేవల కర్మఫలము అల్ప అస్థిరము. బ్రహ్మజ్ఞానము అనంతము, స్థిరమైన ఫలము. సారార్థ మనగా :- కర్మవిచారము అల్పాస్థిర ఫలము నిచ్చును కావున, కర్మవిచారానంతరము బ్రహ్మవిచారము చేయవలెను ఆ బ్రహ్మ యనగా -

**2 జన్మాద్యధికరణము :-**

"జన్మాద్యస్య యతః" అని - సూత్రము బహు విధము లైన భాగ్యములతో, భోక్తలతో గల ఈ జగత్తునకు దేనివలన సృష్టి-స్థితి-లయ మోక్షములు కలుగుచున్నవో - అది బ్రహ్మము- అని యర్థము, అందులకు ప్రమాణ మే మనగా :-

**3. శాస్త్రయోనిత్వాధికరణము -**

"శాస్త్రయోనిత్వాత్" అను సూత్రము - బ్రహ్మకు శాస్త్రీయ మైన ప్రమాణము కల దని యర్థము చిదచిద్వస్తు శరీరకుడయిన బ్రహ్మ - నిఖిల జగదేక కారణ మని శ్రుతి సిద్ధము అట్లు తెలిసి కొనుటవలన ప్రయోజన మే మనగా -

**4. సమన్వయాధికరణము .-**

బ్రహ్మపదార్థము పురుషార్థ మగుట చేత, అట్లు తెలిసికొను వానికి - ఆ బ్రహ్మపదార్థము నిరతిశయమైన ఆనందమును కల్గించును అట్టి బ్రహ్మను ప్రతిపాదించు శాస్త్రమునకే సాక్షాత్పురుషా ర్థాన్వయము సిద్ధము.

"నిఖిల జగదేక కారణము పరమాత్మ యని - వేదాంతములు (=ఉపనిషత్తులు) ప్రతిపాదించుచున్నవిగదా! అట్లే, ప్రకృతియు జగత్కారణ మెందులకు కాకూడదు?" అన్నచో- కాదు, కాజాలదు.

**5 ఈక్షత్యధికరణము ..**

"ఈక్షతే ర్నాశబ్దమ్" దేనికి శబ్దప్రమాణము లేదో, అది అశబ్దము, 'ఈక్షతి' ధాత్వర్థ మయిన ఈక్షణవ్యాపారము సిద్ధించ

నందున, బ్రహ్మయే 'సత్' శబ్దవాచ్యమైన జగత్కారణ మని యర్థము సచ్ఛబ్ద వాచ్యుడు బ్రహ్మ యగుటచే - 'గౌణి శ్రుణము' కాదు సచ్ఛబ్ద వాచోపాసకునకు మోక్షము కలుగునని ఉపదేశము అందుచే, సచ్ఛబ్దముచే చెప్పబడినది ప్రకృతి కాదు. పరమాత్మయే. ప్రకృతి జ్ఞానము వలన సర్వజ్ఞానము సిద్ధింపదు కావున, 'ఏక విజ్ఞానేన సర్వ విజ్ఞానమ్' అను ప్రతిజ్ఞకు విరోధము కల్గును కనుక, ప్రకృతి - కారణము కాదు పరమాత్మయే సర్వమునకు సర్వజ్ఞుడైన పరమాత్మయే కారణము - కనుక, సచ్ఛబ్ద వాచ్యుడు పరమాత్మయే ప్రకృతి కాదు జగత్కారణభూతుడు పరమాత్మ యని శ్రుతులు చెప్పుచున్నందున, వేదాంతవేద్యుడు పరమాత్మయే ప్రకృతి కాదు

**6 ఆనందమయాధికరణము .-**

నిరతిశయానందము పరమాత్మయందే సంభవించుటవలన, జీవాత్మయందు సంభవింపకపోవుటచేత - ఆనందమయుడు జగత్కారణముగా నిర్దేశింపబడినవాడు పరమాత్మయే. జీవాత్మ కాదు జీవాత్మకు ఆనందమును పరమాత్మయే ప్రసాదించును కనుక, ఆనందమయుడు పరమాత్మయే 'సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ' ఇత్యాది మంత్ర వర్ణములచే చెప్పబడిన ఆనందమయుడు పరమాత్మయే.

మంత్రవర్గ మందు జీవాత్మ స్వరూపము చెప్పబడిన దన్న దో కాదు జీవునకు దేవుడు ప్రకాశకుడని చెప్పుటచేత, ఆనంద శ? వాచ్యుడు పరమాత్మయే, జీవాత్మ కాదు విజ్ఞానమయుడై న ఎ? మాత్మకు భేదము చెప్పబడినది. పరమాత్మ - సంకల్పముచేతనే జ? త్సృష్టి గావించెను జీవాత్మకు ప్రకృతియందు అపేక్ష కలదు

కావున, ఆనందమయుడైన పరమాత్మ - జీవాత్మకంటెను అన్యుడు. ఆనందమయుడైన పరమాత్మవలన - జీవాత్మకు ఆనందముకల్గుచున్న దని శాస్త్రము చెప్పుచున్నది

**7 అంతరధికరణము ..**

ఆదిత్యమండలాంతర్వర్తి యగు పురుషునకు - కర్మరూప మగు శరీరావయవ సంబంధము కర్మ కృత మని తోచుట వలన, జీవుడు నిశ్చయ మగుటచే - ఆనందమయుడు జీవాత్మ యన్నచో, కాదు ఆదిత్యునిలోనున్న పురుషుడు పరమాత్మ పరమాత్మకు అసాధారణ మైన అపహత పాప్మత్వము మొదలగు ధర్మములు గలవు. "సూర్య మండలమందే - ఈ రమణీయ రూపము గల పురుషుడు కానవచ్చు చున్నాడు" - అను మొదలగు శ్రుతులలో తెలుపబడు పురుషుడు - పరమాత్మయే "ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్" ఇత్యాది శ్రుతి వాక్యములందు వర్ణింపబడిన అప్రాకృత మగు దివ్యమంగళ విగ్ర హము - జ్ఞానబలైశ్వర్యాది కల్యాణ గుణముల వలె పరమాత్మకు సంభవించును నియామ్య - నియామక భావము చేత - ఆదిత్యుని యందును, అక్షియందును గల పురుషుడు - జీవాత్మకంటెను వేరైన పరమాత్మయే

**8. ఆకాశాధికరణము ..**

కారణము పరమాత్మ యనియు, సర్వము కార్య మనియు చెప్పుచుండగా, "సర్వాణి భూతా న్యాకాశా దేవ సముద్యన్తే" భూతము లన్నియు ఆకాశమునుండియే పట్టుచున్న వను వాక్యముచే - ఆకాశము కారణ మనబడుచుండగా, అది యీ యధికరణమున

రాకరింపబడుచున్నది సంకల్పపూర్వకమైన సృష్టిరూప కారణము
ునన - ఆకాశ శబ్దవాచ్యుడు పరమాత్మయే కనుక, చిదచిద్విలక్షు
మై సర్వజ్ఞమైన పరబ్రహ్మము - ఆకాశ శబ్ద నిర్దిష్టమైన దని స్పష్ట
ంగుచున్నది.

### ప్రాణాధికరణము :-

జగత్కారణ మగుటవలన - ప్రాణ శబ్దముచే నిర్దేశింపబడిన
ాడు పరమాత్మయే చేతనాచేతనములకు ప్రాణమున కధీన మయిన
ి లేనందున - "సర్వాణి హవాభూతాః" అని ప్రసిద్ధముగా నిర్దే
ంచుటవలన, ప్రాణశబ్దముచే నిర్దేశింపబడినది పరమాత్మయే.

### 0. జ్యోతిరధికరణము :-

సర్వభూతాచరణము చెప్పబడుటవలన, జ్యోతి శ్శబ్దనిర్దిష్ట మయి
ది పరమాత్మయే ఆదిత్యాది జ్యోతిస్సు కంటెను - నిరతిశయ
ప్తియు - జ్యోతి శ్శబ్ద నిర్దిష్ట మయినది పరమాత్మయే 'గాయత్రి'
ును ఛందస్సు ప్రస్తుత మగుటవలన-'గాయత్రి'-సర్వభూత పాద
ుగా చెప్పబడుటవలన, బ్రహ్మ కాదన్నచో-కాదు. గాయత్రీ
బ్దముచేత పరమాత్మయే చెప్పబడుచున్నాడు.

### 11. ఇంద్రప్రాణాధికరణము :-

పరబ్రహ్మప్రకారము లయిన యీ నందాదులు పరమాత్మకు
ంబంధించిన వగుటవలన, ఇంద్రప్రాణ శబ్దాభిధేయము పరమా
త్మయే. "స ఏవ ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మా-ఆనందో-అజరో-అమృతః"

పూర్వము చెప్పబడిన ప్రాణశరీరకుడే - జీవ శరీరకుడు, ఆనంద స్వరూపుడు, ముదిమి లేనివాడు, ఆనందస్వరూపుడు - అని ఇంద్ర ప్రాణ శబ్దములచే నిర్దేశింపబడినవాడు - జీవుని కంటెను వేరైన పరమాత్మయే

## ప్రథమాధ్యాయ - ద్వితీయ పాదము

ఈ ద్వితీయ పాదమున - అస్పష్ట జీవాదిక లింగము లయిన కొన్ని వాక్యములు వివరింపబడుచున్నవి

### 1 సర్వత్రప్రసిద్ధ్యధికరణము .-

సర్వ శబ్ద వాచ్య మయిన వస్తువునందు - దానికి ఆత్మగా శాసనాధికరణముచేత నిర్దేశింపబడినది పరమాత్మయే. "సర్వం ఖల్విదం బ్రహ్మ" "తజ్జలాన్"అని ప్రసిద్ధమైనదానివలె - బ్రహ్మ నుద్దేశించుటవలన, సర్వాత్మకత్వము నుపదేశించుటవలన, జగజ్జన్మ స్థితి లయములకు హేతువుగా - వేదాంతములందు ప్రసిద్ధమైనది పరమాత్మయే మనోమయత్వము, సత్య సంకల్పము మొదలగు గుణములు పరమాత్మయందే అన్వయించుచున్నవి అతడే సర్వాత్మ పృధివికంటె, అంతరిక్షముకంటె, ఆకాశముకంటెను, ఈ భూలోక - బ్రహ్మలోకాది చతుర్దశ భువనములకంటెను గొప్పవాడు. సుఖ దుఃఖము లకు అతీతుడు అవి - పరమాత్మకు అంటవు

### 2 అత్రధికరణము :-

సకల జగ దుపసంహారమందు మృత్యువు - ఉపసేచనము. ఇది - కర్మ నిమిత్తమైన భోక్తృత్వము కాదు. జగత్సృష్టి స్థితి లయ

లీల కలిగిన పరమాత్మకు - జగ దుపసంహారత్వ రూప మయిన భోక్తృత్వము కావున, అతడు పరమాత్మయే

### 3 అంతరాధికరణము -

సంయద్వామత్వము మొదలగు గుణములు పరమాత్మయందే వ్యక్తము లగుటవలన - కంటియం దున్నవాడు పరమాత్మయే. సంయద్వామత్వ మనగా - కల్యాణ గుణములు కలిగియుండుటయని యర్థము.

"య ఏషోఽక్షిణి పురుషో దృశ్యతే, ఏష ఆత్మేతిహోవాచైత దమృత మభయ మేత ద్బ్రహ్మ"

యోగులచేత ఈ కంటియందు పురుషుడు చూడబడుచున్నాడో - అతడు పరమాత్మ - అమృతమయినవాడు, అభయుడైన వాడు పరమాత్మ యని- ఛాందోగ్యోపనిషత్తు పరమాత్మను వర్ణించుచున్నది. కంటియందు స్థితి, నియమనము మున్నగువానియొక్క నిర్దేశమువలన, యుక్త్యాధార పురుషుడు పరమాత్మయే అతడు అపరిచ్ఛిన్న విశిష్టుడు.

### 4 అంతర్యామ్యధికరణము :-

పరమాత్మ సర్వాంతర్యాంతరత్వము, సర్వవిదిత్వము, సర్వశరీరకత్వము, సర్వ నియమనము, సర్వాత్మకత్వము, అమృతత్వము . సుప్రసిద్ధములు జీవునిచే చూడబడని అంతర్యామి పరమాత్మ. అతనిచే చూడబడనిది లేదు.

## 5. అదృశ్యత్వాది గుణకాధికరణము :—

అదృశ్యత్వము మొదలగు గుణములు కలవాడు పరవ
జీవునకంటెను, ప్రకృతికంటెను ఇతరుడు. భూతయోన్యక్ష
నెప్పుడు సమస్త మయిన చిదచిదాత్మక ప్రపంచము -
యోన్యక్షరవాచ్యమునకు రూపముగా నుపన్యసించుటవలన
యదృశ్యత్వాది గుణకుడు పరమాత్మయే

## 6 వైశ్వానరాధికరణము .—

వైశ్వానర శబ్దముచే నిర్దేశింపబడినవాడు పరవ
"ఆత్మానం వైశ్వానరమ్" అని - బ్రహ్మ శబ్దస్థానమందు ఁ
వైశ్వానర శబ్దము ప్రయోగింపబడుటవలన, ఆ వైశ్వానర
సకలజీవాత్మలకు ఆత్మయైన పరమాత్మ యని, తెలియుచు
"అగ్ని ర్మూర్ధా చక్షుషీ చంద్ర సూర్యౌ" అగ్ని శిరస్సు, స
చంద్రు లిరువురును నేత్రము లని ప్రసిద్ధమయిన పరమపుర
రూప మిచ్చట అదియే యిది యని ప్రత్యభిజ్ఞ చేయబడిన
వైశ్వానర శబ్దవాచ్యము పరమాత్మ యగును వైశ్వానరుడు ఫ
నిగా చెప్పబడుచున్నాడు "పురుష ఏ వేదగుం సర్వమ్" ఈ ప్ర
మంతయు పురుషుడే "పురుషా న్న పరం కించిత్" పురుషునిక
న్నది యొకటి లేదు. పరమాత్మ సర్వశరీరకుడు కనుక, సర్వవ
మాత్మపర్యంతము అనువర్తించును. కావున, అతడు స
నాప్యుడు.

# ప్రథమాధ్యాయ - తృతీయ పాదము

ఈ పాదమున - స్పష్ట మగు జీవ లింగములు కల వాక్య
లను గుఱించి, విచారించబడుచున్నవి ..

## 1 ద్యుభ్వాధికరణము ..

పరమాత్మకు అసాధారణ మయిన ఆత్మాది శబ్దమువలన
ఆకాశము, భూమి మొదలైనవానికి ఆధారము పరమాత్మ "అజా
మానో బహుధా విజాయతే" కర్మసంబంధమయిన-జన్మ లేనివా
నను - అనేకములైన అవతారములుగా పుట్టుచున్నాడనియు, అం
ఆశ్రయించుటకొఱకు అప్రాకృతమైన తన స్వభావమును వదలక
పరమాత్మ పుట్టుచున్నట్లు వ్యక్త మగుచున్నది కావున, ద్యుభ
ద్యాయతనము పరమాత్మయే. పరబ్రహ్మోపాసకుడు ప్రాక్
మయిన అప్రాకృత రూపము గల పరమపురుషుని పొందుచున్నాడ
అని - ప్రాప్యుడుగా నిర్దేశింపబడుటవలన, ద్యుభ్వాద్యాయతన
పరమాత్మయే. జీవాత్మకంటెను పరమాత్మకు భేదము చెప్పబడు
వలనకూడ ద్యుభ్వాద్యాయతనము పరమాత్మ యనియే స్పష్టము.

## 2 భూమాధికరణము -

భూమ శబ్దముచేత నిర్దేశింపబడినవాడు - పరమాత్మ. జీవాత్మ
ఈ శరీరమునుండి లేచి, పరంజ్యోతివాచ్యుడైన పరమాత్మ
పొంది,' అను సంప్రసాద శబ్దము జీవాత్మయందు ప్రసిద్ధము. భూం
శబ్దమునకు-సుఖ మని యర్థము సుఖ స్వరూపుడు పరమాత
కనుక, అతనిని పొంది, జీవాత్మ సుఖించుచున్నాడు. సాంభావి

. యిన అమృతత్వము మొదలగు ధర్మములు - భూమ
నాయిన పరమాత్మయందు సరిపోవుటవలన, భూమశబ్దవ
సాతిశయ నైపుల్య విశిష్టు డగు పరమాత్మ యని - సవ

## 3 అక్షరాధికరణము :-

వాయువు కల ఆకాశమునకు కారణ మయిన -
యగు ప్రధానమును ధరించుటవలన, అక్షర శబ్దవాచ్యు
స్మయే. "సూర్యా చంద్ర మసౌ ధారా విధృ్ౌ విష్టత:'
చంద్రుడును - ధరింపబడినవారై యున్నారు' అను ప్రశా
సర్వాధారత్వము వినబడుటవలనను - అక్షర శబ్దవాచ్య
స్మయే సర్వమును చూచునది, ఇతరులచే చూడబ
అక్షర శబ్ద వాచ్యమయిన పరమాత్మ.

## 4 ఈక్షతి కర్మాధికరణము :-

శాంతి స్వరూపుడు, అమృత స్వరూపుడు, భయ
గొప్పవాడు - అని పరమాత్మ ధర్మములు చెప్పుట వలన
నకు కర్మ యయినవాడు పరమాత్మ - "త ద్విష్ణోః ప
సదా పశ్యన్తి సూరయః" - విష్ణువు యొక్క ఆ పరమప
నిత్యసూరులు నిరంతరము నిరీక్షించుచున్నారు' ఈ వె
ప్రమాణములచేత - ఆ వైకుంఠ స్థానమునుగురించి దృ
యుచున్నది. కావున, ఈక్షతి కర్మగా నిర్దేశింపబడిన
త్మయే.

### 5 దహరాధికరణము .-

అపహత పాప్మత్వము మొదలైన అసాధారణ ధర్మముల వలన - దహరాకాశము పరమాత్మయే. సకల ప్రజలకు వినబడుచున్న ప్రతి దిన గమనము, బ్రహ్మలోక శబ్దము, దహరాకాశము - పరమాత్మ యనుటకు సరియైన సూచకము. జగద్ధరణ రూప మయిన పరమాత్మ మహిమ - దహరాకాశమందు లభ్య మగుటచే, దహరాకాశము పరమాత్మ సర్వభూతాధిపతి పరమాత్మ ధర్మ విశేషతము పరమాత్మ ఆకాశ శబ్దము దహరాకాశమునకు జగద్విధరణత్వాదులవలె - జీవాత్మ స్వరూపావిర్భావమును కలిగించు రూపమైన సంపద్విశేషమును ప్రతిపాదించుట కొఱకు జీవ పరామర్శము ఉపాసన కొఱకు దహరమని - అల్పాశ్రయత్వ శ్రవణము వలన, అవి జీవునకు అన్వయించును ఉపాసకుడు పుణ్య పాప రూపము లయిన కర్మలను వదలి, సూక్ష్మ ప్రకృతి విముక్తుడై, అపహత పాప్మత్వాది గుణములతోడ సాదృశ్యమును పొందుచున్నాడు.

"ఇదం జ్ఞాన ముపాశ్రిత్య - మమ సాధర్మ్య మాగతాః"

ఈజ్ఞానము నుపాసించి, నా సాధర్మ్యము నొందుచున్నాడు' - అని గీతాసూక్తి

### 6 ప్రమితాధికరణము :-

"ఈశానో భూత భవ్యస్య" అను శబ్దమువలన - అంగుష్ఠ మాత్ర పరిమాణము కలవాడు పరమాత్మయే. మనుష్యుని హృదయము అంగుష్ఠ మాత్ర ముండును. కనుక, దానినిబట్టి, అపరిచ్ఛిన్నుడయిన పరమాత్మకు అంగుష్ఠ ప్రమితత్వము నిరూపితము.

**7. దేవతాధికరణము :-**

ఉపాసన నిర్వహణ సామర్థ్య ముండుట వలన, దేవాదులకు పరబ్రహ్మోపాసనయందు అధికార మున్నది. 'సౌభరి' మొదలగు వారికి ఒకేసారి–అనేక శరీర పరిగ్రహణము కనబడుటవలన–ఒకనికి ఒకసారి మాత్రమె గాక, అనేక యాగములందు సన్నిధానము సిద్ధించును, వైదిక శబ్దము నందును విరోధము లేదు. వేద శబ్దములనుండియే దేవాదులను బ్రహ్మ సృజించెను. కనుకనే - వేదమునకు నిత్యత్వము, దేవాదులకు బ్రహ్మవిద్యయందు అధికారము–ప్రాప్తించెను.

**8 మధ్వధికరణము :-**

వస్వాద్యవస్థతో గూడిన పరబ్రహ్మయే ఉపాస్యుడగుట వలన, వస్వాదులకు స్వావస్థతో గూడిన పరబ్రహ్మను సంధానము నందు విరోధము లేకపోవుటవలన, కల్పాంతరమందు వస్వాదు లగుట-ప్రాప్యముగా విరోధము లేకపోవుట వలన, మధువిద్యయందు వస్వాదులకు అధికారము కలదు. జ్యోతి శ్శబ్దవాచ్యు డయిన పరమాత్మయుపాసనయందు - దేవతలకు అధికార ముండును కనుక, వస్వాదులకు మధువిద్యాదులందు అధికారము కలదు. సంపూర్ణమైన మధువిద్యయందు - బ్రహ్మవిద్యాత్వము కల దని తోచును.

**9 అపశూద్రాధికరణము :-**

శూద్రునకు బ్రహ్మవిద్య యందు అధికారము లేదు. ఇట శూద్రుఁ డనగా–ఒక వర్ణమునకు జెందినవాడని యర్థము కాదు. బ్రహ్మజ్ఞానము లేనివాడని తాత్పర్యము. బ్రహ్మజ్ఞానము లేనివాడు

శూద్రుడుగా పరిగణింపబడుననియు, అట్టి యతడు - బ్రహ్మవిద్యను పొందుటకు అర్హత కలవాడుకాడనియు యోగులు నిర్వచించి యున్నారు.

## 10 అర్థాంతరాదిత్వాదివ్యపదేశాధికరణము .-

పూర్వము అంగుష్టప్రమితమునకు పరమాత్మత్వము సాధిం బడినది నామ రూపము లంటనివాడు పరమాత్మ. అతడు అమృ స్వరూపుడు ఆకాశ శబ్ద వాచ్యుడు జీవాత్మకంటెను ఇతరుడు నిరుపాధిక బ్రహ్మత్వ - అమృతత్వాదులు జీవునకు లేవు

# ప్రథమాధ్యాయ - చతుర్థ పాదము

పరబ్రహ్మ స్వరూప ప్రతిపాదకమైన ప్రథమాధ్యాయమున జగ జ్జన్మాది కారణత్వము బ్రహ్మలక్షణ మని చెప్పబడినది మొద పాదము సంభవ శంకా నివారకము కాగా, ద్వితీయ పాద, తృతీ పాద - చతుర్థ పాదములు అతివ్యాప్తి శంకా నివారకములు అ చున్నవి స్పష్టతర శివాది లింగవాక్యము లిపుడు చతుర్థ పాదమ విచారింపబడుచున్నవి

## 1 అనుమానికాధికరణము :-

పరమాత్మోపాసన సిద్ధించుటకు వశ్యేంద్రియ మావశ్యకమ ఆత్మ, శరీరము, బుద్ధి, మనస్సు, ఇంద్రియములు, విషయములు అ

నవి - రథిగా, రథముగా, సారథిగా, పగ్గముగా, గుఱ్ఱములుగా, మేయు భూమిగా - నిరూపింపబడినది. అంతర్యామి యగుటచేత, ఉపాసకు నకు ఉపాయ మగు నని ఆ పరమాత్మ స్వాధీనపరచుకొనుటయందు పరమావధి యగుటచేత, "పురుషా న్నపరం కంచిత్" అని చెప్ప బడినాడు అవ్యక్తశబ్దముచే - శరీరము చెప్పబడును - అనగా - పరమాత్మ-శరీర మని తాత్పర్యము

**2 చమసాధికరణము -**

'అజ' శబ్దముచేత-బ్రహ్మాత్మికమయిన ప్రకృతి చెప్పబడు చున్నది "అజా మేకాన్" అని - పరమాత్మ కారణముగా గలది ప్రకృతి అచిత్య మనగా - పుట్టుక లేనిది బ్రహ్మాత్మకమే యిచ్చట ప్రత్యభిజ్ఞాత మగుచున్నది పరమాత్మకారణత్వమునే జ్యోతి రుపక్ర మశ్వ మందురు కార్యావస్థయందును, కారణావస్థయందును పరమా త్మయే చెప్పబడుచున్నాడు

**3. సంఖ్యోపసంగ్రహణాధికరణము -**

"పంచ పంచ జనాః" అని - పంచ వింశతి సంఖ్య - గ్రహింప బడినను, ఈ తత్త్వములు సాంఖ్య తంత్రే సిద్ధములు కావు 'అవి యైదు' 'సప్తర్షులు' అను వాని వలె - సంఖ్యా విషయములగు పంచజన సంజ్ఞ కలవి "యస్మిన్ పంచ పంచ జనా ఆకాశ శ్చ ప్రతి ష్ఠితః" అని - యచ్ఛబ్దముచేత నిర్దేశింపబడిన బ్రహ్మ ఆధార మగుట వలన, బ్రహ్మయందు ఆధేయములుగా గల తత్త్వములకు బ్రహ్మా త్మకత్వము తోచబడుచున్నది వాక్య శేషము వలన, పంచజన సంజ్ఞ ము లయిన పంచ పదార్థములు ప్రాణాదులు

### 4 జగత్వాదిత్వాధికరణము -

చేయబడుచున్నది గనుక - 'కర్మ' యనబడును "క్రియత ఇతి కర్మ" జగ ద్వాచకమగుట వలన - సకల జగము ఎవని కార్యమో, ఆ పరమ పురుషుడు తెలిసికొనదగినవాడు పరమాత్మ అతడే మూల కారణము సర్వము ఆతని కార్యమే

### 5 వాక్యాన్వయాధికరణము ..

సకల వాక్యములు పరమాత్మయందు అన్వయించుటవలన ద్రష్టవ్యుడుగా చెప్పబడినవాడు పరమాత్మయే 'ఈ సర్వము ఎయదియో - అది ఆత్మ ఆ యాత్మయే పరమాత్మ ప్రసిద్ధ మయిన మహాభూతమయిన ఆ పరమాత్మయొక్క నిట్టూర్పే వేదము. వే వేద్యుడు ఆ పరమాత్మయే. 'ఎవరి క శరీరము' అని . సర్వవాక ములు పరమాత్మయందు అన్వయించుచున్నవి సర్వమునకు పరమ త్మతో అపృథ క్సిద్ధి సంబంధ ముండుటచే, సర్వము పరమాత్మయంద అన్వయించును

### 6 ప్రకృత్యధికరణము ..

ఏక విజ్ఞానముచే సర్వ విజ్ఞానమునకు - మృత్పిండ ఘ శరావాది దృష్టాంతమునకు బాధకలుగకుండుట వలన, పరబ్రహ్మర ఉపాదానకారణము. ప్రకృతి శరీరకుడయిన పరమాత్మ - ఈ జ త్తును పుట్టించుచున్నాడు. సంకల్ప శక్తిచే జగత్తును సృజించుటవల, జగత్తునకు ఉపాదాన కారణము. నిమిత్తకారణము కూడ పరమ త్మయే తనకు తానే జగ దాకారముగా చేసికొనెను గనుక, నిమి

ఉపాదాన కారణములు రెండును పరమాత్మయే అవి భక్త నా రూపములు గల చిదచిత్తులతో కూడిన పరమాత్మ - సూక్ష్మావ నుండి పరిణామము వలన - స్థూలావస్థ నందుచున్నాడు - అని వేదాంతములు ఉపదేశించుచున్నవి

### 7. సర్వవ్యాఖ్యానాధికరణము :-

'యతో వా ఇమాని భూతాని జాయన్తే' ఇత్యాది శ్రు వాక్యములతో ప్రతిపాదింపబడిన పరబ్రహ్మయే - 'తన్మాద్వ్యస్త యతః' ఇత్యాది సూత్ర వాక్యములలో వర్ణింపబడుట వలన, వేదా తము లన్నియు - పరబ్రహ్మ పరములుగనే వ్యాఖ్యానము గావిం నట్లు స్పష్టము

## ద్వితీయాధ్యాయ - ప్రథమ పాదము

### 1. స్మృత్యధికరణము :-

వేదాంతము స్మృత్యుపబృంహణ సాపేక్షణ మైనను, అత్యం తము ఆప్తులైన మన్వాదులు రచించిన వేదాంతమునకు విరోధమ కాని స్మృతుల చేతనే వేదాంతార్థ నిర్ణయము న్యాయమైనది అట్లు కాని యెడల, అనేకములైన ఆ స్మృతులచేత ధర్మ స్వరూపము - పరమ పురుషారాధనపర మని చెప్పబడినది.

### 2 యోగప్రత్యధికరణము :-

యోగ స్మృతికి కపిల స్మృతి వలె వేద విరుద్ధత్వము సమా మగుట వలన, ఆదరింపదగినదియే. హిరణ్య గర్భుడను జీవాత్

కోటిలో చేరినవా డగుటవలన, భ్రమ సంభవించుటవలన - ఆ స్మృతియు భ్రాంతి మూలమైనది.

### 3. విలక్షణత్వాధికరణము .-

మాక్షికాదుల వలన (ఈగలు మొదలయినవాని వలన) ః క్షణముగా నుదయించుట ,కనబడుచున్నందున - పరబ్రహ్మకంటె విలక్షణమైన జగత్తునకు - పరబ్రహ్మ కార్య మగుట సంభవించు. సమస్త మయిన ఇంద్రియాదుల అభిమాన దేవతలు శ్రేయ. కొఱకు 'నేను' - అను - వాగింద్రియాదులందు ప్రవేశించుట కనబచున్నది ఇవి విలక్షణముగా ఇట్లు ప్రవేశించుటవలన, విలక్షణత్వ స్పష్టము. పరబ్రహ్మకంటెను విలక్షణమైన జగత్తునకు పరబ్రహ్మ కార్య మగుట సంభవము దీనివలన, అసత్కార్యము ప్రతిపాదిబడు నన్నచో - కాదు. ప్రళయమందు సర్వజ్ఞత్వాది విశిష్ట. పరబ్రహ్మకు జగత్తువలె సర్వజ్ఞత్వాదులు కలుగుటవలన, విరుద్ధ లగు అర్థము. అర్థములను బోధించుటవలన, వేదాంతవాక్యము సమంజసములగును. పరమాత్మ - సర్వమునకు అంతర్యామియగుట విరోధము లేదు. ప్రకృతికారణవాదము సంభవించదు.

### 4 శిష్టాపరిగ్రహాధికరణము :-

పరమాత్మ కర్మ వశ్యుడు కానందున, కర్మ వశ్యమైన జీవా కంటెను ఇతరుడు లోకమున రాజశాసనమునకు వశ్యులైన జే ఖారులకు - రాజ శాసనమును అతిక్రమించుటవలన కలిగిన ద. సంబంధ మున్నను, రాజశాసన శరీరుడైనను - తన శాసనము

పశ్యేషు కానందున ఎట్లు శాస్త్రోల్లక్రమణము వలన కల్గిన దుఃఖ సంబంధము లేదో, అటులనే యని తలంపవలయును అందువలన - జీవాత్మ పరమాత్మలకు వైలక్షణ్యము స్పష్టము.

**5 ఆరంభణాధికరణము :-**

కారణమైన పరమాత్మకంటెను - కార్యమైన జగత్తునకు అభేదము 'సర్వం ఖ ల్విదం బ్రహ్మ' 'త ద్దేదం తర్హ్యవ్యాకృత మాసీ త్తన్నామ రూపాభ్యాం వ్యాకృయత' మొదలగు శ్రుతులచే స్పష్టము చేయబడినది. మృత్తు కారణము, కార్యము - ఘటము ఘటము మృణ్మయ మగుటచే, కార్య కారణములకు అభేదము సిద్ధము. ఒక్క దేవదత్తుడే బాల్య-యౌవన-వృద్ధావస్థయం దుండును గదా ఉత్పత్తికి పూర్వమే కార్యము కారణము నందు అంతర్లీనమై యున్నది. 'సత్' ఉన్నదే ప్వకార్యముయొక్క రూపమున స్పష్ట మయినది. 'అసత్' లేనిది కార్యముగా స్పష్టము కాలేదు కదా ! తంతు సమూహమే పట మనబడుచున్నది తంతువులకు ఇతర మయి నది ఏదియు లేదు. అట్లే, జగ త్సర్వము బ్రహ్మమయ మగుటచే, కార్య కారణైక్యము స్పష్టము.

**6. ఇతర వ్యపదేశాధికరణము :-**

క్షీరము దధిగా మారుటకు - ఇతర సహాయాపేక్ష లేకుండు టచే, పరమాత్మకు ఒక్కనికే జగత్కారణత్వము సిద్ధించుటలో - సంశయమేమియు లేదు. దేవతలు సంకల్పానుసారముగ సృజింపగలరు గదా ! అట్టి శక్తులు పరమాత్మకు అనంతములు.

"పరాస్య శక్తిః వివిధైవ శ్రూయతే
స్వాభావికీ జ్ఞాన బలక్రియా చ"

రమాత్మకు జ్ఞాన క్రియా శక్తి బలాదు లనేకములు కలవని -
ుతి చెప్పుచున్నది.

కృత్స్నప్రసక్త్యాధికరణము .-

సకలేతరకారణము కంటెను విలక్షణుడైన పరమాత్మ -
ర్వశక్తియుక్తుడు పరమాత్మ - నిరవయకమైనను - కారణము,
ార్యము అగును ప్రత్యేకించియు ఉండును. వస్తువులు పరిమిత
క్తులు గలవి. పరమాత్మ - అనంత శక్తి యుక్తుడు. సకలేతర విల
ంణుడు చేతనాచేతనములయందు ఆవరించియున్నాడు చేతనా
తనములకంటెను విలక్షణుడు. ఏ దోషములు అంటనివాడు. సర్వ
ార్య కారణ భూతుడు హేయ గుణములు లేనివాడు.

ప్రయోజనవత్వాధికరణము :-

బాలునకు కంచుక క్రీడ వలె (బంతి యాట వలె) - పరమా
్మకు సృష్టి స్థితి లయములు - లీలా విశేషములు. కేవలము ఆతని
ంకల్ప మాత్రమున - సృష్ట్యారంభ మగును. ఆతని లీలా విశేష
ున అట్టి జగత్సృష్టి-విస్తృత మగును. ఆ పరమాత్మ - దేవ,
ానవ, పశు, పక్ష్యాది జీవరాసు లన్నింటియందును - సమ భావము
్తో యుండును జీవాత్మలు - ఇంతకు మున్ను జీవులుచేసిన సుకృత-
ుష్కృత కర్మలకు తగిన ఫలముగా - ఆ యా జీవులను మానవు
ంగా, పశువులుగా, పక్షులుగా, మృగములుగా ఉద్భవింపజేయు
ున్నాడు.

## ద్వితీయాధ్యాయ - ద్వితీయ పాదము

**రచనానుపపత్త్యధికరణము :-**

ప్రధానమునకు విచిత్రమైన జగద్రచనానుగుణమైన - సంచ రూపమైన ప్రవృత్తి - ఉపపన్నము కాకపోవుట వలన, ప్రధా ము కారణము కాదు కేవలము ప్రధానము జగత్కారణము కాదని గాంతము. ఆవుచే తినబడిన గడ్డియు, త్రావిన నీరును - పాలుగా ారినట్లు, ప్రధానము జగద్రూపమును దాల్చునన్నచో, అది సరి దు వృషభాదులచే భక్షింపబడిన తృణాదులు - పాలుగా పరిణ ుచునుగదా ! (ఈ యధికరణమున — సాంఖ్య మతము నిరాక పబడినది.)

**మహద్దీర్ఘాధికరణము :-**

అవయవములు కలిసికొనబడినవియై, పెద్దవి యగు అవయవిని ష్టించుచున్నవని - పరమాణువులయందును ఉత్పాదకశక్తి కలదని ంగీకరింపవలసియుండును. అటులైనయెడల, పరమాణువులును సావ ంవములై, తమ అవయవములచేత ఏర్పడును. దాని అవయవము ను అట్లే - అని, ఒకచోటకూడ కారణత్వమునకు పర్యవసానము దురదు. కనుక, పరమాణు కారణ వాదము సమంజసము కాదు. మవాయ సంబంధ మంగీకరించుటచేత, పరమాణు కారణ వాదము సమంజసము అవయవము, అవయవి - అనునది రెండును నిత్య ంగా నుండుటవలన, కార్య కారణ భావము సిద్ధింపదు. (ఈ యధి ణమున వైశేషిక వాదము నిరసింపబడినది )

### 3. సముదాయాధికరణము :-

శుక్తికాదులందు రజిత మగు అవిద్యచే రజతాద్యుత్పత్తి సంభవించును. పూర్వము తెలిసికొనినవాడు నశించుటచేత - తెలిసికొనని రెండవవానిచేత పూర్వము నశించునని తెలిసికొనినవానిచేత, తలంచిన పదార్థములను స్వీకరించుట సంభవింపదు. సంస్కారాశ్రయముగా ఒక పదార్థము స్థిరముగా అంగీకరింపబడుటవలన, జగదుత్పత్తి లోక వ్యవహారము ఉపపాదింప సాధ్యముకాదు. సకల భావ పదార్థములకు అప్రయత్నముగనే (క్షణికత్వ మంగీకరించినచో - ) ఐహికము ఆముష్మికము నగు సంసిద్ధి కలుగును. అట్లు లోక వ్యవహారమున లేదు కదా ! (ఈ యధికరణమున - సౌగతులు నిరసింపబడినారు.)

### 4 ఉపలబ్ధ్యధికరణము :-

అమూర్తములైన క్రియాదులకు కర్తృ కర్మలచే నిరూపింపదగిన స్వాకారము కలవానికి - కర్మాకారత్వ మాశ్రయింపబడినది. స్వప్న - జ్ఞానములు జాగరిత జ్ఞానములే యథార్థములే. అర్థ శూన్యమైన కేవల జ్ఞానము ఎచ్చటను కానరాదు (ఈ యధికరణమునందు- మాధ్యమిక మతము నిరాకృతము.)

### 5 సర్వథానుపపత్త్యధికరణము :-

లోకమందు భావాభావములు, భావాభావ జ్ఞానములు - ప్రమాణముచేత లభించుచున్న వస్తువు యొక్క అవస్థా విశేషమే -

భావ రూపమైన విషయము వర్తమానముగా లభించుచున్న అవ విశేషము భావ బుద్ధి విషయము అందువలన, దేనిచేనైనను శూ, త్వము సిద్ధింపదు (ఈ యధికరణమునందు - మాధ్యమిక సిద్ధాంత. నిరాకరింపబడినది )

## 6 ఏకస్మిన్నసంభవాధికరణము –

ఒక కాలమందు మరియొక కాలము ఎటు లుండునో - అలనే, విరుద్ధ ధర్మములు ఒకదానియందు ఒక కాలమున నుండ ఒక వ్యక్తికి ఉత్పత్తి, వినాశము కాల భేదముచే కలుగును ఒ కాలమున కాదు అందుచేత, పరిణామ శక్తి యోగ ముంపు గొప్ప శరీరము నుండి ఆత్మ అల్ప శరీరములో చేరునపుడు - అ పూర్ణత్వము ప్రసక్తమగును ఈ యధికరణమునందు జైన మత అసంగతమైనదని నిరూపింపబడినది

## 7 పశుప త్యధికరణము –

వేద విరుద్ధమైన దగుట వలన – పశుపతి మతము అనా ణీయము జీవాత్మకు తన కరణ కళేబరాధిష్ఠానము - పుణ్య రూపమయిన కర్మ నిమిత్తమయినందున, దాని వలె - ఈశ్వరు, అట్టి అధిష్ఠానమే ఉండుట వలన, పుణ్య పాప ఫల భోగాదు లన వించు జీవునకు వలెనే ఆ యీశ్వరునకును అనుభవించు స్వభావ గలవాడనుటచే, సృష్టి స్థితి సంహార కారణుడైన పరమాత్మకు అట్టి జీవాత్మ గుణములు అంటవు గనుక, పాశుపత మతము నిరా ణీయము

8 ఉత్పత్త్యసంభవాధికరణము -

ఉత్పత్తి లేని జీవునకు - పుట్టుకను చెప్పుట వలన, పాంచరాత్రాగమ ప్రమాణము లన్నచో - కాదు పరమాత్మ తన ఇచ్ఛానుసారముగ అవతరించుటను ప్రతిపాదించుటచే, శ్రుతి విరోధము లేదు. జీవాహంకార మన శ్శబ్దములు - తచ్ఛరీరకులైన సంకర్షణాదులం ప్రతిపాదించుచున్నవి కనుక, వేదాంతోక్తరీత్యా - పరమాత్మోపాసనను విధించు పాంచరాత్ర తంత్రము ప్రామాణికమే యగును

## ద్వితీయాధ్యాయ - తృతీయ పాదము

1 వియ దధికరణము -

శ్రవణము లేనందున ఆకాశము ఉత్పన్నము కాదు'-అన్నచో ఉత్పన్న మగును ఎట్లన్నచో-పరమాత్మ నుండి ఆకాశ ముత్పన్నమైనదని-"ఆత్మన ఆకాశ స్సంభూతః" అను శ్రుతి వాక్యము స్పష్ట చేయుచున్నందున - ఆకాశోత్పత్తి గౌణము కాదు. అట్లన్నచో ఏక విజ్ఞానముచే సర్వ విజ్ఞానము సిద్ధించు నను భగవానుని ప్రతిఃభంగము కలుగును. శబ్ద బ్రహ్మము వలన ఆకాశోత్పత్తి జరి7 ఇందుచే, ఆకాశము బ్రహ్మ వలన కలిగినట్లు తెలియుచున్నం ఆ బ్రహ్మ కంటెను ఆకాశము వేరు కాదని స్పష్టము.

2 తేజో౽ధికరణము :-

ఆకాశాదులు సర్వము పరమాత్మకు శరీరము సర్వ వాచ్యుడగు పరమాత్మ వలననే తేజస్సు మొదలగు వాని యుత్

ఆ పరమాత్మ సంకల్పము వలననే పుట్టినవి బహువిధములుగ
ల్పించుట - పరమాత్మకే సంభవము. అతడు బహు విధ శరీ
డగుటచే, బహు విధములుగా నుండి, సంకల్పించును.

### 3 ఆత్మాధికరణము -

జీవాత్మ పుట్టదు అది నిత్యము - అని శ్రుతులు బోధి
చున్నవి. జీవాత్మ లుదయించునన్నచో, చేసిన కర్మ ఫలము సిద్ధి
కుండుటయు - చేయని కర్మ ఫలము సిద్ధించుటయు - ప్రసక్త
టచే, భగవంతునకు వైషమ్యము, నిర్దయత్వము - ఏర్పడును
కాదు కదా ! కనుక, జీవునకు స్పష్టవాక్యము - జ్ఞానవికారం
యర్థము.

### 4 జ్ఞాధికరణము :-

జీవాత్మ జ్ఞానాశ్రయు డని శ్రుతులు బోధించుచున్నవి అత
బద్ధ-ముక్త - ఉభయ అవస్థలం దున్న ఆత్మజ్ఞానాశ్రయుడే
గతత్త్వము, అణుత్వము - ఆతని లక్షణములు పరిగింజను
కొనలో సమానుడు చందన బిందువు ఏదేహావమం దొకచో
నున్నను — సకల దేహమునం దెట్లు ఆనందము కలిగించునో,
లచే-జీవాత్మయు ఉండును. ఒకచోటనే యుండి, అంతట ప్రకా
చును. జ్ఞానము ఆత్మ యొక్క గుణము.

### 5 కర్త్రాధికరణము ..

స్వర్గాపవర్గ సాధనానుష్ఠానమును విధించుచున్న శాస్త్రము
ప్రయోజనము కలుగుటకై, ఆత్మయే కర్త. జ్ఞానము కలవా

ననము. అది అచేతనమైన ప్రధానమునకు ఉండదు కావున, తమైన ఆత్మకే కర్తృత్వ మని సిద్ధాంతము.

**. పరాయత్తాధికరణము :-**

జీవకర్తృత్వము స్వాధీనమా ? పరమాత్మాధీనమా ?' అన్నచో- రమాత్మాధీనమే. ఏల ననగా, జీవుల లోపల ప్రవేశించి, నియ ంచువాడు పరమాత్మ.

"అన్తః ప్రవిష్ట శ్శాస్తా జనానాగ్ం సర్వాత్మా."

ఇత్యాది శ్రుతి వాక్యములే ఇందులకు ప్రమాణములు. ఈ కారణమునుబట్టి, జీవాత్మ కర్తృత్వము పరమాత్మాధీన మనియు, పరమాత్మయొక్క నిగ్రహానుగ్రహములకు జీవుడు బద్ధుడై యుండు ననియు - స్పష్టము.

**7. అంశాధికరణము .-**

పరమాత్మకు - సర్వజ్ఞత్వాది విశిష్ట గుణము లుండుటచే, పరమాత్మ - జీవునకంశను విశిష్టుడు. పరమాత్మకు జీవాత్మ శరీ రము పరమాత్మ శరీరి పరమాత్మాంశము జీవాత్మ విడదీయుటకు వీలుగాని సంబంధము - పరమాత్మ - జీవాత్మల సంబంధము. పరమా త్మకు చిదచిత్తులు శరీరములు ఆత్మ లన్నియు - పరమాత్మాంగములే. అయ్యవి - సర్వాంతర్యామి యగు పరమాత్మ యాదేశానుసారమే ప్రవర్తించుచుండును

## ద్వితీయాధ్యాయ - చతుర్థ పాదము

### 1 ప్రాణోత్పత్త్యధికరణము :-

జీవాత్మలు ఎటుల ఉత్పత్తి యగుటలేదో, అట్లే - ప్రాణములును ఉదయించవు ప్రాణ శబ్ద వాచ్యుడు పరమాత్మయే కనుక, ప్రాణోత్పత్తి-నూతనముగా జరుగుటలేదని సారాంశము.

### 2 సప్తగత్యధికరణము .-

జ్ఞానేంద్రియములు అయిదు, కర్మేంద్రియములు ఐదు - మరియొకటి మనస్సు వెరశి మొత్తము పదునొకండని, శ్రుతి - స్మృతుల వలన ప్రతిపాదింపబడినది జ్ఞానేంద్రియ పంచకమునకు, మనస్సునకును - వాని వృత్తిరూపమైన బుద్ధికి ప్రాధాన్య ముండుట వలన వాక్కు- మొదలగు కర్మేంద్రియములకు జీవాత్మతో గమనము లేనందువనే ఇంద్రియములకే ప్రయాణ కాలమున గతి శ్రవణములన్నచో-కాదు వాక్కు, హస్తము-మొదలగు కర్మేంద్రియములు శరీరమంటుండగా, శరీరముతో నుత్పత్తి-వినాశము కలవియై, ఉపకారకము లగును. జ్ఞానేంద్రియ పంచకము, మనస్సు, జీవాత్మతో - శరీరాంతర్గత గమనము నందుచు, వెంటనంటి పోవుచుండును శ్రోత్రాది జ్ఞానేంద్రియము లైదు, కర్మేంద్రియము లైదును కలసి, ఏకాదశేంద్రియములు - సప్తేంద్రియములు కావు.

### 3 ప్రాణాణుత్వాధికరణము :-

ఇంద్రియములు అణు పరిమాణము కలవి జీవాత్మ పోవుచుండగా, ఇంద్రియము లన్నియు వెంటనే వెడలిపోవును' అను శ్రుతి

వలన, పరిమితము తౌట వలన, ఏ యొకరికిని కానరానందున ఇంద్రియములు అణుపరిమాణము కలవి యని స్పష్ట మగును.

### 4 వాయుక్రియాధికరణము

తేజస్సు మొదలగువానిలో కానరానందున, చక్షురాది కరణములతోఁగూడ జీవాత్మోపకరణము నుపదేశించుట వలన, ఉచ్ఛ్వాస నిశ్వాస రూపమైన వాయు క్రియా మాత్రము ముఖ్య ప్రాణ కాదు, ప్రాణాది వృత్తి భేదము వలన, ప్రాణమే ఐదు విధములు నిర్దేశింపబడుచున్నది ఆ ప్రాణము మొదలు-సమాన పర్యంతరవ అంతయును ప్రాణమే

### 5 శ్రేష్ఠాణుత్వాధికరణము ...

శరీరమునుండి వెడలిపోవుచున్న జీవాత్మ ననుసరించి-ప్రాణ పోవుచుండును'-అని శ్రుతి చెప్పుటవలన, ప్రాణము అణుపరిమాణ కలది' అని నిశ్చయించుచుండ, ఆత్మ లన్నింటికి ప్రాణాయత్తస్థితి యుండుట వలన, ఆనందము వైభవ వాదము.

### 6. జ్యోతిరా ద్యధిష్ఠానాధికరణము ...

పరమాత్మ అగ్నియం దున్నవాడై, నియమించుచున్నాడ అను శ్రుతి వలనను, పరమాత్మ జీవాత్మ యందున్నవాడై నియ చుచున్నాడు' - అను శ్రుతి వలనను - అగ్న్యాదుల యొక్క జీవాత్మ యొక్కయు ఇంద్రియాధిష్ఠానము పరమాత్మ సంకల్పాం మని సిద్ధాంతము.

ఇంద్రియాధికరణము :-

ముఖ్య ప్రాణవ్యతిరిక్తము లగు ప్రాణ శబ్ద నిర్దిష్టములు ఇంద్రి యములు వాక్కు మున్నగు ఇంద్రియములు పది. పదునొకండవది మనస్సు - అనియు, ప్రాణము లనియు - నిర్దేశించుట - ప్రాణము కు అధీనమైన వృత్తి కలవగుటచే, ప్రాణవర్తన రూపమైన వృత్తిపై సామ్యము వలన, ముఖ్య ప్రాణమును వదలి, రాగాది ఇంద్రియము నబడుచున్నవి.

సంజ్ఞామూర్తిక్లుప్త్యధికరణము :-

త్రివృత్కరణము పరమాత్మ కృత్యము. నామ రూపములు ల్గించినవి పరమాత్మయే' అని శ్రుతులు బోధించుచున్నవి. విస్తృత మయ్యెద నని సంకల్పించి, విస్తృతమైన జగత్తునందు తానే ప్రవే రచి, నామ రూపములు కలుగునట్లు పరమాత్మ కావించెను. తదనం రము - ఆతని యాజ్ఞానుసారము - చతుర్ముఖాదులు సృష్టినారం ంచిరి.

## తృతీయాధ్యాయు - ప్రథమ పాదము

తదంతర ప్రతిపత్త్యధికరణము :-

జీవాత్మ - దేహాంతర గమనమందు - దేహమునకు కారణమ ైన భూత సూక్ష్మములతో కూడుకొనియే పోవుచున్నాడు. భూత యాత్మక మగుటచేత, అందు జల మధికముగా నుండును. అది రా తాంతరములతో గూడిన జలము. ఇంద్రియము లన్నియు - దానిని ుసరించి పోవుచుండును.

2 కృతాత్యయాధికరణము -

జీవాత్మ - కర్మఫలానుభవానంతరము - అనుభవింపగా మిగిలిన స్వల్ప కర్మ కలవాడై తిరిగివచ్చునని శ్రుతులు చెప్పుచున్నవి. కావున శేష కర్మ ఫలానుసారము జీవుడు తగిన జన్మను పొందుచున్నా డనుట స్పష్టము .

3 అనిష్టాధికార్యాధికరణము .-

పాపకర్ములకు - చంద్రారోహణావరోహణములు సాధారణముగ సంభవింపవు వేదోక్త కర్మ నాచరించని వాడు పాపులు వేదనిషిద్ధకర్మ నాచరించువాడును పాపులే వారు 'అనిష్టాధికారులు' అనబడుచుందురు చంద్రమస గమన మున్నను-సమానము కాదు. ఆరోహణ-అవరోహణములందు యమ శాసనమందును-దానివలన కలిగిన-బాధ ననుభవించియే పాపాత్ములకు యమ లోకమున కానవచ్చుచున్నందున, ఈ పాపులందరు యమునకు స్వాధీనులగుచున్నారుకదా ! అని-పరాశరుడు తలంచుచున్నాడు పాపులు బోవు రౌరవాది సప్త నరక స్థానములును స్మరింపబడినవి. కేవలము పాపము చేయువారలు - చంద్ర లోకమునకు పోజాలరు

4 తత్స్వాభావాపత్త్యధికరణము :-

చంద్రుని పొంది, ఈ లోకమునకు తిరిగివచ్చునపుడు జీవుడు ఆకాశాదులతో సాదృశ్యమును పొందుచున్నాడు. ఆకాశాది

శరీరమును పొందుట లేదు ఆకాశాది సంబంధము వలన కలుగు త త్సాదృశ్యమును బట్టి, ఇతడు త ద్భావమును పొందుచున్నాడు

**5 నాతిచిరాధికరణము .-**

జీవునకు ఆకాశమునుండి నిర్గమనము శీఘ్రముగనే కలుగును

"అతో వై ఖలు దుర్నిష్ప్రపతరమ్"

అనగా - వ్రీహ్యాదులనుండి జీవుడు కష్టముతో బయలువెడలు చున్నాడు' అను శ్రుతివాక్యమునుబట్టి, ఆకాశా ద్యవస్థలయందు స్వల్ప కాలముండు నని భావము.

**6 అన్యాధిష్ఠితాధికరణము .-**

జీవుడు ఆకాశ వాయ్వాదులతో ఎట్లు సంబంధమును మాత్రము పొందుచున్నాడో - వ్రీహ్యాదులందును అట్లే సంబంధము మాత్రము పొందుచున్నాడు ఆ రూపములతో జన్మించుటలేదు ఈ లోకమునకు తిరిగివచ్చిన యనంతరము - యోనిని పొందిన తర్వాత, శరీరము దాల్చుచున్నాడు శరీరమునందే సుఖ దుఃఖ ఫలముల ననుభవించుచున్నాడు

## తృతీయాధ్యాయు - ద్వితీయ పాదము

**1 సన్ధ్యాధికరణము .-**

ఆశ్చర్యకరమైన స్వప్న సృష్టి - పరమాత్మచే నిర్మితము. అది జీవునిచే - ఆ సమయమున - అనుభవింపబడుచున్నది. పర

మాత్మ సంకల్పము వలననే జీవునకు బంధ - మోక్షములు కలుగు చున్నవి దేహ సంబంధము వలనను, ప్రకృతి సంబంధము వలనను - జీవునకు స్వాభావిక రూపము తిరోహిత మగుచున్నది

**2. తదభావాధికరణము -**

స్వప్నాభావము' అనగా - సుషుప్తి నాడులయందు, ఆత్మ యందును కలుగును అనగా - నాడిపురీ త ద్బ్రహ్మలు సుషుప్త స్థానములు. బ్రహ్మయే సాక్షాత్తుగా - సుషుప్తి స్థాన మగుటచే, ప్రబోధ సమయమున జీవుడు బ్రహ్మమునుండి వచ్చుచున్నాడు

**3 కర్మానుస్మృతి సంభవాధికరణము :-**

సుషుప్తి స్థానమును పొందిన జీవుడు - బద్ధుడే యయి, తత్కాలమునందు విరమించిన యింద్రియ వ్యాపారములు గలవాడై, జ్ఞాన భోగాదులందు అశక్తుడై, శుభాస్పదు డగు పరమాత్మను పొంది, కొలదిగ విశ్రమించి, మరల కర్మానుభవమునకుగాను - మేల్కొను చున్నాడు

**4. ముగ్ధాధికరణము .-**

మూర్ఛితుడైన పురుషునియందు ఏ యవస్థ కలదో, అది - మరణావస్థలో సగము ఏల ననగా - సర్వ వ్యాపారములు భావింప బడుటచే,- జాగరా ద్యవస్థ కాదు. కొంచెము ప్రాణముండి, మరల లేచుట వలన, మరణావస్థ కాదు. కనుక, మరణావస్థయందు అర్థ భాగము మూర్ఛావస్థ.

**5 ఉభయ లింగాధికరణము –**

సర్వ నియామకుడు– సర్వాంతర్యామియు నైన పరమాత్మ అనంత కల్యాణ గుణ స్వరూపుడు జీవుని యందు అంతర్యామిగా నున్నను–పృథివి యందు అంతర్యామి యయినవారి దోషము లంటని వాడు హేయ ప్రత్యనీకుడు కల్యాణ గుణములుగలవా డగుటచే – ఉభయ లక్ష్యములు కలవాడు

**6 అహికుండలాధికరణము :–**

సర్పము యొక్క కుండలాకారము వలె – బ్రహ్మ స్వరూపమే అచిద్రూపముగా నున్నది నానా త్వైక్యకత్వములు అతనికి చెప్పబడి నవి జీవాత్మ వలె పరమాత్మ శరీర మగుటచే, పరబ్రహ్మ విశేషము గాన, చిద్వస్తువునకు బ్రహ్మాంశత్వము సిద్ధము పరబ్రహ్మకు అచి ద్ధర్మములు నిషేధించుటవలన, విశేషణ విశేష్య భావముచేతనే అంశాంశి భావము

**7 పరాధికరణము –**

పరుడై, జగన్నిమిత్త – ఉపాదాన రూప పరమ కారణమైన పరమాత్మకంటెను మరియొక పరతత్త్వము కలదన్న యుక్తులు – కుయుక్తులు. ఉపాస్యమైన పరబ్రహ్మయొక్క నిర్దోషిత్వ – నిరతి శయ – అనంత కల్యాణ గుణాకరుడు పరమాత్మయొక్క సర్వజ్ఞ త్వము నెఱుగుట సాధ్యము కాదు. అయ్యది – అనంతము సంపూర్ణ ముగ దాని నెరుగజాలనివారు, ఎరుగనివారలు – పరమాత్మకు పరి

ఖితత్వమును ఆపాదించి, పరమాత్మకంటెను పరుషు కల డనుచు, పరిహాసించబడుచున్నారు.

8 ఫలాధికరణము .-

కర్మలచేతను, ఉపాసనచేతను ఆరాధింపబడిన పరమాత్మ - ఫలమును ప్రసాదించును. క్షణికమైన కర్మ-కాలాంతర ఫలమైనచో - మోక్షమునకు సమర్థులు కాదు.

## తృతీయాధ్యాయ - తృతీయ పాదము

1. సర్వవేదాంత ప్రత్యయాధికరణము :-

విధి స్వరూప ఫలాదులు సమానముగా నుండుటవలన, సమస్త వేదాంతములందును ప్రతీయమాన మగుచున్న దహరాది ఉపాసనము ఒక్కటి మాత్రమే 'దహరాకాశ శబ్దవాచ్యుడైన పరమాత్మయందు ఎయ్యదికలదో - అని విధింపబడిన అపహత పాప్మత్వాది గుణాష్టకము ఛాందోగ్యమున చెప్పబడినది తైత్తిరీయోపనిషత్తులో - కేవలము - 'దహరాకాశ శబ్దవాచ్యుడైన పరమాత్మయందు ఎయ్యది కలదో - అయ్యది ఉపాసింపదగినది' అని చెప్పబడినది.

2 అన్యథాత్వధికరణము :-

బృహదారణ్యకమునందును, ఛాందోగ్యమునందును - ఉద్గీథ విద్య కలదు. ఒక శాఖయందు పఠింపబడినదే యయ్యును - పరోరీయస్త్వాది గుణ విశిష్ట మగు ఉద్గీథోపాసనము - హిరణ్మయ పురుష దృష్ట విశిష్ట మగు ఉద్గీథోపాసనము కంటెను ఎట్లు భిన్నమైనదో

అశ్లే - ఉద్గీథను ప్రాణ దృష్టితో ఉపాసింపవలె'నను వాజసనేయుల యుద్గీథోపాసనమును ఉద్గీవాదయన మగు ప్రణవమును ప్రాణ దృష్టితో ఉపాసింపవలె నన్న ఛాందోగుల యుద్గీథోపాసనమును - ఉపక్రమ భేదముచే భిన్నములు.

**3 సర్వ భేదాధికరణము .—**

ఛాందోగ్య - వాజసనేయులు - ప్రాణోపాసనమున విధించి యున్నారు వారిచే, ప్రాణ సంబంధములుగా పేర్కొనబడిన వశిష్ఠత్వాది గుణములు - కౌషీతకుల ప్రాణ విద్య యందు సైతము - ఉపాసింపదగినవి వాగాది యింద్రియములయం దుండు వశిష్ఠత్వాది గుణములకు హేతువు - ప్రాణము అందువలన, వాగాది ఇంద్రియ గతము లగు వశిష్ఠత్వాది గుణములతో సంబంధించినది కనుక, ఛంధోగ-వాజసనేయులు ప్రాణోపాసనముకంటెను - కౌషీతకుల ప్రాణోపాసనము భిన్నము కాదు.

**4 ఆనందా ద్యధికరణము —**

పరబ్రహ్మస్వరూపానుసంధానము-ఏ గుణములును లేక, ఉపపన్నము కాదు. అయ్యది - సర్వ బ్రహ్మ లందును అనుసంధేయములు. జ్ఞానానందాది గుణములు బ్రహ్మ స్వరూపమును నిరూపించు చున్నవి

**5. కార్యాఖ్యానాధికరణము .—**

ఆచమనీయములైన జలములకు-ప్రాణవాస స్త్వానుసంధానము లదని భావింపబడుచున్నది. 'జలములచేత వస్త్రము కలగానిలిగా

ేయుచున్నాడు, ఆచమనము - స్మృత్యాచార ప్రాప్తము జలము
కు ప్రాణవాసస్త్వానుసంధానము ప్రమాణాంతరాప్రాప్తము. సత్రు
ానము కాక, చేయుచున్నవారై, తలంచుచున్నారు' అనుటచే -
ానియందు - ఆచమానానంతర కల్పన కంటెను - ఆచమనము
నువాదించి, ఆచమనీయములైన జలములకు అప్రాప్తమైన ప్రాణ
ాసస్త్వానుసంధానము విధింపబడుచున్నది.

**6 సమానాధికరణము :-**

వాజసనేయమునందును, బృహదారణ్యకమునందును-శాండిల్య
ిద్య చెప్పబడినది. ఈ రెండింటియందును - మనోమయత్వాదికము-
సమానముగ నుండగా, వశిత్వాది గుణములు-సత్య సంకల్పత్వ వివ
రణరూప మగుటచే, వశిత్వాదులు సత్య సంకల్పముతో అభిన్నము
ాగుటవలన, రూప భేదము లేదు. కావున, ఆ రెంటియందు గల
శాండిల్య విద్య - ఒక్కటియే.

**7. సంబంధాధికరణము :-**

విద్యైక్యమువలన, రెండు విద్యలందు - నియతి లేక, రెండు
నామములను అనుసంధింపదగినవి యని, లేదు ఏల ననగా - రెండు
విద్యలందును ధ్యేయ రూపము వేర్వేరుగా నుండుటవలన, ఒక
కావున-ఆదిత్య స్థాన సంబంధము కలదియు,' మరియొక కావున -
అక్షిస్థాన సంబంధము కలిగిన బ్రహ్మ యందు - రూపభేదము వలన
విద్యా భేదము, దానికి అంగమైన నామానుసంధానమును - నియత

**8 సంభృత్యధికరణము :-**

'సంభృతి' యనగా - బాగుగా ధరించుట. ద్యువ్యాప్తి యనగా - స్వర్గమందు వ్యాపించియుండుట. బ్రహ్మయందు శ్రేయముల్లైన ఈ గుణములు - స్థాన విశేష సంబంధియైన ఉపాసనవ నారంభించి చెప్పబడినవి కాకున్నను, ద్యు వ్యాప్తి సామర్థ్యవ వలన, దానికి హృదయాది అల్పస్థానములందు ఉపసంహారము సంబ ధించనందున, మిగిలినవానికి దాని సాహచర్యము వలనను, వేరై, యల్ప స్థానములందు విధింపబడిన బ్రహ్మవిద్యయందు - ఉపసంహ రము లేదు.

**9 పురుషవిద్యాధికరణము :-**

ఛాందోగ్య - తైత్తిరీయములలో - రూప భేదము వలన, పురుష విద్య భిన్నమైనది. తైత్తిరీయమునందు చెప్పబడిన యజమాన - పత్న్యాదులు, సవనాదులు ఛాందోగ్యమునందు చెప్పబడినందున, యజ్ఞావయవములు తైత్తిరీయమునందు చెప్పనందున అను అర్థము ప్రకార భేదము వలన రూప భేదము స్పష్టము అట్లే ఫలముకూడ

**10 వేదాద్యధికరణము :-**

ఉపనిష దారంభమునందు - "శుక్రం ప్రవిభ్య హృదయం ప్రవిభ్య" - "శంనో మిత్రశ్శం వరుణః", "సహనా వవతు" మొద లగు మంత్రములును అధ్యయనము చేయబడుచున్నవి అయ్యవి - మంత్ర సామర్థ్యముచే, అధ్యయనమందు వినియోగము విద్యాంగ ములు కావు.

## 11. హాన్యధికరణము :-

పుణ్య పాపముల యొక్క కేవల విమోచనమందు, కేవల స్వీకార మందును - రెంటియొక్క సముచ్చయము తప్పక అంగీకరించ వలయును. ఉపాయనశబ్దము హానివాక్య శేష మగుట వలన, అంగీకరింపవలెను ఉపాయన వాక్యము వదలబడిన పుణ్య పాపముల యొక్క ప్రవేశ స్థాన వాచక మగుట వలన, హానివాక్యమునకు శేషము.

## 12. సాంపరాయాధికరణము :-

దేహ వియోదమైన తరువాత, బ్రహ్మప్రాప్తి కంటెను వేరుగా తరింపదగిన భోగము లేనందువలన, దేహ వియోగ కాల మందే - పుణ్య పాప హాని చింతనము భగవంతుని ఉపాసించువారికి - దేహ వియోగ కాలమందు - సకల కర్మ క్షయ మైనను - దేవయాన మార్గము ఉపపన్న మయ్యెను లోకమున - రాజును సేవించినవారికి - ప్రాకృత పురుషులకు సాధారణము కాని - అతి రమణీయమైన కార్యసిద్ధి యెటుల కలుగునో, అటులనే, - సర్వజ్ఞుడై, సత్య సంకల్పుడై, మహోదారకుడైన పరబ్రహ్మ నుపాసించు వారికి - సర్వము సిద్ధించును.

## 13. అనియమాధికరణము :-

ఏ విద్యయందు అర్చిరాది మార్గము చెప్పబడెనో. ఆ విద్యా నిష్ఠులకే అర్చించి గమన మని నియమము లేదు. బ్రహ్మవిద్యానిష్ఠ

లందఱకును-సమానముగ అర్చిరాది మార్గముచేతనే బ్రహ్మప్రా
శ్రుతి స్మృతు లట్లే తెలుపుచున్నవి కనుక, విరోధము లేదు

## 14 అక్షరాద్యధికరణము -

అక్షర సంబంధము గల అస్థూలత్వాది గుణములకు సకల వి
లందును గ్రహించుట కలదు అస్థూలత్వాది గుణములును, ఆ
దాది గుణములవలె - పరబ్రహ్మస్వరూపాను సంధానములో అంత
వించినవి యగుటవలన, సకల బ్రహ్మవిద్యలయందు ఉపసంహారము

## 15 అంతరత్వాధికరణము -

ఉషస్త, కహోళు లనువారు- పరమాత్మనుగూర్చి భిన్నరూ
మున యాజ్ఞవల్కుని ప్రశ్నించిరి యాజ్ఞవల్క్యుడు ఇరువురకు
ఒకే సమాధానమును చెప్పెను ప్రశ్నోత్తరములు రెండు చోట్లను
పరమాత్మ విషయములే రెండు తావులను సర్వాంతరాత్మ యగు ప
మాత్మయే సర్వ ప్రాణుల యొక్కయు ప్రాణన వ్యాపార మొనర్చు
వాడు గను, క్షుత్పిపాసాది రహితుడుగను ప్రతిపాదింపబడుచున్న
దున - రెండు తావులలో ఉపదేశింపబడిన విద్యల స్వరూపమ
ఒక్కటే సద్విద్య లందువు - ఇట్లే ప్రశ్నోత్తరములకు భే
మున్నను - విద్యైక్యము సిద్ధము

## 16 కామా ద్యధికరణము -

హృదయాంతర్గత మగు సూక్ష్మాంశమునే బోధించుటచే
ఛాందోగ్య వాజసనేయ శ్రుతులలో - విధింపబడిన దహరవిద్యలకు-
ఐక్యము సిద్ధము శాస్త్ర ప్రమాణము లయిన సత్యకామత్వాదుల

నుపదేశించుటచే, ఉపాసనములందు లోపము లేదు సర్వ లోకముల యందును స్వేచ్ఛా సంచారమును, ఫల భోగముగా ముక్తు లనుభ వించుచున్నారు కావున, సత్య కామ - సత్య సంకల్పాది గుణ ములు - ముముక్షువులచే ఉపాసనములందు ఉపాస్యములుగా - గ్రాహ్యములు

## 17 తన్నిర్ధారణానియమాధికరణము -

ఉపాసన మనగా - నిశ్చలముగ మనస్సును నిలుపుట - ఉద్గీ థోపాసన చేయువానికి, చేయనివానికిని - ప్రత్యనుష్ఠానము కలదు. స్వర్గాపులకంటెను వేరగు వీర్యవత్తరత్వ ఫలము కలది ఉద్గీథోపాసన మని గోదోహనాదుల వలె నియమము లేదు గోదోహన మనగా- ఆవు పాలు పిండు పాత్ర పశువుల అభివృద్ధిని కోరువారు - యజ్ఞ ములో - గోదోహన పాత్రను ఉపయోగింపవలె నని నియమము కలదు వర్తమాన నిర్దేశ మున్నను, అధికారాంతర నిశ్చయమగు చుండగా - రాత్రి సత్రము వలె క్రతువుకు వీర్యవత్తరత్వమే ఉద్గీ థోపాసన ఫల మని కల్పింపవలెను

## 18 ప్రదానాధికరణము .-

"ఇంద్రియ స్వారాజ్యః" స్వర్గాధిపతి యగు ఇంద్రుని కొరకు - అని - ఇంద్రుడు ఒక్కడే యైనను, రాజ త్వాది విశిష్టమైన ఆకార భేదముచేత, గీతా భేద మని ఎట్లు హరిః ప్రధాన వృత్తియో - అటు లనే గుణ భేదముచేత - గుణవిశిష్టావృత్తిభేదము సంకర్ష ణునిచే చెప్ప బడినందున, గుణవిశిష్టరూపమున - వే రగుట వలన, అనేక దేవత లని సూత్రార్థము.

## 19. లింగభూయస్త్వాధికరణము -

శ్రుతి, లింగము, వాక్యము, ప్రకరణము, స్థానము - సమాఖ్య అని-ఆరు ప్రమాణములలో - ఒకటికి మరి యొకటి కలసెన, అర్థము దూర మగును ఉత్తరోత్తర ప్రమాణములు దుర్బలముః పూర్వ పూర్వ ప్రమాణములు ప్రబలములు పరవిద్యోపాసనము నిర్ణయించుటయందు దానికి చిహ్నములైన వాక్యము లనేక, లుండుట వలన, ఆ వాక్యము-ప్రకరణము కంటెను బలీయమైనద

## 20 పూర్వావికల్పాధికరణము :-

'మన శ్చిత్' మొదలైన అగ్నులు - విద్యా రూపముః అని- రాజసనేయ మందలి అగ్నిరహస్య మందు చెప్పబడినది. ప్ర రణము వలన, క్రితు సంబంధ మయిన చిత క్రితువుతో ఉప మైన క్రతువుచే గృహీతమగుట వలన, దానికి అంగము లం యివియు - అగ్ను లగుట వలన, ద్వాదశాంగభూతమాన సగ్రహ వలె-అనగా-సోమపాన పాత్ర వలె, ఈ యిష్టికచితముతో ఐక్యః విద్యామయక్రిత్వతభూతములే మనశ్చితాదులు

## 21 శరీరే భావాధికరణము ,-

జీవాత్మకు పరమాత్మ-ఆత్మగా ఉపాసింపతగినవాడు ఉః కుని స్వరూపము నాత్మోపాసన స్వరూపము వలె తెలిసికొనదగి, అచ్చటను - ప్రత్యగాత్మకు ఆత్మయైన పరమాత్మోపాసనా విషయ మని ప్రజాపతి వాక్యమందు చెప్పబడిన జీవాత్మ యొ నికమైన స్వరూపమే యనుసంధింపబడినది

## 22 అక్షరం గావబుధ్యాధికరణము :-

ఉద్గాన కర్మయయిన ఈ ఓమ్' అను అక్షరము నుపాసింప వలెను' అని - ఉద్గీథాదులైన కర్మాంగకములకు ఉపాసనలు విన బడుచున్నవి ఆఉపాసనలు ఏ శాఖయందు వినబడుచున్నవో - వానియందే వ్యవస్థితములు కావు, భేద మున్నను - అచ్చటచ్చట ఉద్గీథ జాతీయత్వ సంబంధము వలన, సమాన మగుట వలనను - సర్వ శాఖల యందును సంబంధము కానవచ్చుచున్నది.

## 23 భూమజ్యాయస్త్వంతరాధికరణము :-

వైశ్వానర విద్యయందు స్వర్లోకాదిత్య వాయ్వాకాశ పృథి వ్యవయవములు కల వైశ్వానరాత్మ ఉపాస్య మని శ్రుతి - వైశ్వాన రాత్మయైన త్రైలోక్య శరీరకు డగు పరబ్రహ్మయొక్క ఉపాసన విధించుటచే, సకలాత్మలందు గల భోగ్యమైన బ్రహ్మ ననుభవించు నని ఫల మగుట వలన, అనేక వాక్యము లగుట వలనను - సమష్ట్యో పాసనము చేయదగినది.

## 24 శబ్దాదిభేదాధికరణము :-

బ్రహ్మోపాసనరూపములై, బ్రహ్మప్రాప్త ఫలము కలవియైన సద్విద్య, దహర విద్య, శాండిల్య విద్య, భూమ విద్య - మొదలైనవి - వేరు వేరు విద్యలు - పరబ్రహ్మ యొక్కడైనను, సద్భావ మాపహతపాప్మత్వములు మొదలగు శబ్దభేదముల వలన, అనుబంధ భేదహేతువులచే - వేరైనవి.

**25.** వికల్పాధికరణము –

దేశము వలన, కాలము వలన, స్వరూపము వలనను – అప
రిచ్ఛిన్నమగు ఆనంద స్వరూపము గల పరబ్రహ్మానుభవము –
పమ స్తమైన పరవిద్యలకు ఫలము కనుక, సకల విద్యలకు వికల్పము
కామ్య విద్య లయినచో, యథేచ్ఛయముగ సముచ్చయింపవచ్చును,
వికల్పము చేయవచ్చును.

**26** యథాశ్రయభావాధికరణము :–

కర్మాంగాశ్రయములైన ఉద్గీథాది ఉపాసనలకు – గోదోహ
నాదుల వలె – అధికారాంతర మగుటచే, పూర్వోక్తమైన యమ
యమనము సంభవించును. 'ఉద్గీథ ముపాసీత' అని విధింపబడుట
లనను, వర్తమాన నిర్వచనము వలనను తెలియబడిన ఫల సంబంధ
బనకు – మొదటనే ఉద్గీథ సంబంధము తెలియబడినది' అని –
క్రత్వంగ భావము విరోధింపబడదు. అందువలన, ఉపాదాన నియమ
ఏర్పడినది. ఉపాసనకు – ప్రణవ రహాభావ నియమము కనబడుట
ననను ఉద్గీథోపాసనానియమము నిశ్చయింపబడుచున్నది. అట్లు
దు. కృత్వంగత్వము అశ్రుత మగుట వలన, ఉపాదాన నియమము
ను బ్రహ్మయొక్క వేదనముచేత యజ్ఞముయొక్క రక్షణమును
స్పుచున్న శ్రుతి – ఇతరు లకు వేదనాభావమును చూపుచున్నది.
యు – ఉద్గీథోపాసనము క్రత్వంగము కానపుడే ఉపపన్నమగును.
దువలన, ఉద్గీథాది ఉపాసనలకు కృత్వంగముగ అంగీకార నియ
ము లేదు.

## తృతీయాధ్యాయ - చతుర్థ పాదము

### 1 పురుషార్థాధికరణము .-

విద్య వలన బ్రహ్మప్రాప్తి కలుగు నను శ్రుతి వలన, పురుష
ర్థము విద్యచే సిద్ధించునని బాదరాయణ మతము. కర్తృ సంస్క
రము ద్వారా - కర్మశేష మగుట వలన, విద్యయందు పురుషార్థవ
అర్థ వాద మని జైమిని మతము బ్రహ్మవేత్తల యాచారము క
ప్రధానముగా కానవచ్చుచున్నది.

"యదేవ విద్యయా కరోతి"

అను శ్రుతి వలన - విద్య - కర్మాంగమని తలంపవలసివచ్చుచున్న
విద్యకు కర్మ అంగ మగుటచేతనే విద్య కలవానికే కర్మలను విధ
చును కర్మ వలననే పురుషార్థ లాభము వేదవేద్యుని విషయమై
విద్య - పరబ్రహ్మ ప్రాప్త ఫలము కొరకు విధింపబడుచున్నది వి
ప్రధాన మైనను - బ్రహ్మవేత్తలకు ఆచార దర్శనము సమాన
నది శాస్త్రముచే విధింపబడిన స్మృతియు - జ్ఞానావృత్తిరూపమై
విద్యయు - కర్మాంగములు కావు ఊర్ధ్వరేతస్కులందును విద్య క
వచ్చుట వలన, విద్య వలననే పురుషార్థ మనుట స్పష్టము.

### 2 స్తుతిమాత్రాధికరణము ..

జుహ్వాది విధి వలె - ఉద్గీథాది విధి యిచట సన్నిహిత
కానందున, రజతమత్వాది ప్రమాణాంతరప్రాప్త మగుటవలన, 'ఉ
సీత' అని - విధి ప్రత్యయాంతమైన క్రియ వాచక శబ్దము వల
స్తుతి మాత్రము కాదు, రసతమత్వ దృష్టి విధియే.

**3. పారిప్లవార్థాధికరణము :-**

"ప్రతర్దనో వై దైవో దాసిః"

ఇత్యాది వేదాంత మందలి ఆఖ్యాన విశేషములు — మన్వాది వ్యాఖ్యాన మందు విశేషింపబడుటవలన, విధిలో - ఏక వాక్య మగుటవలనను - విద్య కొరకు ఏర్పడినట్టివే

**4. అగ్నీంధనాద్యధికరణము :-**

'విద్య కలవారు' - అను శ్రుతి వలన, ఊర్ధ్వరేతస్కులందు విద్య - అగ్నీంధనాది కర్మాపేక్షితము కాదు. అగ్నిహోత్రాద్యపేక్ష - బ్రహ్మవిద్య యని నిశ్చయింపబడుట వలన, ఊర్ధ్వరేతస్కులందు బ్రహ్మవిద్య సంభవించును.

**5. సర్వాపేక్షాధికరణము :-**

ప్రయాణమునకు సాధనమైన యశ్వము - దాని పరికరబంధ రూపమైన కర్మాపేక్ష ఎట్లు కలదో, అట్లే - మోక్షమునకు సాధన మైన బ్రహ్మవిద్యయు - నిత్య నైమిత్తికరూపమయిన కర్మాపేక్ష కలది. ఊర్ధ్వరేతస్కులందు తమ యాశ్రమమునకు విధింపబడిన కర్మయే యంగమగు నని - వారియందును విద్యా సంబంధమును వివరించు శాస్త్రము వలన తెలియుచున్నది. శాస్త్రము చేతనే తెలియ దగిన విషయమందు - శాస్త్రానుసారము అంగీకరింపవల యును.

**6. శమదమాద్యధికరణము :-**

'శాంతో దాంతః' - అని మొదలైన వానిచే, శమ దమా దులు విధింపబడుటవలన, శమ దమాదులు కూడ విద్యాంగములుగా,

కాగ్రత కొరకు - తప్పక అనుష్ఠింపవలెను, శమ దమాదుల చేతనే - తెలియ దగిన విషయమందు - శాస్త్రానుసారము అంగీకరింపవల యును

## ౨. సర్వాన్నానుమత్యధికరణము -

బృహదారణ్యకమందును, ఛాందోగ్యము నందును, ప్రాణ విద్యయందును - సర్వాన్నానుమతి చెప్పబడినది ప్రాణోపాసనకు సర్వాన్నానుమతి - ప్రాణము పోవు సమయమునందు మాత్రమె సత్త్వము శుద్ధముగానున్న విషయాంతర స్మరణ లేని ధ్యానముకలుగు నని, ఆహారశుద్ధికి బాధలేకుండుటవలన, ప్రాణముపోవు సమయము నందుమాత్రమే - సత్త్వము శుద్ధముగా గల విషయాంతర స్మరణ లేని ధ్యానము - కలుగునని, ఆహార శుద్ధికి బాధ లేకుండుటచే, ప్రాణము పోవు సమయమునందు మాత్రమే సర్వాన్నానుమతి - ప్రాణాపాయసంబంధము నొందినట్టివాడు - ఎవరి వలన అన్నము భుజించుచున్నాడో, అతడు - కమల పత్రము నీటిచే వలె, పాప ముచే - అంటబడడు' అని - ప్రాణాపాయసంశయమందే సర్వా న్నానుమతి స్మరింపబడుచున్నది.

## ౩. విహితత్వాధికరణము ..

జీవించియున్నంతవఱకు - అగ్నిహోత్రముతో హోమము చేయవలెను' - అను శ్రుతి చేత, కేవలము - గృహస్థునకు జీవన నిమి త్తముగా విధింపబడుటవలన కేవల యజ్ఞాది కర్మలు కూడ నగును.

విద్యా సహకారముగ - యజ్ఞాది కర్మలను అనుష్ఠింపవలెను. విద్య వినియోగము లగుట వలన యజ్ఞాదులు కేవలము ఆశ్రమస్థుల ముముక్షువులకు మాత్రమె ఆచరణీయములై యున్నవి

## 9 విధురాధికరణము :-

ఆశ్రమము లేనివారైకాదుఅందు - బ్రహ్మ విద్యా నిష్ఠత్వ కానవచ్చుచున్నందున, ఆశ్రమ నియమములుకాని జప-ఉపాసనా లచేతనే వారికి విద్యానుగ్రహత్వము సంభవించుటవలన, విధుర లకు బ్రహ్మవిద్యయందు అధికారము కలదని సిద్ధాంతము. విప్ర జపము వలనను - బ్రహ్మ విద్యా సిద్ధి నొందును తపస్సు చేత బ్రహ్మ చర్యముచేతను, శ్రద్ధచేతను, విద్య చేతను - పరమాత్మ పొందవలె నని తలంపవలెను ధర్మములు అనేకము లుంచుట వే ఆశ్రమము లేక యుండుట కంటెను-ఆశ్రమత్వమే శ్రేష్ఠము.

## 10. తద్భూతాధికరణము :-

నైష్ఠిక బ్రహ్మచర్యాదులు ఆశ్రమ హీనులుగా నుండకూడ కావున, అట్టి వారికి విద్యాధికారము సంభవింపదు ఇది జై సమ్మతమైనదే. ఉపపాతకమైనను, మహాపాతకమైనను - నైష్ఠి నుండి భ్రష్టుడైనవాడు కర్మాధికారము నుండి దూరమైనవాడే.

## 11 స్వామ్యధికరణము -

ఉద్గీథోపాసన - కర్మాంగాశ్రయ మగుటవలన, కర్త-ఋ జునిచే ననుష్ఠించబడుచున్నదికనుక, గోదోహనాదులవలె ఇదియు

ఋత్విజునిచేతనే అనుష్ఠింపదగినది యజమానునకు ఉద్గీథాది ఉపాసనలయందు - కర్తృత్వము యజమానికే ఫల మని ఆత్రేయ మహర్షి మతము.

## 12 సహకార్యన్తరాధికరణము :-

విద్య కలవానికి - రెండవ యంశము విధింపబడుచున్నది కనుక, మౌనము విధి - ముని శబ్దము ప్రకృష్ట మననశీలునియందు ప్రసిద్ధ మగుట వలన - పాండిత్య బాల్యములకు సహకార్యన్తరమైన అపూర్వమైన మౌనము విధింపబడుచున్నది గృహస్థుడు జీవించియున్నంతకాలము వఱకు - కర్మాంగక ధ్యాన మొనర్చుచున్నవాడై పరబ్రహ్మలోకము నందు చున్నాడు' - అనబడుటచే, ఆశ్రమము లన్నింటియందును విద్య - కలదని స్పష్టము.

## 13 అనావిష్కారాధికరణము :-

యథేష్టాచరణము విద్యోత్పత్తికి విరోధ మగుటచే, బాలునట్లు - తన యాభిజాత్యాది గుణములను ప్రకటించకుండునో, అట్లనే - విద్యావంతుడు తన మాహాత్మ్యమును ప్రకటింపకుండుట యుక్తము

## 14 ఐహికాధికరణము :-

'ఏ కర్మ - విద్యచే చేయబడునో, అదియే మిక్కిలి శక్తి కల అని - ఉద్గీథోపాసనము క్రతువునకు కర్మాంతరముచే - ఫలః ప్రతిబంధము కాకయుండుటయే ఫల మని చెప్పుటచే, అప్రస్తుతమయిన ప్రబల కర్మాంతర ప్రతిబంధకము కాకయుండుటయే ఫ

ంని చెప్పుటచే, అప్రస్తుతమయిన ప్రబల కర్మాంతర ప్రతిబంధక
ున-అనంతరమే ఉదయించును. ప్రస్తుతము అయినదానికి ఉత్తర
ాలమునం దని - నియమము లేదు

**5 ముక్తి ఫలాధికరణము -**

ప్రతి బంధకము లేనపుడే ఫలము నిశ్చయ మగుట వలన,
ుక్తి ఫలము గల సాధనములకు నియమము లేదు' - అను ద్వారు
తో - ఈ యధ్యాయము సమాప్త మగుచున్నది.

## చతుర్థాధ్యాయ - ప్రథమ పాదము

**ఆవృ త్త్యధికరణము :-**

పరమాత్మయే దర్శింపదగినది, వినదగినది, మననము చేయ
గినది, ధ్యానము చేయదగినది, త్యాగము చేయదగినది' యని -
్యన-విధి శబ్దములకు వ్యతిరేకముండుటచే, ధ్యానోపాసనాది
బ్దవాచ్యమైన అసకృ దావృత్తిరూపమైన - స్మృతి సంతానమైన
దనమే శాస్త్రార్థమని నిశ్చయింపబడుచున్నది. ఉపాసనము అవి
ఛన్న స్మృతి సంతాన రూపము.

**ఆత్మత్వోపాసనాధికరణము :-**

ఉపాసించువాని యాత్మగనే అనుసంధించుచున్నారు. శాస్త్ర
ులు ఉపాసకుని యాత్మగనే తెలియజేయుచున్నవి. సర్వాత్మ పర
ాత్మ యనియు - తాను మానవుడ ననియు, తన శరీరము తనకు
పకారక మగుటచే, ప్రకారి యయిన తన యాత్మయందే యెట్లు

పర్యవసానమో—అట్లే, తన యాత్మయొక్క అహం ప్రత్యయము, అహం శబ్దము—పరమాత్మకు శరీర మగుటచే, ఆ పరమాత్మకు విశేషముగనే తన యాత్మ ననుసంధించుటచే. 'అహం బ్రహ్మాఽస్మి' అని- పర్యవసానము.

**3. ప్రతీకాధికరణము .—**

మనస్సు మొదలైనది ఉపాసనకు ఆత్మ కాదు. అచట—బ్రహ్మ ఉపాస్యము కాదు. బ్రహ్మ దృష్టిచే - మనస్సు మొదలయినది - ఉపాస్యము. కనుక, ప్రతీకోపాసనయందు ఆత్మత్వానుసంధానము - చేయరాదు.

**4. ఆదిత్యాదిమత్యధికరణము :—**

ఆదిత్యాది దృష్టి - కర్మాంగమైన ఉద్గీథాదులందు—ఉపాస చేయవలెను. ఏల ననగా - కర్మకును ఫల సాధనత్వము - ఆదిత్యా దేవతారాధన - అని—ఆదిత్యాదులకే ఉత్కర్ష ఉపపన్న మగుట యును.

**5 ఆసీనాధికరణము ..**

కూర్చున్నవానికే యేకాగ్రత సంభవించుటవలన ఉపాసనము మానసికమైన ఏకాగ్రతకు మూలమైనవి కావున, కూర్చుండి ఉప సించవలయును. 'నిధి ధ్యాసితవ్యః' అని - ఉపాసనము ధ్యాన రూ మగుటవలన, ఏకాగ్రత ఆవశ్యకము. తైల ధార వలె ఎడతెగ స్మృతిసంతాన రూపము - ధ్యానము. పృథివ్యాదులవలె అచలత్వ కూర్చున్నవానికే సంభవించును. ఏ దేశమున, ఏ కాలమున - మ

స్సునకు ఏకాగ్రత కలుగునో, ఆ దేశమున, ఆ కాలమున - ఉపాసన చేయవలెను.

### 6. ఆప్రయాణాధికరణము :-

ఉపాసనము మోక్ష ప్రయాణము వఱకు అనువర్తించును ఉపాసనోద్యోగకాలమునుండి - ప్రయాణ కాలము వఱకు - మధ్య కాలమున అనువర్తించు నని - శ్రుతి ప్రమాణము. 'ఉపాసకుడు - తన జీవితకాలము వఱకు ఉపాసించుచు, పరబ్రహ్మ లోకమును పొందుచున్నాడు' - అని, దీని తాత్పర్యము.

### 7 తదధికరణాధికరణము -

ఈ విధముగా ఉపాసకుని సకల పాపములు నశించుచున్నవి 'ఈ విధముగా ఉపాసించువానియందు ప్రామాణికముగా జేసిన పాప కర్మ అంటదు' - అని, శ్రుతి. రెండు శాస్త్రములు భిన్న విషయము లగుటవలన, విరోధము లేనందున, శ్లేషలు సంభవించుచున్నవి.

### 8. ఇతరాధికరణము :-

ముముక్షువుకు పుణ్యము మోక్ష విరోధ మగుటచే, అనిష్టత్వ సామ్యము వలన, శ్లేష వినాశము పుణ్యకర్మకును కలదు. విద్యోపయుక్తమైన పుణ్యకర్మ మాత్రము శరీర పాతానంతరము అశ్లేషమగు నని సిద్ధాంతము.

### 9. అనారబ్ధకాధికరణము :-

నాకు అంతవఱకే అని, ఉదయించిన విద్య కలవానికిని - ప్రారబ్ధ ప్రాప్త శరీర మోక్షావధిత్వశ్రుతి వలనను, సర్వకర్మ,

వినాశ మందు శరీరస్థితి అనుపపన్న మగుటవలనను, అనారబ్ధ కార్య ములు కల సుకృత - దుష్కృతములకే వినాశము.

## 10 అగ్నిహోత్రాద్యధికరణము :-

'ఆ పరమాత్మను వేదాధ్యయనముచే, బ్రహ్మనిష్ఠులు ప్రీతి విషయమైన ధ్యాన మొనర్చుచున్నారు' - అను శ్రుతి వలన, అగ్ని హోత్రము మొదలగు ఆశ్రమ ధర్మములు - ఆ విద్యా సిద్ధికై అను ష్ఠింపవలెను. అగ్నిహోత్రాది సత్కర్మము కంటెను ఇతరమయిన పుణ్యకర్మ కలదు అది - సంచిత - ఆగామియు నగు కర్మలలోనిది. కర్మలకు ఫలము నీయక, ఒకపుడు శ్రుతిబంధకము కావచ్చును

## 11. ఇతర క్షపణాధికరణము .-

బంధ మోక్షములు కర్మవిషయములు. అందువలన, ప్రారబ్ధ ఫలము కల పుణ్య పాపములు ఎన్ని శరీరములచే సమాప్తి చేయ దగునదియో - అన్నిటితో నశింపజేసి, అనంతరమే పరబ్రహ్మను పొందుచున్నాడు.

# చతుర్థాధ్యాయ - ద్వితీయ పాదము

## 1 వాగధికరణము .-

"వాఙ్మనసి సంపద్యతే'

అని - వా గింద్రియ స్వరూప సంపత్తియందే శబ్ద ముంచుటవలన వా గింద్రియము మనస్సునందు సంయోగము - వా గింద్రియమ

కు మనస్సు యోగ మాత్రము కనుకనే, సర్వేంద్రియములం వాగింద్రియము ననుసరించి, మనస్సునందు సంపన్నము లగుచున్నవి.

మనోఽధికరణము :-

మనస్సు ప్రాణమందు లయ మగును. మనః ప్రాణములకు హ్యాయనము చెప్పబడుచున్నది. అందువలన, సర్వేంద్రియ సంయుక్తమైన మనస్సు - ప్రాణముతో కలియును.

అధ్యక్షాధికరణము :-

'శరీరమును వదలిపోవుచున్న ఆ జీవాత్మ ననుసరించి, ప్రాణము దలును' - అను శ్రుతిచే, ఉత్క్రాంతియందు ప్రాణము ఇంద్రియాధ్యక్షుడైన జీవాత్మయందు సంయోగ మగునని సిద్ధాంతము.

భూతాధికరణము :-

'జీవుడు పృథ్వీమయుడు' - అనుటచే, సంచరించుచున్న వుడు - సర్వభూతమయు డగుటవలన, త్రివృత్కరణ ప్రతిపాదకము స శ్రుతి - స్మృతులచే, భూతాంతరయుక్తమైన తేజస్సునందు - ాణము సంయుక్త మగుచున్నది.

ఆసృత్యుపక్రమాధికరణము :-

హృదయమందు గల కాంక్ష లెప్పుడు వదలివేయబడుచున్నవో, ప్పుడే - ఉపాసనారంభమువలన మానవుడు అమృతు డగుచున్నాడు. మ విమోచన పూర్వకముగా ఉపాసనయం దున్నవాడై, అర్చిరాది మార్గముతో - బ్రహ్మను పొందుచున్నాడు. అర్చిరాది

మార్గముగా – దేశ విశేషమునకు బోయి, ఎంతవరకు బ్రహ్మ పొంద బడునో, అంతవఱకు – సంసారము నిర్దేశింపబడుచున్నది అర్చిరాది మార్గమున బోవుచున్న విద్యానిష్ఠునకు – సూక్ష్మ శరీరముతో గమ నము - ముముక్షు వగు విద్యా నిష్ఠునకు - చంద్రునితో సంవాద ముపదేశింపబడుచున్నది స్థూల శరీరమునుండి వెడలుచున్న విద్యా నిష్ఠునకు - సూక్ష్మ శరీరముతో గమనము ముముక్షు వగు విద్యా నిష్ఠునకు - ప్రాణములు పోవు అర్చిరాది ' మార్గముగా పోవుటకు - తోడనే ఉంటున్నది

ఆ నాడులలో ఒకటి - పైకి ఉన్నది ఆ నాడిచే - ఎవడు సూర్య మండలమును భేదించుకొని, చతుర్ముఖ బ్రహ్మలోకమును దాటి, మోక్ష స్థానమును పొందుచున్నాడో' - అను శ్రుతిచే, విద్యానిష్ఠునకు మూర్ధన్య నాడి ద్వారా – ఉత్క్రాంతి చెప్పబడు చున్నది.

## 6. పరసంపత్త్యధికరణము - -

తేజస్సు మొదలగు భూత సూక్ష్మములు – పరమాత్మతో సంయుక్తము లగుచున్నవి'-అని - శ్రుతి చెప్పబడినరీతిగా - ప్రళయ కాలముననుు, సుషుప్తియందును - పరమాత్మతో సంయోగము కలుగుచుండుటచే, విశ్రామము కానవచ్చుచున్నది.

## 7 అవిభాగాధికరణము -

'వాగింద్రియము మనసు నందు సంసక్త మగుచున్నది' అను శ్రుతిచే చెప్పబడిన సం క్తి వచన మంతట ననుషక్త మగుటవలన,

ఇచట అనువృత్తమైన సంపత్తి వచనమునకు–అర్థాంతరము యుక్తము కానందున, ఇచట వాఙ్మన స్సంయోగమువలె భూత సూక్ష్మ పరమాత్మలకు–సంయోగరూపమే యని సిద్ధాంతము.

## 8 తదోకోఽధికరణము :-

హృదయములో నున్న పరమ పురుషుని ఆరాధాన రూపమైన విద్యా సామర్థ్యమువలనను అవిద్యకు అంగమైన అర్చిరాది గతి చింతన చేతను, ప్రీతుడైన పరమ పురుషునిచే అనుగ్రహింపబడిన జీవాత్మ - పరమ పురుషునిచే ప్రకాశింపబడిన జీవాత్మ–పరమ పురుషునిచే ప్రకాశింపబడిన ద్వారము కలవాడై ఆ మూర్ధన్య ద్వారమునే వెడలుచున్నాడు.

## 9 రశ్మ్యనుసారాధికరణము :-

'అనంతరము - ఇట్టి కిరణముల చేతనే–పైకి వెడలుచున్నాడు' అను శ్రుతి వలన, విద్యా నిష్ఠుడు - సూర్యకిరణముల ద్వారముననే వెడలుచున్నాడు. రాత్రి వేళ లందును. వేసవికాలమందును వేడి యుండుటచే–సూక్ష్మకిరణము లుండును. హేమంత కాలమున వేడి లేక, మంచుచే బద్ధ మగును

## 10. నిశాధికరణము :-

మరణించువారికి పగలు, శుక్ల పక్షము, ఉత్తరాయణము - అనునవి ప్రశస్తములు రాత్రి, కృష్ణపక్షము, దక్షిణాయనము-అనునవి నిందితములు. అయినను, విద్యా మాహాత్మ్యము వలన, ఉత్తర-పూర్వాఘముల యశ్లేష నాశ శ్రుతి వలన, అవి యంటక, విశిష్టము

ంగుట వలన, బంధమునకు కారణము లేనందున - రాత్రి వేళ మరణించినను - విద్యా నిష్ఠునకు బ్రహ్మప్రాప్తి కలదు.

**11. దక్షిణాయనాధికరణము :-**

బంధ హేతువులు లేనందువలన, దక్షిణాయనమందు మరణించినను-విద్యా నిష్ఠునకు పరబ్రహ్మప్రాప్తి కలదు. యోగిశ్చై, మోహమునందనివానికి - మరణ కాల నియమము లేదు. యోగులు-స్మార్తమునను, స్మృతివిషయభూతమునను-స్మరింపబడుచున్నారు.

## చతుర్థాధ్యాయ - తృతీయ పాదము

**1 అర్చిరాద్యధికరణము :-**

సకల బ్రహ్మ విద్యా ప్రతిపాదకము లగు ఉపనిషత్తులందు - ప్రసిద్ధు డగుట వలనను, ప్రత్యభిజ్ఞానము కలవా డగుటవలనను - విద్యానిష్ఠుడు అర్చిరాది మార్గమునసే వెడలుచున్నాడు.

**2. వాయ్వధికరణము :-**

సంవత్సరమునకు తదుపరి - ఆదిత్యునకు పూర్వము వాయువు నొకదానినే యుంచవలెను. సామాన్య - విశేష వాచకములైన దేవ లోక వాయు శబ్దములచే, ఒక్క వాయువు మాత్రమే నిర్దేశింపబడు చున్నది. దేవతలకు నివాస స్థాన మగుట వలన, సామాన్యముగ - దేవలోక శబ్దము - వాయువును మాత్రమే తెలియజేయుచున్నది.

**3 వరుణాధికరణము :-**

విద్యుత్తు - మేఘోదకమందుండుటచే, విద్యు ద్వరుణులకు సంబంధము లోకమున - వేదములలో ప్రసిద్ధము కావున, విద్యుత్తు పైన - ఈ వరుణునకు నివేశము - తదనంతరము - ఇంద్రాదులు

**4 ఆతివాహికాధికరణము .-**

ఆ పురుషుడు - ఈ విద్యానిష్ఠులను పరబ్రహ్మను పొందిం చును - అను శ్రుతి వలన, విద్యానిష్ఠులను సాగనంపుటయందు పరమపురుషునిచే నియమింపబడిన అర్చిరా ద్యభిమాని - దేవతా విశేషములు ఆతివాహికు లని తెలియుచున్నది. విద్యు త్పురుషుని చేతనే విద్యానిష్ఠ - గమనము

**5 కార్యాధికరణము :-**

హిరణ్యగర్భుని ఉపాసించినవారికే లోకాంతర గమనము ఉపపన్న మగుట వలన, హిరణ్యగర్భుని ఉపాసించువారలుసైతము - ఆతివాహిక గణము పొందించునని - బాదరాయణ మతము అయాన వుకు ప తెంచి, బ్రహ్మలోకములకు హిరణ్యగర్భుని ఉపాసించిన వారలు - ఆతని లోకమున - ప్రళయ కాలమందు - పరబ్రహ్మను పొంది, బంధ విముక్తు లగుచున్నారు' అని - శ్రుతి - స్మృతులు తె ల్పుచున్నవి పరబ్రహ్మను ఉపాసించినవారినే ఆతివాహిక గణము పొందించుచున్నదని - జైమిని మతము

అర్చిరాది మార్గముగ వెడలినవానికి - పరబ్రహ్మప్రాప్తి కలదని - శ్రుతి పలుకుచున్నది. హిరణ్యగర్భుని ఉపాసించినవారిని, పర

బ్రహ్మను ఉపాసించినవారిని, ఉభయులను పొందించును ఇచట - భూతసూక్ష్మ వ్యతిరిక్త మయిన ఆత్మస్వరూపముయొక్క ఉపాసనము విధింపబడుచున్నది

## చతుర్థాధ్యాయ - చతుర్థ పాదము

### 1 సంపద్యావిర్భావాధికరణము :—

'ఈ జీవుడు ఈ శరీరమునుండి - పరంజ్యోతిస్వరూపుడైన పర బ్రహ్మను పొంది, స్వరూపముచే అభివ్యక్త మగుచున్నాడు' అని - శ్రుతిలో - పరంజ్యోతిని పొందిన జీవాత్మయొక్క. స్వరూపావిర్భావము చెప్పబడినది. అపహత పాప్మత్వాదిగుణములుకలది-ఆ స్వరూపము కర్మవలన దేహ సంబంధము, దానివలన కలిగిన తిరోధానము పరంజ్యోతిని పొందుటచే, సూక్ష్మదేహమును వదలి, సంకోచము లేని జ్ఞానానందాది గుణములు కల స్వరూపము ఆవిర్భవించుటవలన తన యాథాత్మ్యానుభవము కలుగుచున్నది.

### 2 అవిభాగేన దృష్టత్వాధికరణము .–

నేను బ్రహ్మప్రకారకుడనై తిని' - అని, ముక్తుడు బ్రహ్మతో. తనకు విభాగము లేకనే అనుభవించుచున్నాడు తన యాత్మకు ఆత్మగా నుపాసించుటచే, నిజమైన, పరమాత్మాత్మికమైన స్వరూపము చూడబడుటవలన - పరమాత్మ ననుభవించుచున్నాడు.

### 3. బ్రహ్మాధికరణము :-

ఉప్పు గడ్డకు - అంతటను - ఒకే రస ముండునట్లు, సర్వ సహితమైన పరమాత్మతో కూడిన జీవాత్మ - బ్రహసంబంధ అపహత పాప్మత్వాదులచే, స్వరూపావిర్భావము' అని-జైమినిమత జ్ఞానమందు-జ్ఞానమాత్రముచేతనే - స్వరూపావిర్భావము. 'వి ఘన వవ'-అని-జ్ఞాన స్వరూపత్వముయొక్క- అవధారణము వ యని - ఔడులోమి ఆచార్యుని మతము. విజ్ఞాన స్వరూపు ఆత్మకే - అపహత పాప్మత్వాది గుణము లని - బాదరాయ మతము.

### 4. సంకల్పాధికరణము .—

లోకమందు సత్య సంకల్పత్వము లేనందున, ప్రయత్నాంత పేక్ష కలదు. పరమ పురుషుని కంటెను ఇతరు డయిన సత్య స ల్పుడు లేడు. ముక్తునకు ప్రయత్నాంతరాపేక్ష యందు ప్రమాణ లేదు. ముక్తుడు-పరమ పురుషుని యనుగ్రహము వలన, అ సామ్యమును పొందినవాడై, అట్టి సత్య సంకల్పము కలవా డగున

### 5 అభావాధికరణము :-

శరీరునకు భోగము శ్రుతి సిద్ధము ముక్తుడు ఒక శరీర కలవాడై డగుచున్నాడు. మూడు శరీరములు కలవాడగుచున్నా మనస్సుచేతనే కామములను చూచుచున్నవాడై, ఆనందిం చున్నాడు' - అని శ్రుతిసిద్ధము. కనుక, ముక్తుడు - తన సంకల్పా సారముగ శరీరము కలవానిగను, లేనివానిగను ఉండును. ఈశ్వరుని

సృజింపబడిన శరీరాది ఉపకరణములచే, జీవాత్మ ఎట్లు సంభవించునో,
అట్లే-ముక్తుడును లీలయందు ఉద్యుక్తుడైన ఈశ్వరునిచే సృజింప
బడిన పితృలోకాదులచే - లీలా రసము ననుభవించుచున్నాడు ఒక
చోటనున్న దీపము తన కాంతిని ఎట్లు ఆ ప్రాంతమం దంతటను
ప్రసరింపజేయునో - అట్లే, ఒక తావున గల ఆత్మకు-తన ప్రభావ
రూపమైన జ్ఞానముచేత, సకల ప్రదేశములందును-సంకల్పానుసారము-
'ఆత్మ' యను అభిమానమునకు తగిన వ్యాప్తి సంభవించుచున్నది.
జీవాత్మ-మోక్ష దశయందు-తన ప్రభాస్థానమైన జ్ఞానము ద్వారా-
విభుత్వము నందును. తాను అణువైనను-విభుత్వమును పొందును.

## 6. జగద్వ్యాపార వర్జాధికరణము :-

పరబ్రహ్మ ప్రకరణము నధికరించి జగ ద్వ్యాపార ముండుట
వలన, అనవధికాతిశయ బ్రహ్మానుభవ మందు ముముక్షువునకు
సామ్యము పరబ్రహ్మ ఆనందస్వరూపు డగుట వలన, తనకు, పర
కును-అనుభవ యుక్త మగును, సమానముగ ఆనంద మగును పరవ
పురుషునిచేత, లోక నియమవాధికారమందు నియోగింపబడి
హిరణ్యగర్భాదులు, వారి లోకములు, ఆ లోకములందు గల భో
ములందును ఆసక్తి - ముక్తునకు కలిగనేని, అచ్చటచట - పరవ
పురుషానుగ్రహముచేత భోగముల ననుభవించుచున్నాడు ఆ ముక్త
నకు సకల లోకములందును యథేష్ట సంచార ముండును భగ
ద్విభూతిలో - చేరిన వగుటచేత - ఉత్పత్త్యాది వికారములందు గ
లోకములును ముక్తునకు భోగ్యములు ఉత్పత్త్యాది జగన్నియమ
నము - పరమపురుషునకుమాత్రమే ఎవడు అవ్యభిచరితమైన భ
యోగముచేత సేవించుచున్నాడో, అతడు - ఈ ప్రకృతిగుణముల

అతిక్రమించి, పరబ్రహ్మసామ్యమును పొందుటకు సమర్థమగ
న్నాడు నిత్యమైన మోక్షమునకు, స్థిరమైన ధర్మమునకు - ము
మైన పురుషునకు ఆధారభూతుడు - పరమాత్మ. ఆతనితో గ
ముక్తుడు - అపహత పాప్మత్వాది గుణముల నొందును అట్టివా
సృష్టియందు పుట్టరు. ప్రళయమున బాధ పడరు'-అను శబ్దముచ
ఎన్నటికిని తిరిగి పంపడని - తెలియబడుచున్నది. ఈ సూత్రిన్నత్రి
శాస్త్ర పరిసమాప్తి సిద్ధించినది.



# శ్రీ రామానుజ విజయము

'ఉభయ వేదాంత విశారద - కవి శేఖర'

**శ్రీమాన్ కుంటిమద్ది శేషశర్మ, ఎం. ఏ.**

★

శ్రీమ ద్దివ్య విభూతిఁ దేజరిలు లక్ష్మీనాథ ! కాలాంబుద
శ్యామా ! శంఖ రథాంగ శోభిత కరాబ్జా ! లోచన సూర్య చం
ద్రా ! మార్తాండ సహస్ర భాసుర శరీరా ! సర్వ లోకావనా !
స్వామీ ! నీ పద పద్మ సేవకులఁ గావన్ సంతతోద్యుక్తుఁడా !

కానగలేరు నన్ను - కలికాల జనుల్ విభవావతారునిన్
జ్ఞాన విలోచనంబులను స్వాంతమునందునఁ జూడఁజాల రీ
మానవు లంచు - వారలకు మాధవ ! కన్పడ బాహ్యదృష్టి, క
ర్చానుగుణమ్ము వేంకట నగాగ్రముపై విజయ మ్మొనర్చితే !

ఎంత దయారసమ్మొ భజియించెడి దాసులపైన నీకు - శ్రీ
కాంతుఁడ ! శత్రు సైనిక విఖండిత సైన్యుఁడు తొండమాను భూ
కాంతుఁడు - గుప్త మార్గమున - గ్రక్కున శేష నగాగ్ర వాసి నీ
చెంతకుఁ జేరి, యాత్మకథఁ జెప్పును గద్గద రుద్ధ కంఠుఁడై

కన్నుల నీరు కాలువలు గట్టగ దైన్య విధూయమాను డా
పన్నుఁడు తొండమాను నరపాలుఁడు ఖేదనగుంచుచుండ, సం
ప న్నలినాక్షికిన్ హృదయ వల్లభ ! యంటివి, తొండమాను ! నీ
కెన్నటి కింక ఓటమి జనింపదు, శోకము నొందబోకుమా !

ఏను వచించునట్టు లొనరింపుము, మామక శంఖ చక్రముల్
నీ వశ మాచరించెదను, నిర్భయుఁడై చని శత్రు సైన్యముల్
చేవ దొరంగి పారగ రచింపుము యుద్ధము, గెల్పు నీకె, భూ
మీవర! లెమ్ము పొ మ్మిక, సమీకమునన్ విజయంబు గాంచుమా!

అను శ్రీజాని యనుగ్రహంబునకు నత్యానందియై, పాదకో
కనద ద్వంద్వము కేల దాకుచు, నతుల్ గావించి, యుద్ధాంగణం
బునకున్ బోయెను, శంఖ మూదెను - నమః పూర్వంబు చక్రాయుధం
బును వైచెన్, జ్వలనార్చులం బరపె భూ వ్యోమమ్మునన్ నిండుగన్

జ్వలన జ్వాలల కోహటిల్లి, ప్రజల ప్రత్యర్థిసైన్యంబు, క
న్నులకున్ బర్వగ నంధకారములు, వీనుల్ పాంచజన్యస్వనం
బులచేఁ బీటలువారగాఁ, బదయుగంబుల్ తొట్రుపాటొందఁగా
కల నత్తోణిఁ దొలంగిపారె నరివర్గంబుల్ పటాపంచలై.

అరిసైన్యంబుల బారద్రోలి, విజయాహ్లాదంబుతో తొండమాన్
ధరణీనాథుని సైన్యముల్ పటహ నిర్ధ్వానమ్ము భూమీ నభోం
తరముల్ నిండగ నారిలోనికిఁ జనన్, ధాత్రీతలేంద్రుండు సం
బరముల్, భక్తియుఁ దొందరింపఁగఁ జనెన్ బద్మేశు సేవింపగన్

కారుణికాగ్రగణ్య! అనుకంప నొసంగితి - శంఖ చక్రముల్
వైరులఁ బారద్రోలి యిడె వచ్చితి, తెచ్చితి గొమ్ము వీని నో
శ్రీరమణీ మణీ దయిత! శేష నగాగ్ర నివాస! నన్ను దా
సేరుని - నీ పదాంబురుహసేవకు, నేలుము వేంకటేశ్వరా!

అని కేలుంగవ మోడ్చి నిల్వ, దరహాసాంకూరముల్ నెమ్మొగం
బున దీపింపగ, వత్స ! నీ చరిత సమ్మోదంబు గావించెఁ, దీ
స్తును నీ కోరిక నా కొరకందు మఱి సంతోషమ్ములోఁ గోరు' మం
చన, నీ వేమనుకోకు, మొక్క వర మే నర్థించెదన్ శ్రీపతీ !

దర చక్రంబుల నా కొసంగిన భవ ద్వాత్సల్య చిహ్నంబుగన్
గర యుగ్మంబున పీనిఁ దాల్పకుము ! దీనన్ నీదు భక్తావన
త్వరయున్ మామక భక్తిభావమును, నిత్యశ్లాఘ్యయో' నన్న, భూ
వర ! తాల్పన్, నినుబోలె వే రొకఁడు నిర్బంధింపఁడేన్ దాలుపన్.

అని బాస జేసి, శేషా
ద్రి నివాసుఁడు హస్తముల ధరింపఁడు చక్రం
బును, శంఖము, వే లేడులు
చనెను నిరర్గళము కాలచక్రము దిరుగన్.

కొండల రేని యర్చకులు కొందఱు పూజలయం దనాస్థతో
నుండగ, నిల్చిపోయె నిగమోక్త విధానము లుత్సవంబు, లి
ట్లుండగ, శైవభక్తులు సముత్సుకులై, 'నగశృంగవాసి స్కం
దుం' డని త న్మహీధవునితోడ నిరూపణఁ జేసి రివ్విధిన్.

రాజీవాక్షునిగూర్చి యి గ్గిరి గుమారస్వామినిష్ఠన్ దపం
బోజన్ జేసెఁ ద్రిశూలమున్ విడిచి య త్యుత్సాహి, త న్మూర్తికి
రాజా ! యి య్యదిః కొంగ తేక మయి - కుట్రల్ పన్ని సమ్మోంచి, భ
ర్మాజానిన్, నిటలంబుపై నిడిరిసుమ్మీ నామముల్ స్వామికిన్.

స్వామికి వారవారమును సల్పెడి బిల్వదళార్చనమ్ము లీ
స్వామినిఁ దెల్పుచూ కొమరుసామిగ నాగలి భూషణమ్ము, నిం
'కిదియు సందియమ్మునల దించుకయేనియు' - నన్న వైష్ణవ
స్వాములు దానికిన్ బదులు వల్కఁ సమర్థులు గాకపోవుటన్

శ్రీరంగంబుననుండి పిల్చుకొని వచ్చెన్ దంతి యంబారిపై
శ్రీ రామానుజ సంయమీశ్వరుని - కీర్తి ప్రస్ఫుర న్మూర్తి నిన్
రారాజ త్పరిభా సమార్జిత సమగ్రానేక వేదాంగ వి
ద్యా రాద్ధాంత రహస్యునిన్ - ధరణిపాలామాత్యుఁ డత్యాదృ

వచ్చిన సంయమీశ్వరు నృపాలుఁ డెదుర్కొని, గౌరవించి, వి
ద్వచ్చయ యుక్తుఁడై చని సభన్ సుమహోన్నతమైన యాసనం
బిచ్చి, సుఖోపవిష్టు నొనరించె ననంతర మన్యవాదులన్
చెచ్చెరఁ బిల్వఁబంచెను, వచించెను వారలముందు వృత్తమున్

ఇంచుక వారివారు గమనించి, సమస్త పురాణ వేద వి
ద్యాంచితమూర్తి - వాదకలహార్జితనిస్తులకీర్తి యిట్లు భా
షించెను సప్రమాణము మునీంద్రుఁడు, భక్తుఁడు తొండమానుఁ
ర్థించెను - 'శత్రురాజుల జయింప, రథాంగము శంఖ మీవు గా
వించుట మద్వశంబు, ధర నెల్లడి గానివి నీవు తాల్పబో
కంచు తదాది మానె' దన హస్తమునందున వీని దాల్చుటన్.

ఈ నగ శృంగ వాసికి రచింతురు బిల్వదళాలపూజలన్
గాన నితండు నిక్కము పినాక ధరాత్మజుఁడైన దేవసే
నానియె, కాదు మాధవుఁడు' నా వచియింపఁగరాదు లక్ష్మి కెం
తేని ప్రియంబు బిల్వ మని తెల్పెడె సూక్తము ! * దాన నర్చనల్
శ్రీనిలయత్ హృదుం డయిన శేషగిరీశున కర్హ మేను, కాం
తానుగుణ ప్రవృత్తులెగదా గిరిశుండును, వాగధీశుడున్ !

వీరనృసింహరాయ లను విశ్రుతకీర్తి యొకండు తీర్థయా
త్రారతి నేగుదెంచి, ఫణిరాజనగాగ్రనివాసి యాలయ
ద్వారముపైన గోపురముతోఁ రచియింపఁదలంపఁగా, కలన్
శౌరికి శయ్యయైన ఫణినాథుఁడు కన్పడి, యిట్లు వాకొనెన్.

ధరణీనాయక ! నేను భూధరమునై, దామోదరావాసమై
హరిసేవారతి నున్నవాడ, నిక మాయన్ జాలనే భార మీ
దిరనాథున్ గొలువంగఁబోదు రని ధాత్రీనాథుతోఁ బల్క, చె
చ్చర గర్భాలయు మేగి చుట్టుకొనె లక్ష్మీనాథు దోర్దండమున్.

తెలవారన్ నరసింహరాజు - తన రాత్రిస్వప్నమున్ పండితా
వలికిన్ దెల్పెను, వారు దాని మది సర్వంబున్ విచారించి త
త్ఫలమున్ దెల్పిరి, కట్టడ మ్మిడుగు పద్మాభర్తకున్ జేతికిన్
వలయంబుల్ రచియింపు' మంచు, ధరణీనాథుఁడు వారింపఁగన్.

---

* తవ వృక్షోఽథ బిల్వః. — శ్రీ సూక్తము

వలయమ్ము సమర్పించుటా
మల కే డీతండు నిజము మా నాథుండే ,
మలసుత కొమరుఁడు గాదని
తెలిపెను యతి, దాని సమ్మతింపక శైవుల్.

పలికిరి భిక్షు వీతఁ డతి పండితుఁ డౌటను నంధిఁ బండగా
నలుపఁగఁజాలు వాక్కులను సద్వ్యుల ముగ్ధులగా నొనర్చె, రా
ష్ట్రిక ! త దుక్తులన్ ప్రతిఘటించెడి పాండితి లేదు మాకు ఆ
వలిమల యల్లుఁ డే గతి, కృపానిధి ! ఏగొడ మాజ్ఞ యిత్తువా

అనుచున్ నిష్ఠుర వాక్యముల్ పలుకగా, ఆచార్యవర్యాసనం
బును, సాకూతము రాజు చూడ, అతఁడో భూ నాథ ! నే చేయునే
న్నను నా వాక్కుల సత్ప్రమాణముల సంతుష్టుల్ గానిచో వీర ; శై
వను వే రొక్క విధానమున్ దెలిపెదన్ దైవ ప్రమాణమ్మునన్.

అనగా - అయ్యది మొదిరో
యని యుత్కంఠిత మనస్కులై శైవులు రా
జును గనుగొన, రామానుజ
ముని వాకొని త ద్విధానమును ఈ రీతిన్.

దిరచక్రంబుల, శూలపాశముల నంతర్దైవగేహంబునన్
పరిశీలింపఁగ నెల్ల రుంచి, భవన ద్వారంబు బీగంబు రా
తిరి ముద్రల్, మరునాడు పట్టుకొను నే దేవస్ఫుర చ్చిహ్నముల్,
కర యుగ్మమ్మున , అట్టి దేవునిగ భూకాంతా ! వచింపన్ దగున్.

అనుదాని కంద రొప్పి, త
దనుగుణముగ నాచరింప, ముని హరినిన్
మనసారఁగఁ బ్రార్థించెను
కనిపింపుము దేవ! నీదు కరుణ నటంచున్.

పర దినమందు అందఱును ద్వారపు ముద్రల జూచి తృప్తులై
అరదము దీసి చూడ, గనవచ్చెను జేతుల శంఖ చక్రముల్,
హరియును స్వస్వరూపమును నందఱికిన్ దెలియంగఁజేసె, 'సా
గర తనయా ప్రియుండ నని - కొనుచు రొక్కడ నరచు రూఢిగా.

* * *

శ్రీ రామానుజ కీర్తి వెల్లువలు రాజిల్లెన్ నిరాటంకమై
శ్రీరామాధవు కీర్తిచంద్రికలతో శ్లిష్టంబులై యుండ, ఈ
శ్రీ రామానుజ కీర్తి కౌముదులు రాజిల్లున్ సదా సర్వథా
శ్రీ రామానుజ సంయమీశ్వరుని కీర్తిన్ దిక్కులన్ బాడుచున్

# వడగల - తెంగల సంప్రదాయ భేదముఁ

'సహజ కవి - విద్యా రత్న - విశిష్టాద్వైత వేదాంత విశారద'

## శ్రీమాన్ ప్రతివాది భయంకర వేదాంతాచార్యులు,

★

### తొలి పలుకు

శ్రీవైష్ణవ సంప్రదాయములో - 'వడగల', 'తెంగల' - రెండు వర్గము లున్నవి ఈ వర్గములలో - ముఖ్యముగా - సిద్ధాంతపరములైన భేదములు కొన్నియు, ఆచార పరములైన భేదములు కొన్నియు - కానవచ్చును.

### ౧. సిద్ధాంత భేదములు :-

#### 1. భగవంతుఁడు

వడగల సిద్ధాంతము :-

భగవంతుఁడు - భక్తులయందు దయ చూపుటలో - దుఃఖములయందు పాలు పంచుకొని, దుఃఖముల ననుభవింపఁడు భగవానుఁడు సర్వ సంపూర్ణుఁ డగుటచేతను, సకల సద్గుణాన్నుఁడు కావునను - దుఃఖముల ననుభవింపఁడు.

తెంగల సిద్ధాంతము :-

భక్తులయందు దయఁ జూపుటలో - భగవంతుఁడు దుఃఖ ననుభవింపఁడు. అనంతములైన కల్యాణ గుణ గణములు

భగవంతునకు అది లోపముగాని, అసంపూర్ణతగాని–కాదు అట్టి తిలో, ఆ స్వామి - తనకు సహజ సిద్ధముగాఁ గల నిర్హేతుక జాయమాన కటాక్షమే కారణము

## 2 భగవంతుని అణువ్యాప్తి

వడగల సిద్ధాంతము :-

భగవంతుఁడు అనంతుఁడు కావున, అణ్వాత్మలోనికి చొర జాలఁడు అప్రమేయమైన పరమాత్మ - ఖండములుగా విభజింపఁబడి, ఒక్కొక్క అణువులో ప్రవేశింపబడడు పరమాత్మ–పరిమితాత్మను లోపలనుండియే కట్టివేయును పరమాత్మ యునికి - ఆత్మసంచయములో సమవ్యాప్తియే కాని, బహువ్యాప్తి కాదు

తెంగల సిద్ధాంతము -

భగవంతుఁడు - అనంత శక్తి సంపన్నుఁడు కనుక, ఆ స్వామి అణ్వాత్మలో ప్రవేశింపఁగలఁడు. ఆ భగవానుని ఆత్మస్థితి వాస్తవమైన అంతర వికాస వ్యాప్తి అది నిశ్చయముగా - అంతర్వర్తిత్వము ఆ భగవానుఁడు – సర్వాతీనుఁడు, సర్వాంతర్యామియు - తన అప్రమేయ స్థితిలో అంతటను వ్యాపించును.

## 3 భగవంతుని కృప

వడగల సిద్ధాంతము :-

భగవంతుని కృప - అయాచితులకు గాని, అపాత్రులకు గాని - లభింపదు ఆ భగవంతుని కృప - సహేతుకమైనది.

తెంగల సిద్ధాంతము —

స్వతంత్రుఁ డగు భగవంతుఁడు - భక్తులయందు అవ్యాజమైకృప గలవాఁడు భక్తుని యత్నము లేకనే - ఆ స్వామి కృప లభించును

## 4 భగవంతుని వాత్సల్యము

వడగల సిద్ధాంతము -

భగవంతుఁడు - తన భక్తుఁ డగువానికి - వాత్సల్యముతో ముక్తిని ప్రసాదించు సందర్భమున - ఆతని దోషములను విస్మరింపఁడు

తెంగల సిద్ధాంతము –

భక్తుని యందు భగవానునకు వాత్సల్యము అపారముగ నుండును కనుక, తన భక్తుని యందు గల దోషములను క్షమించి ఆతనిని రక్షించును

## 5 శ్రీదేవి సర్వ వ్యాపకత్వము

వడగల సిద్ధాంతము –

నారాయణుని వలెనే శ్రీదేవియు - సర్వాంతర్యామిగా నున్నది

తెంగల సిద్ధాంతము :-

శ్రీదేవి సర్వత్ర వ్యాప్తించియుండుట - ఆమె స్వభావము కాదు. సూర్యుని - కాంతి వీడియుండునట్లు, ఆమె ఆ స్వామిని ఎన్నడును వీడియుండదు అది సహజము అంతియకాని, అయ్యది ఆమె స్వాతంత్ర్యమునకు కారణము కాదు

## 6 మోక్షప్రాప్తికి శ్రీదేవియే హేతువా ?

వడగల సిద్ధాంతము -

లక్ష్మీదేవి - భక్తుని మోక్షప్రాప్తికి ఉపాయము. నారాయణుని వలెనే ఆమెయు - భక్తుల పాపములను తొలగింపగలదు

తెంగల సిద్ధాంతము -

నారాయణుడే మోక్ష ప్రదాత. శ్రీదేవి కేవలము పురుషకారిణి మాత్రమే మోక్షము నొసంగుటకు - శ్రీదేవికి అధికారము లేదు.

## 7 సాధన స్వరూపము - మోక్షోపాయము

వడగల సిద్ధాంతము :-

కర్మ జ్ఞాన భక్తులు మూడును - మోక్ష ప్రాప్తికి ఉపయుక్తములు

తెంగల సిద్ధాంతము :-

కర్మ జ్ఞాన భక్తుల కంటెను - ప్రపత్తి మార్గము విశేషఫలప్రదమైనది. అట్టి ప్రపత్తియే జీవుని రక్షింపగలదు.

## 8. ముక్తి ఫలము

వడగల సిద్ధాంతము -

మోక్ష ఫలమును పొందుటకు తగిన మార్గముసకును, భక్తియోగమునకును భేదములేదు. స్వయంకృషి వలననే ముక్తి లభించును.

తెంగల సిద్ధాంతము :-

ప్రపత్తియే మోక్ష సాధనము అట్టి సాధనకు - స్వయంః ఆవశ్యకము కాదు భగవ దిచ్ఛయే

## 9 ప్రపత్తిహేతువు

వడగల సిద్ధాంతము

పూర్వ జన్మలోఁ జేసిన పుణ్య కర్మల ఫలమే ఈ జన్మల ప్రపత్తికి కారణ మగును

తెంగల సిద్ధాంతము -

భగవ దనుగ్రహమే - సాధకుని ప్రపత్తికి హేతువు

## 10 ద్వయమంత్రానుసంధాన ఫలము

వడగల సిద్ధాంతము :-

ప్రాణోత్క్రమణ సమయమున - ద్వయమంత్రానుసంధాన పాతకములను హరించు నదియె గాక, భగవ దనుగ్రహ ప్రా కారణ మగును.

తెంగల సిద్ధాంతము :-

ప్రాణావసానమున మాత్రమే ద్వయానుసంధానము వంత మగు ననుటకు - తగిన ప్రమాణము లెవ్వియు కానరా మరణ కాలమందు కేవలము ద్వయమంత్రానుసంధానమె ఫలా తను కాదని, కంచి వరదరాజస్వామి - రామానుజాచార్యులవాఁ తిరుకచ్చినంబి ద్వారా తెలియఁజేసినట్లు - ఐతిహ్య మున్నది.

## 11 పరిశుద్ధాత్ముడైన ప్రపత్తినిష్ఠుడు

ౘగల సిద్ధాంతము

ప్రపత్తి ఫలమును భగవంతునకు అర్పించువాఁడే పరిశుద్ధాత్ముఁ న ప్రపత్తినిష్ఠుఁడు

ంగల సిద్ధాంతము -

భగవంతుని యందు ప్రపత్తి చేసిన ప్రపన్ను లగు భాగవ తోత్తము లందఱును-ఆ స్వామి యనుగ్రహ భాగ్యమును పొందు కు అర్హు లే.

## 12. దివ్య ప్రబంధాధ్యయనము

వగల సిద్ధాంతము -

ద్రావిడ దివ్య ప్రబంధాధ్యయనము- ప్రపత్తిఫలము నొసంగ ాలదు.

ంగల సిద్ధాంతము -

ప్రపన్నునకు ద్రావిడ దివ్య ప్రబంధాధ్యయనము - ఆవశ్య ము అయ్యది - భగవ దనుగ్రహ ప్రాప్తికి - అత్యంతము ఉప యుక్త మగును.

## 13 ధర్మ శాస్త్ర-ఆగమ శాస్త్రముల తారతమ్యము

డగల సిద్ధాంతము :-

ధర్మ శాస్త్రములు, శ్రీ పాంచరాత్ర ఆగమ శాస్త్రములు= ును రెండు విధములైన శాస్త్రములును - శ్రీవైష్ణవ సంప్రదాయ

నిరూపకములే. కాని, వాదము వచ్చినపుడు మాత్రము - ధర్మ శాస్త్రములకే ప్రాధాన్య ముండును.

తెంగల సిద్ధాంతము :-

శ్రీ పాంచరాత్రాగమ శాస్త్రములు - భగవ న్ముఖోద్గత ములైనవి ధర్మశాస్త్రములు - మానవ నిర్మితములైనవి, కనుక, పాంచరాత్రాగమ శాస్త్రములే ధర్మశాస్త్రముల కంటెను - ప్రామాణికము లగును.

## 14. భాగవతులకు, ఆళ్వారులకు, ఋషులకును చేయవలసిన గౌరవ ప్రతిపత్తి

వడగల సిద్ధాంతము -

భక్తులు, భాగవతులు, ఆళ్వారులు - అను మూఁడు వర్గ ములవారును వైష్ణవ పథమున పయనించువారలే యయ్యును - ఆళ్వారుల కంటెను - భక్తులు, భాగవతులు అనువారలు - అగ్ర గణ్యులు. వారికంటెను ఋషులు అధికులు-ఏల ననఁగా ఆళ్వారులలో హీన కులజులు, వర్ణాశ్రమ ధర్మములను పాటింపనివారును, ఋషులు ఉత్తమ జన్మము కలవారు. వారిలో - కొందఱు - భగవంతునకు ప్రీతిపాత్రులైనవారు. వారిలో - భగవ దంశలు గలవారును కొంద ఱున్నారు ఆ ఋషిసత్తములు - మానవానీకము పయనింపవలసిన మార్గమును శాస్త్రములలో సూచించినవారు. వర్ణాశ్రమ ధర్మము లను విపులముగాఁ తెలిపినవారలు. సకల మానవులకును-మాన నీయులు. ఆళ్వారుల భక్తి తత్త్వము కేవలము వైష్ణవులకు మాత్రమే తెలియును. వారి గ్రంథములును వారి ప్రాంతీయ భాష యగు తమి

ఒనందే గలవు కాని, మహర్షుల రచనలు - దేవ భాష యం.ప
స్కృతములో గలవు కావున, ఆళ్వారాదుల కంటెను - మహర్షులు
హనీయు లనియు వారి గ్రంథములే హిందూ మతమునకు
ప్రామాణికము లనియు వ్యక్త మగును.

గల సిద్ధాంతము '

భక్తులు, భాగవతోత్తములును - అన్ని వర్ణములలో నున్నారు
రు మిగిలిన మానవుల కంటెను మాననీయులు, ఋషులకన్నను
న్నలు ఏల ననఁగా, వారు విష్ణు భగవానుని అంశావతారులు.
గవ త్తత్త్వమును బాగుగా అవగతము గావించుకొని, ఆ తత్త్వ
ఎను అఖండ భూమండలమున పరివ్యాప్తము గావించు నిమిత్తము
విత్ర భారతావనిలో అవతరించినవారు ఇట్టి యీ మహనీయుల
ంటెను - ఋషులు గొప్పవారు కారు ఏల ననఁగా, ఏ ఋషియు -
ుక్తుఁడు కాఁడు కులాధిక్యము ఋషులకు ప్రాముఖ్యము కాదు
వ్యాసుని తల్లి - వెస్తరాలు వసిష్ఠుఁడు - వ్యభిచారిణియైన దేవతా
స్త్రీకి జనించినవాఁడు. ఇట్లే, ఋషు లగు వార లనేకుల జన్మలు
ఈ రీతిగా - కలుషితములై యున్నవి శీలములోఁ గూడ అనేకు లగు
ఋషులు - ఆళ్వారుల కంటెను హీనులుగా కానవత్తురు భక్తి
ప్రపత్తులలో ఆళ్వారులు అగ్రగణ్యులు. వారి దివ్య ప్రబంధములు -
పరమ పవిత్రములు, భక్తి భావోజ్జ్వలములు, ముక్తిప్రదాయకము
లునై, ప్రసిద్ధి గాంచియున్నవి అందువలన, ఆళ్వారులు అందరి
కంటెను అధికముగా గౌరవింపదగియున్నారు

## 15 వర్ణవ్యవస్థ విలువ

వడగల సిద్ధాంతము –

వర్ణవ్యవస్థకు మూలాధారము – ధర్మశాస్త్రము గోవు – కామధేనువైనను, జీవరాసులలో అయ్యది న్యూనజాతిదిగా పరిగణింపఁబడినట్లే ఇతరమైన గుణవిశేషము వర్ణవ్యవస్థను మార్చజాలదు.

తెంగల సిద్ధాంతము –

ఏ వర్ణమునకుఁ జెందినవాఁడైనను – భగవంతుని దృష్టిలో సమానుఁడే కాని, భగవద్భక్తులుమాత్రము తక్కినవారికంటెను అధికులుగా పరిగణింపఁబడగలరు. ఏ వర్ణమునకుఁ జెందినవాడయ్యును తగిన అర్హత గలవాఁడు – ఆళ్వారు కావచ్చును, ఆచార్యుఁడును కావచ్చును కావున, భగవద్భక్తులగువారికి వర్ణవ్యవస్థ వలన కలిగెడి ఉచ్చ నీచములు వర్తింపఁజాలవు.

## 16 వైకుంఠ ధామము

వడగల సిద్ధాంతము :–

వైకుంఠము ఒక దైవత స్థానము. అచట – ధ్యాన నిమగ్నులగువారు – తమ యాత్మల సిద్ధిని పొందగలరు. ఇది మోక్షము కాదు. వేదాంత శాస్త్ర ప్రకారము – మోక్షము పరిపూర్ణమైనది ప్రకృతిబంధములనుండి విమోచన మొసంగుటలో – ప్రాముఖ్యము కలది.

ల సిద్ధాంతము -

వైకుంఠము - విరజానదికి ఆవల - పరమపద సామ్రాజ్యము
న్నది కేవలమైన ఆత్మ - ప్రకృతిబంధములకు లోఁబడదు.

ఇయ్యవియే - స్థూలముగ, వడగల - తెంగల సంప్రదాయము
కలి సిద్ధాంత భేదములు ఇక -

## ఆచార భేదములు :-

### 1. సన్యాసికి గృహస్థునికంటెను గౌరవము

గల ఆచారము -

సన్న్యాసి యెప్పుడును గృహస్థునకంటెను - హోదాలో
కుఁడు కావున, సన్న్యాసి - గృహస్థుని గౌరవింపగూడదు నమ
కారము చేయరాదు

గల ఆచారము

శ్రీ పాంచరాత్రాగమశాస్త్రానుసారము - శ్రీవైష్ణవు
లును సమానులే వారి హోదా - ప్రత్యేకమైన ప్రతిభనుబట్టి
మంచును సన్న్యాసియు పునీతుఁడేకాన, గౌరవనీయుడే కాని,
న్యాసియు - విశేషమైన యోగ్యత గల గృహస్థుని గౌరవింప
లెను

### 2. వితంతువుల శిరో ముండనము

గల ఆచారము :-

వితంతువులు శిరోముండనము చేయించుకొనవలెను.

తెంగల ఆధారము —

వితంతువులు శిరోముండనము చేయించుకొనరాదు

## 3. పార్వణ శ్రాద్ధము

వడగల ఆధారము -

పార్వణ శ్రాద్ధము - అందఱును ఆచరింపఁదగినదే

తెంగల ఆధారము -

అధిక సంఖ్యాక వర్గములు ఈ పారణ శ్రాద్ధమును వ్య
తిరేకించుచున్నవి.

## 4. ఏకాదశీ శ్రాద్ధము

వడగల ఆధారము -

శ్రాద్ధమును ఆ తిథినాఁడే చేయవలెను ఏకాదశి ఉప
దినము కాన, ఇంకొక దినమునకు శ్రాద్ధమును మార్చుకొనఁ
ఆగమ శాస్త్ర ప్రకారము-ఏకాదశి - ఉపవాస ముండవలెను 
ఆగమ శాస్త్రము - ధర్మ శాస్త్రమును అతిక్రమింపఁజాల
(అనఁగా ఇచట - ధర్మశాస్త్ర ప్రమాణమే ఆచరణీయ
తాత్పర్యము )

తెంగల ఆధారము -

ఏకాదశి - శ్రాద్ధతిథి యైనచో - మఱునాఁడు శ్రాద్ధ
చేయవలెను ఏకాదశీతిథి సర్వోత్తమమని-శాస్త్రములన్నియు ఉ
ద్ఘోషించుచున్నవి, పవిత్రత - అన్నిటికంటెను మించినదని వేద
దేశికులే యంగీకరించిరి

## 5. పూజా విధానము - ఆచార్యులకు విగ్రహారాధన

**వడగల ఆచారము -**

వేదాంతదేశికుల విగ్రహారాధన - వడగలవారి కందఱకును ఆవశ్యకము ఇటీవల - వడగలలు - ఆదివన్ శఠకోపన్‌కు విగ్రహము నేర్పరచిరి అదియునుఁగాక, తమ గురువులకును అదియే చేసిరి.

**తెంగల ఆచారము :-**

పిళ్ళలోకాచార్యులవారియొక్కయు, మణవాళమహామునుల యొక్కయు - విగ్రహారాధనము తెంగల సంప్రదాయు లందఱకును ఆచరణీయమే. దేవాలయము లన్నింటియందును - దేవతా విగ్రహ ములేకాక, ఆచార్య విగ్రహములును గలవు.

## 6 ఆచార్యుల విగ్రహారాధన

**వడగల్ :-**

ఆచార్యుల విగ్రహారాధనము అందఱకును ఆవశ్యకమైనది. ముఖ్యముగా - రామానుజుల విగ్రహారాధన - ప్రస్తుత కాలమున - అంతటను జరుగుచున్నది కాని, ఇది - ఇతరాచార్యులలోనికి రాలేదు. అచ్చ టచ్చట - ఇతరులైన కొందఱి ఆచార్యుల విగ్రహారాధనము జరుగుచున్నది నాథమునులకు శ్రీరంగములో విగ్రహ మున్నది యామునాచార్యులకు శ్రీరంగమునందును, కొన్ని ఇతర స్థలములం దును విగ్రహము లున్నవి. తిరుపతిలో - అనంతాళ్వారుకు - వారి సంతతివారు నివసించు కావులలో - విగ్రహము లున్నవి. ఇటీవల - కాంచీపురములో - నంబిళ్ళ విగ్రహము, మేలుకోటలో - నంజీయరు

విగ్రహము, పెరియనంబి విగ్రహము - స్థాపింపబడినవి. కూ
విగ్రహము పరిచితమే ముదలియాండాన్ విగ్రహములు - అరు

తెంగలే :-

ఇది - తెంగలులకును అంగీకారమే

పరమాత్మయైన విష్ణువు ఒక్కఁడే - వైకుంఠమందును,
తారులందును, సకల విగ్రహములందును - ఒకేసారి -
మానుఁడు కాగలఁడు. జీవాత్మలు ఎపుడైనను - ఒకచో
యుండును.

**7 గోష్ఠి పారాయణ పరిసమాప్తి క్రమము (సాతు ముఱై**

గోష్ఠీపారాయణములో - పూజ లన్నియు పూర్తి యు
పూజ ముగించుటను - 'సాతు' అందురు. 'ముఱై' అనగా -

మొదట - రామానుజులను స్తుతించి, అనంతరము - వే
దేశికులనో, మణవాళ మహామునులనో - స్తుతింతురు వేదాం
కుల స్తోత్రము - 'రామానుజ దయాపాత్రం' అనుటతో ఆ
మగును అనఁగా - ఆరంభమున - దేశికుల ఆచార్యులగు అ
రామానుజులను స్మరించుట మణవాళ మహామునుల స్తోత్రవ
'శ్రీశైలేశ - దయాపాత్రం' అని - మొదలిడబడును. ఈ
నర్గములవారును - ఇట్టి ప్రార్థనా శ్లోకములను రచించి, ప్రకటి
కావున, ఈ రెండు శ్లోకములలో - దేనిని పఠింపవలెను ? అను
ఒక జటిల సమస్య కాఁగా, వడగలులు - వేదాంత దేశికుల
తనియన్ పఠింపవలె ననియు తెంగలులు - మణవాళ మహా మ
తనియన్ పఠింపవలెననియు - నిర్ణయించిరి ప్రతివాది భయంకరు
ఈ రెంటికిని మధ్యే మార్గముగా, ఆ రెండు తని యనులను
వలెనని నిశ్చయించిరి.

## 8. నామము యొక్క రూపము - నడిమి నామము

గల ఆచారము -

నడుమ నుండు నామము - శ్రీచూర్ణముతో - ఎఱ్ఱగా ండవచ్చును. లేక - పసుపుతో - పసుపుపచ్చగాను - ఉండ చ్చును. ఈ నడుమ నామము - శ్రీకి సంబంధించినది. ఆమెకు - ఈ ంను రంగులును సమ్మతములే.

గల ఆచారము :-

నడుమ నుండు నామము - ఎఱుపు రంగులో - శ్రీచూర్ణము నే యుండవలెను. శ్రీచూర్ణము - పసుపులోనే తయారగును నుక, ఇది శ్రీదేవికి సంబంధించినదే కాని, వేఱు కాదు.

## 9. శ్వేత నామము యొక్క రూపము

వడగల ఆచారము :-

రెండు నామములును - కనుబొమల నుండి మొదలై, శిరోజ ముల వఱకు వ్యాపింపవలయును. రెండు నామములును - ఎంత మాత్రము - కనుబొమలనుండి, నాసిక గట్టుమీదకు గాని, ప్రక్కకుం గాని జారకూడదు.

రెండు నామములు - దీర్ఘ చతురస్రాకారముగా గాక, వర్తులా కారముగా సంధింపఁబడవలెను. దీని మూలమున, ముఖముమీఁది శ్వేత నామము సర్వమును - అర్ధగోళాకారముగ కప్పి, ఒకే రేఖగా నుండవలెను.

తెంగల ఆచారము -

తెల్ల నామములు నాసికను పూర్తిగాఁ గాని, కొంత భాగవ గాని - కప్పి, భగవంతుని రెండు పాదములకు ప్రతినిధులై, ఒ దానితో నొకటి మిళితమై యుండవలెను నాసికమీఁద వ్యాప్తి రెండు పాదములకు పీఠ మని సంకేతము ఆ పీఠము - 'రామానుః మని భావింపవలెను, అది మనలను - భగవానుని పాదములకు లగి పఁజేసి, మనకొఱకు దానిని ధరింపఁజేసి, శ్రీవైష్ణవ మతోద్ధార లైన రామానుజుల ప్రతిరూపముగా సంభావింపఁచేయును.

"నాసాది కేశ పర్యన్తం - ఊర్ధ్వపుండ్రం వినిక్షిపేత్"

రెండు నామముల యాకృతి - నాసికా మూలమునుండి కే పర్యంతము ఊర్ధ్వపుండ్రాకృతి యని - నారదోపనిషత్తు వివరించ చున్నది. ఇట్లే - పాద ద్వయాకృతి - ఊర్ధ్వపుండ్రము - నాసా కేశ పర్యంత మని మహానారాయణోపనిషత్తు కూడ స్పష్టవ గావించుచున్నది.

## 10 నామాకారమును గూర్చి - కాత్యాయనోపనిషత్తు

వడగల ఆచారము

పూర్వాభిప్రాయము ..

శ్వేత నామము భగవంతుని పాదమునకు ప్రతిరూపమ వేదాంతదేశికులు - 'సచ్చరిత్ర రక్ష' యను తమ గ్రంథమునందు నామమునకు పదునొకండు ఆకారములను పేర్కొనియున్నారు. ఆ సాధారణ వైష్ణవులకేగాని, ప్రపన్న శ్రీవైష్ణవులకు - హరిపాద కృతియే నియత మని సిద్ధాంతీకరించిరి. ఆ పదునొకరకు రూపమ

వి - 1 వత్తి దీపాకృతి, 2 వెదురాకు ఆకృతి, 3 పద్మ ముకుళము, 4 పద్మ దళము, 5 మత్స్యాకృతి, 6 కూర్మాకృతి, 7. శంఖాకృతి, 8 చింతాకు రూపము, 9. శూర్పాకృతి, 10. మోహినీ పత్రరూపము, 11 మోహినీ పుష్ప రూపము.

తెంగల ఆచారము -

నాసాది కేశ పర్యంతము ఊర్ధ్వపుండ్రము - విష్ణుపాదాకృతి యనియు, కమలాకారముగ పాద మొక యంగుళము పొడవు వఱకు నుండవలె ననియు - హయగ్రీవ సంహిత బోధించుచుండగా, నాసికా పీఠము రెండంగుళము లుండవలె నని - పరాశర సంహిత సూచించుచున్నది ఇది యిట్లుండ, నాసికలో మూడవ వంతు - నాసికా మూలమునకు బైకు నని పద్మ సంహితయు, పాదపీఠమును, లక్ష్మియు కలిపియున్న దని బృహత్సేన సంహితయు - తెలుపుచున్నవి అంతియగాక, కొన్ని గ్రంథములు - మూడును నామములను, అ × ఉ × మ - అను సంకేతము లనియు, ఆ మూడును కలిసి, ప్రణవ మగుననియు, వానిలో - అకారము విష్ణు వాచక మనియు, ఉకారము - లక్ష్మీ వాచక మనియు, మకారము జీవ వాచక మనియు - ఉద్బోధించుచున్నవి.

## 11. శ్రీపాద తీర్థము

వడగల ఆచారము :-

విప్రుని కుడి పాదమును ప్రక్షాళనము గావించిన జలమే శ్రీపాద తీర్థము.

తెంగల ఆచారము :-

ద్విజుని పాద ద్వంద్వమును ప్రక్షాళన గావించిన జలమే శ్రీపాద తీర్థము

## 12 వ్యక్తిగత - సామాజిక ప్రపత్తులు

వడగల ఆచారము -

ప్రపత్తి - సామాజికముగా నుండవలెను. ఆ ప్రపత్తిని మఱల మఱల చేయవలెను.

తెంగల ఆచారము -

సాష్టాంగ నమస్కారము - వ్యక్తిగతము కారాదు

వ్యక్తిగత ప్రపత్తికిని-ఒక నమస్కారము చాలును ప్రపత్తి - సాష్టాంగ నమస్కారములకు పరమాత్ముని దయ కారణము కాదు. కావున, అధిక సంఖ్య - దాని సామర్థ్యమును, ఫలితమును వృద్ధి చేయలేవు

విభీషణ శరణాగతి వృత్తాంతములో-'సకృదేవ ప్రసన్నాయ' ఒక్క సాష్టాంగ నమస్కారమే చాలునని శ్రీరాముఁడు వక్కాణించెను

## 13. పంచ సంస్కారము

వడగల ఆచారము -

పంచ సంస్కారములు జరిగి తీరవలెను.

గల ఆచారము -

పంచ సంస్కారములు అనివార్యములు కావు

## 14 పంచ సంస్కార దండ స్పర్శము

గల ఆచారము -

సన్న్యాసి - పంచ సంస్కార దండములను స్పృశింపరాదు. తులపాకుతో గాని, అరటి యాకుతో గాని - మూసికొనవలెను.

గల ఆచారము -

సన్న్యాసియు - లోహములను స్పృశింపవచ్చును.

## 15 ప్రణవ మంత్రోపయోగము

డగల ఆచారము :-

వేద మంత్రములను బోధించుట - పంచ సంస్కారములలో నొకటి.

వేదములను, వేదమంత్రములను - స్త్రీ - శూద్రులకు నేర్పరాదని ధర్మశాస్త్రము తెలుపుచున్నది. ప్రణవ వేదసారమును స్త్రీ - శూద్రులకు నేర్పుటలో - అందుఁ గల 'ఓమ్' అను ప్రణవమును మానవలెను.

తెంగల ఆధారము –

వేద మంత్రమును అందఱకును బోధింపవచ్చును పంచసంస్కారములు – పాంచరాత్రాగమానుసారము జరుగవలెను తమ యభీష్టానుసారము వానిని ప్రకటించుటకు – ఎవటికిని హక్కు లేదు

వేద మంత్రమగు అష్టాక్షరిలో – ఒక అక్షరము తగ్గించినను – అది వేద మంత్రము కాదు మంత్రముయొక్క సారాంశము – దాని అమోఘత్వము – దానిలో ఒక్క స్వరమును తగ్గించినను – దాని లక్షణము నశించును

" మంత్రో హీనః స్వరతో వర్ణతో వా
మిథ్యా ప్రయుక్తో న త దర్థ మాహ "

అను వాక్యమే ఇందులకు పరమ ప్రమాణము

ప్రణవ మంత్రమును మానినయెడల, ఆగమ శాస్త్ర ప్రకారము – అది వేద మంత్రమే కాదు అప్పు డా సంస్కారము – అశాస్త్రీయ మగును

రెండు శ్వేత నామములకును ఒక పీఠము కావలె ననియు, అందుకును ఒక పద్మపీఠ మూహింపఁబడెను పద్మపీఠము గాని, దానిని బోలిన మఱి యేది గాని – నిలువుగా నుంచుట ఆవశ్యకము.

తిరుమల శ్రీనివాసుని నామము – దీర్ఘ చతురస్రాకారము అది – వడగల వారి నామము కాదుసుమా !

ఈ రూపము లన్నియు - తెంగల నామమువలె - పీఠము గినట్టివే

## చివరి మాట

పైన పేర్కొనఁబడిన సిద్ధాంత - రాద్ధాంతములేగాక, మఱి న్ని భేదములును ఇరు వర్గములలో నున్నట్లు తెలియవచ్చుచున్నది ని, వడగల - తెంగల సంప్రదాయములందు గల భేదములను లీ పులాక న్యాయమున వ్యక్తము చేయుటయే ఈ రచనలోఁ గల ఖ్యోద్దేశము కావున, ఈ రచనను ఇంతటితో ముగించుటయైనది



# శ్రీ వరదరాజ క్షేత్ర వైశిష్ట్యము

' విద్యా భూషణ - కవితా విశారద '

శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు

శ్రీ రామానుజ కీర్తి కౌముదీ సంపాదకులు

★

## 1 క్షేత్ర పరిచయము

" పుష్పేషు జాతీ - పురుషేషు విష్ణుః
నదీషు గంగా - నగరీషు కాంచీ "

పుష్పములలో - జాజి (మాలతి), పురుషులలో - విష్ణువు, లలో - గంగ, నగరములలో - కంచియు ప్రసిద్ధములని - కాళి మహాకవి వక్కాణ

ఇంతటి ప్రాముఖ్యమును సంతరించుకొనిన కాంచీపు దేవాలయములకు తావలముగా, సంగీత - సాహిత్యములకు ని ముగా, చిత్ర - శిల్ప - హస్త కళలకు కాణాచిగా, వివిధ ప్రచార స్థానములకు కేంద్రముగా, హిందూ సంస్కృతీ ప్రసా నకు ప్రధాన పీఠముగా - వెలకొలది సంవత్సరములనుండి విఖ్యాతిఁ గాంచియున్నది

అంతియేఁ గాక, అనేకులగు దార్శనికులకు భక్త సంస్కృత విద్వాంసులకు, ఎందరో రాజన్యులకు, మరెందరో . నీయులకును - ఆశ్రయ మొసంగిన మహానగర మది

పన్నిద్దరాళ్వారులలో ప్రథము లగు పొయిగై యాళ్వారు ...
...కృతభాషలో ఉద్దండ పండితునుగా ఖ్యాతి గాంచిన దిండి
...కవికి, సంస్కృత భాషలో అర్థశాస్త్రమును రచించి పేరుగాంచిన
...క్యునకును - ఈ కాంచీ పురమే జన్మస్థానము

వేద విరుద్ధము లగు వివిధ మత సిద్ధాంతముల బారినుండి ...
...ంచి - అద్వైత మత స్థాపనం జేసిన శంకరాచార్యులకు శ్రీసంప్ర...
...మమును పునరుజ్జీవింపం జేసిన భగవద్రామానుజులకును - ఈ
...చీపురమే ప్రధాన కేంద్ర మయ్యెను

ఈరీతిగా ప్రసిద్ధి గాంచిన ఈ కాంచీపురము - నేటి తమిళనాడు
...సస్థానమునకు కేంద్రస్థానముగాం గల మద్రాసు మహానగరమునకుం
...త్తర పశ్చిమమున, 60 కిలోమీటర్ల దూరములోం గలదు

ఈ కాంచీపురమునకు - అనేక నామాంతరము లున్నవి అట్టి
...నిలో - కాంచీపట్టణము, కాంచీపురి కంచి, కాంజీవరము -
...వ్వగు నామములు కలవు కాని, 'కాంచీపురము' అను నామమే
...గుళ ప్రచారములో నున్నది

ఈ కాంచీపురము - 'హస్తిగిరి' యనియు, 'సత్యవ్రత క్షేత్రి'
...నియును - వ్యవహరింపంబడుచున్నది దీనికి - 'స్వర్ణపురి' యనియు
...మాంతరము కలదని ప్రతీతి

## 2 పల్లవరాజుల పరిపాలన

క్రీస్తుశకము 4 - వ శతాబ్దము మొదలు - 9 - వ శతాబ్దము
...లకు, ఉత్తరమున కృష్ణానది మొదలు - దక్షిణమున కావేరీనది

వఱకు గల ప్రాంతమును పరిపాలించిన పల్లవరాజులకు - ఈ
పురము రాజధానిగా నుండెడిది. ఈ పల్లవ రాజులు - తమ
లన కాలమున - ఈ నగరమునందు విశాలమైన వీథులను,
దేవాలయములను నిర్మించిరి ఈ పల్లవ రాజులు - పండితులను,
లను, కళాకారులను - మిక్కిలి గౌరవించుచుండెడివారు నేడు
పురమున కానవచ్చు కళా ఖండములు - ఈ పల్లవరాజుల
రుచిని ద్యోతకము చేయును

### 3 చోళరాజుల పరిపాలన

పల్లవుల యనంతరము చోళరాజులును - ఈ కాంచీపుర
రాజధానిగా జేసికొని, 10 - వ శతాబ్దము మొదలు, 12 - వ
బ్దము వఱకును - రాజ్యపాలనము గావించిరి ఈ చోళరాజులు
పు ములోపలను, వెలుపలను - అనేక భవనములను నిర్మించు
ఆ నగరమున గల దేవాలయములను కళాత్మకములుగా తీర్చిది
యందు మిగుల శ్రద్ధాసక్తులు చూపిరి

### 4. పాండ్యరాజుల పరిపాలన

చోళరాజుల యనంతరము 12 - వ శతాబ్దాంతమున - పా
రాజుల పరిపాలన మారంభ మయ్యెను ఈ పాండ్యరాజులు
పురమున వివిధ కళలను వికసింపజేయుటకును, హిందూసంస్కృ
పునరుజ్జీవింపజేయుటకును, విశేషమైన ఆసక్తి జూపుచు,
ప్రాకార మండపాదులతో దేవాలయములను సంశోభిల్ల జేసిరి.

## 5 విజయనగర రాజుల పరిపాలన

పాండ్యరాజులను 18 - వ శతాబ్దమున పరాజితుల గావించి,
లనమును కొనసాగించిన మహమ్మదీయులను విజయనగ
రు జయించి, తమ సామ్రాజ్యమును స్థాపించిరి ఈ విజయనగర
రు - దక్షిణ భారతదేశమునందంతటను - తమ ఆధిపత్యమును
ల్పి, హిందూ మత సంస్కృతులను పునరుజ్జీవింపజేసిరి

విజయనగర రాజ్యమును పరిపాలించిన రాజులలో - శ్రీకృష్ణ
రాయలు విద్వత్కవిగా, సాహితీ సమరాంగణ సార్వభౌముడుగా,
ధ భోజుడుగా, ఆముక్తమాల్యదా ప్రబంధ నిర్మాతగా -
డ యశమును సముపార్జించిన ప్రతిభావంతుడు రాయల యుగ
(1509 - 1539) సంస్కృతాంధ్ర సాహిత్యములు సర్వతోముఖ
సమును గాంచినవి వాస్తు కళకు, శిల్ప కళకును - మిగుల సము
లభించినది ప్రాచీన దేవాలయము లనేకములు జీర్ణోద్ధరణము
ంపబడినవి. దేవాలయములకు నలువైపులందును గొప్ప గొప్ప
కారములు నిర్మింపబడినవి

## 6 నాయక రాజుల పరిపాలన

విజయనగర సామ్రాజ్య మంతరించిన యనంతరము - ఆ
జ్యము మరల మహమ్మదీయుల హస్తగత మగుటచే, ఆ రాజ్య
భవ మంతయు అంతరించెను. అట్టి తరుణమున - మధుర నాయకరా
అచ్యుతరాయలు, ఆ మహమ్మదీయులపై దండెత్తి, వారిని
ించి, తంజావూరును తమ రాజధానిగా చేసికొని, పరిపాలనమును
నసాగించెను.

ఆచ్యుతరాయలు —

ఈ అచ్యుతరాయలు విద్వాంసుడుగా, విష్ణుభక్తుడుగా, ధర్మస్వరూపుడుగా విఖ్యాతి వహించెను ఇతడు - 'రఘునాథ నాయకాభ్యుదయ' మను పేర నొక మహా కావ్యమును రచించి, రసజ్ఞులచే బహువిధములుగా ప్రశంసింపబడెను ఆంధ్రదేశీయు లగు సంగీత - సాహిత్య విద్వాంసులను సమాదరించుటలో - విశేషమైన గౌరవాభిమానముల జూపెను ఇతడు - తన తనయు డగు రఘునాథరాయనిపై క్రీ శ 1600 సంవత్సరములో రాజ్యభారము నిడి, భగవ ద్దాస్యమునందును, భాగవత తదీయారాధనమునందును - జీవిత శేషమును వెచ్చించి, శాశ్వత యశమును గాంచెను

౨ రఘునాథరాయలు -

ఈ రఘునాథరాయలు రాజ్యభారమును వహించి క్రీ శ 1631 సంవత్సరము వఱకు పరిపాలించెను ఇతడును - తన తండ్రి వలెనే వైష్ణవ మతాభిమానియై, విష్ణు భక్తుడై, రాజ్యపాలనము గావించి, కృతికర్తగా - కృతిభర్తగా విఖ్యాతి గాంచిన విజ్ఞానవేత్త పారిజాతహరణము, వాల్మీకి చరిత్రము, గజేంద్ర మోక్షము, జానకీ పరిణయము, రుక్మిణీ కల్యాణము - మున్నగు కావ్య రత్నములను రచించి, విద్వత్కవిగా పేరుగాంచిన మహామనీషి

ఈ రఘునాథరాయలు కేవలము సాహిత్యమందే గాక, సంగీత విద్యయందును అసమానమైన ప్రతిభా వ్యుత్పత్తులు గల రాజశేఖరుడు ఇతడు - జయంతసేన, రామానందము వంటి అపురూప రాగములను సృజించు టేగాక, 'రఘునాథవీణ' అను నొక వాద్య విశేషమును సైతము సృష్టించి, రసజ్ఞ సార్వభౌముడుగా విఖ్యాతిం గాంచెను

ఈ రఘునాథరాయలు - అనేక దేవాలయములను, గోపుర కార మండపాదులను నిర్మించెను. తులా పురుషాది దానములు ను నిరతాన్నదానముచేత - భూసురుల దన్పెను.

రాఘవనాయకుడు -

రఘునాథరాయల యనంతరము - ఆతని కుమారు డగు రాఘ ాయకుడు క్రీ. శ. 1631 సంవత్సరము నుండి - 1673 సంవత్సరము కును రాజ్యమును పరిపాలించెను. ఇతడు - అష్ట భాషా కోవి డు అనేక యక్షగానములను, ద్విపద కావ్యములను, గోపికా ములను, విప్రనారాయణ చరిత్రను రచించుటేగాక, 'రఘునాథ యకాభ్యుదయ' మను పేర, తన జనకుని ప్రజ్ఞాప్రాభవములను భివర్ణించుచు - ద్విపద కావ్యమును నవ రస భరితముగా రచించిన సార్వభౌముడు.

ఈ రాఘవనాయకుని పరిపాలన కాలమున, తనచేతను, దితర ఆస్థాన కవులచేతను-యక్షగాన పద రచనలు అసంఖ్యాక ుగ రచింపఁబడినవి. ఈ కారణము వలన, ఈతని పరిపాలన కాలము-యక్షగాన రచనలకు స్వర్ణ యుగముగా సంభావింపబడు మన్నది. పదకర్త యగు క్షేత్రయ్య - ఈతని యాస్థానమునందును, ఈతని తండ్రియాస్థానము నందునుగూడ - చాల కాల ముండి, వేల కొలది పదములను రచించినట్లు తెలియుచున్నది. కాని, అట్టి పదము లలో - విజయరాఘవ నామాంకితములైన పదములు నేడు 13 మాత్రమే కానవచ్చుచున్నవి.

ఈ నాయక రాజుల యుగమున సంగీత సాహిత్యము చిత్రకళలు, వాస్తు కళలు పుష్కలముగా శోభతో ప్రకాశించినవి. దేవాలయములు మరల నూతన తేజమును సంతరించుకొని దివ్య వైభవముతో శోభిల్లినవి

## 7 హస్తిగిరి ప్రశస్తి

కాంచీపురమును దేవాలయముల నగరముగా ప్రశస్తి గాంచినది. ఈ నగరమున దేవాలయములు అనేక సంఖ్యలో నుండుటయే ఇందులకు కారణము. అనేక శతాబ్దముల నాటి, కళాత్మకములైన దేవాలయములను ఎన్నింటినో ఈ నగరమున, అధిక సంఖ్యలో గాంచగలము. ఈ కాంచీపురమున గల దేవాలయములలో శ్రీ వరదరాజస్వామివారి దేవాలయము అతి ప్రసిద్ధమైనది. దేవాలయము - 'హస్తిగిరి' యను పేరు గల ఒక చిన్న కొండ గలదు. ఈ దేవాలయ వైభవ మంతయు 'హస్తిగిరి మహాత్మ్యము' అను గ్రంథమునందు విపులముగా వర్ణింపబడియున్నది

> "కృతే యుగే దేవరాజః - త్రేతాయాం రంగనాయకః
> ద్వాపరే తు జగన్నాథః కలౌ వేంకటనాయకః."

అను సూక్తి ననుసరించి, కాంచీపురమున గల హస్తిగిరిపై నెలకొనియున్న శ్రీ వరదరాజస్వామి యుగ యుగములందుండియు భక్త భాగవతోత్తములకు తన దర్శన భాగ్యమును ప్రసాదించుచున్న స్పష్ట మగును. అందువలన, ఈ హస్తిగిరి క్షేత్రమెంతటి ప్రశస్తమైనదో - మనకు సులభముగా బోధపడగలదు. ఒకానొక యుగమున చతుర్ముఖ బ్రహ్మ - ఇచట శ్రీ వరదరాజస్వామికి

ష్ఠించి, తపస్సును, యజ్ఞమును చేసి, స్వామియనుగ్రహభాగ్యమును
పొందినట్లు చరిత్ర ప్రసిద్ధి

శ్రీ వరదరాజస్వామి, ఆలయ ప్రాకారము 1000 అ
పొడవు 800 అడుగుల ఎత్తు కలిగి యుండును ఆలయమున -
స్థల మూర్తి (మూలవిరాట్టు) సుమారు 6 అడుగుల ఎత్తు కలిగి,
నిలుచున్న భంగిమలో - దివ్య సుందర ముగానుండి - విలువగ
వస్త్రాభరణములను ధరించి, సుగంధ సుమ దామములను అలంకరించు
కొని, భక్తులకు దర్శన భాగ్య మొసంగుచుండును స్వామికి
అమూల్యములైన స్వర్ణాభరణము లనేకములు గలవు, స్వామికి అ
ముఖముగా బంగారు కాంతులతో - ధగ ద్ధగాయమానముగ విరా
గరుడ ధ్వజము కలదు దేవాలయ ద్వారముపై రూపచిత్రము
ములు చిత్రీకరింపబడినవి మహోన్నత మగు ఈ దేవాలయ గో
రము చూపరులకు ఆనందాశ్చర్యములను గల్గించుచుండును
యాత్రికులు అచటగల కోటితీర్థమున మజ్జన మాచరించి, అనంతర
శ్రీస్వామిని దర్శించుట - ఆచారముగ నున్నది.

## 8 బ్రహ్మోత్సవ వైభవము

ప్రతి సంవత్సరము వైశాఖ మాసమున శ్రీ వరదరాజస్వా
నవాహ్నికముగా - బ్రహ్మోత్సవము మహా వైభవముగా - జర
చుండును ఈ మహోత్సవమును సేవించు నిమిత్తము - దూర ప్రా
ములనుండియు వేలకొలదిమంది భక్తులు, భాగవతోత్తముల
వచ్చుచుండురు గరుడ సేవ సమయమునను, రథోత్సవ సమయ
నను - దాదాపు లక్ష మంది యాత్రికులు వచ్చుచుందురు స్వామి

నిత్యార్చనలు, బ్రహ్మోత్సవాదులు, సర్వము - శ్రీ పాంచరా శాస్త్రానుసారముగ నిర్వర్తింపబడుచున్నవి.

## 9 దేవాలయ శిల్ప సౌందర్యము

శ్రీ వరదరాజస్వామి దేవాలయమునందలి పై భాగమున గోపురములును, ఆలయమున గల సహస్ర స్తంభ మండపములు, శిల్పకళా సౌందర్య శోభితములై, నిత్య నూతనములుగా కానవచ్చుచుండును ఈ శిల్ప సౌందర్యమును ప్రముఖు లనేకులు తిలకించి పలు విధములుగా ప్రశంసించియున్నారు. అట్టి దివ్యసుందర వీః మగు ఈ దేవాలయ ప్రాంగణమున - శ్రీ లక్ష్మీదేవి ఆలయ శ్రీ నరసింహస్వామి ఆలయము కూడ కలవు. ఇచట గల గాజు మండపము సేవింపదగినది.

## 10. మత ప్రచారము

శ్రీ వరదరాజస్వామి దేవాలయము చరిత్ర ప్రసిద్ధి గల దివ్య క్షేత్రము. 11-వ శతాబ్దమున, దాదాపు అఱువది సంవత్సర ప్రాయము వఱకును భగవద్రామానుజులు ఈ దేవాలయ ప్రాముసంకే నివసించి, శ్రీ విశిష్టాద్వైత మత ప్రచారము గాః టయే ఇందుకు ప్రబల కారణము.

## 11 స్తోత్ర వాఙ్మయము

(1) శ్రీమ ద్వరద రాజేంద్ర ! శ్రీవత్సాంక శుభప్రద !
తుండీర మండలోల్లాసి - తాపత్రయ నివారక ॥ (1)

్యదిగా - 8 శ్లోకములలో - శ్రీ వరదరాజ స్తోత్రి మనుపేర - ద పురాణము - కాంచీక్షేత్రమున వేంచేసియున్న శ్రీ వరదరాజ మిని వర్ణించియున్నది

అదియునుంగాక,

(2) పన్నిద్దరాళ్వారులలో నొకరుగా ప్రసిద్ధి గాంచిన తిరు ్గై యాళ్వారులు - ఈ దివ్య క్షేత్రమున కరుదెంచి, శ్రీ వరద జస్వామిని సేవించి, స్తుతించుచు - ద్రావిడ భాషలో అనేక పాశు ములను రచించిరి.

(3) శ్రీ రామానుజాచార్యులవారి గురుపరంపరలో నొక ు కాంచీపూర్ణులు - కంచి వరదరాజస్వామిని స్తుతించుచు, 'దేవ 'జాష్టక' మను పేర 8 శ్లోకములను రచించిరి

(4) నేత్ర ప్రాప్తికై, కంచి వరదరాజస్వామిని స్తుతింపవలసిన ని భగవద్రామానుజులు - తమ యంతరంగ శిష్యులలో నొక రగు శ్రీవత్సచిహ్నమిశ్రులను ఆదేశింప, ఆ యాదేశమును శ్రీవత్స హ్నమిశ్రులు శిరసావహించి, కాంచీపురమున కేతెంచి, 'శ్రీ వరద రాజ స్తవ' మను పేర, వివిధ వృత్తములు గల 102 శ్లోకములలో శ్రీ వరదరాజస్వామిని ప్రస్తుతించి, మరల యథాపూర్వముగ నేత్ర ములను పొందిరని, చరిత్ర ప్రసిద్ధి

(5) 'కవితార్కిక కేసరి' - 'సర్వతంత్ర స్వతంత్ర' బిరుదాలం కృతు లగు శ్రీ వేదాంతదేశికులు - శ్రీ వరదరాజస్వామిని స్తుతిం చుచు - 'వరదరాజ పంచాశత్' అను శీర్షికతో - 50 శ్లోకములను రచించిరి.

(6) శ్లేష-యమక చక్రవర్తిగా విఖ్యాతి గాంచిన అత్రే[య] వేంకటాధ్వరి - బ్రహ్మాండ పురాణాంతర్గత మగు కాంచీ మాహాత్మ్య[ము]నందలి శ్రీ వరదరాజస్వామి అవతార విశేషములను, 'వరదాభ్యుదయ[ము]' అను పేర, 40 అధ్యాయములలో నొక మహా కావ్యము [illegible] న త్రముగా రచించిరి.

(7) విద్వత్కవిగా విఖ్యాతి వహించిన అప్పయ దీక్షితులు 108 శ్లోకములలో - శ్రీ వరదరాజస్వామిని స్తుతించుచు - 'వరదరాజ స్తవ' మను పేర నొక స్తోత్రమును రచించెను

* (8) తెలుగులో క్రీ శ 15 వ శతాబ్దమునకు చెందిన దగ్గుపల్లి దుగ్గనకవి "కాంచీపుర మాహాత్మ్యము" అను పేర ఒక మహాకావ్యమును రచించి యున్నట్లును,

* (9) కుడిచెర్ల తిప్పరాజు అను నొకకవి "కాంచీమాహాత్మ్యము" అను పేర ఒక కావ్యమును రచించినట్లును తెలియవచ్చుచున్నది

## 12. సంకీర్తన వాఙ్మయము

కర్ణాటక సంగీతములో అగ్రగణ్యుడుగా ప్రసిద్ధి గాంచిన త్యాగరాజు - కంచి వరదరాజస్వామిని, సేవించి, స్తుతించుచు - అనేక కీర్తనలను రచించెను అట్టి వానిలో - స్వరభూషణి రాగమున గల 'వరదరాజ ! నిన్నే కోరితి', రాగపంజర రాగమున గల 'వరదా నను బ్రోవరా' - ఇత్యాది కృతులు - సుప్రసిద్ధములై యున్నవి

* తెలుగులో అలభ్య వాఙ్మయం పుట. 21

-త్యాగరాజునకు సమకాలీనుడును, ప్రసిద్ధ వైష్ణవ భక్తుడు
ం - అల్లూరి వేంకటాద్రిస్వామి - ఈ వరదరాజస్వామిపై నను,
ంగక్షేత్రము నందు గల రంగనాథునిపైనను - అనేక సంకీర్తన
ం రచించెను అట్టివానిలో 161 కీర్తనలు మాత్రము గ్రంథ
ములై యున్నవి

క్షేత్రయ్య పదములలో - 'కరిగిరి వరదా!' మున్నగు - సంబోధ
ం గల పదములు 18 కానవచ్చుచున్నవి

## 13 మంగళాశాసనము

శ్రీ వైష్ణవ ప్రముఖు లగు ప్రతివాది భయంకరం అణ్ణన్ స్వామిచే
ంపబడిన 'దేవరాజ మంగళాశాసనము' - శ్రీ వరదరాజస్వామి
న్నిధిలో - నాటి నుండి నేటి వఱకును అనుసంధింపబడుచునే
న్నది.

## 14. ముగింపు

శ్రీమన్నారాయణుడే వరదరాజస్వామి యను పేర వెలసిన
్య క్షేత్రముగా, ఎందఱో మహనీయులచేతను, వేందఱో మహా
క్తులచేతను, ఎందఱో పరమభాగవతోత్తములచేతను కీర్తింపబడి,
్యక్షేత్రముగా వెలసిన శ్రీవరదరాజ క్షేత్ర వైశిష్ట్యము వర్ణనా
మము. మఱియొక మాట !

ంనగా -

శ్రీవైష్ణవులకు ముఖ్యముగా మోక్షదం క్షేత్రములు సేవింపం
యున్నవి

(1) శ్రీరంగమునందలి శ్రీరంగనాథస్వామి - సాక్షాత్తు - రాయణమూర్తి. (=ద్వయము)

(2) కాంచీపురమునందలి శ్రీ వరదరాజస్వామి - అష్టాక్షరీ రూపుఁడు. (=అష్టాక్షరి)

(3) తిరుమలలోని శ్రీనివాస భగవానుఁడు - చరమ శ్లోక రూపుఁడు. (=చరమము)

కావున, శ్రీరంగము, కాంచీపురము, తిరుమల - అనఁబడు యాఁడు దివ్యక్షేత్రములును - శ్రీవైష్ణవులకు ముఖ్యముగా సేవింపఁ గియున్నవి.

తిరుమంత్ర - ద్వయ - చరమములు - కాంచీపుర, శ్రీరంగ, రుమల క్షేత్రము లని తెలియదగియున్నవి.

శ్రీహస్తి శైల శిఖరాగ్ర విరాజమానం
బ్రహ్మాది దేవగణవందిత సుందరాంగమ్
భక్త ప్రపన్న జన సేవిత పాదపద్మం
వందే జగత్త్రితయ పాలక దేవరాజమ్.

'స్వస్తి'

# కవి పండిత పరిచయము

## మాన్ - ఉత్పల సత్యనారాయణాచార్యులు

వీరి జననము 1929 ప్రస్తుత నివాసము - హైదరాబాదు మహానగర ౦దలి అలకాపురి

వీరు - బహు భాషా కోవిదులుగా, బహు గ్రంథకర్తలుగా, ఉత్తమ పాధ్యాయ బహుమాన గ్రహీతలుగా - సుప్రసిద్ధులు

నేటి భువన విజయ మహా సభలలో అలసాని పెద్దనగా, నంది తిమ్మనగా - ఖ్యతి గాంచిన వారు వీరు

వీరి రచనలలో (1) శరణాగతి పద్యకావ్యము (2) ఈ జంట నగరాలు-గామంత శిఖరాలు' అను వ్యంగ్య ప్రధానమైన పద్యకావ్యము(3)'ఉత్పలమాల'-ను భక్తిప్రబోధకమైన పద్యకావ్యము (4) 'రాజమాత' - అను ఇతిహాసిక వల - మున్నగునవి - సుప్రసిద్ధములు

వీరి గ్రంథములు-ఉస్మానియా, ఆంధ్ర కర్ణాటక విశ్వవిద్యాలయములలో - గాఠ్య గ్రంథములుగా సంభావింపబడియున్నవి

## శ్రీమాన్ - కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులు

వీరి జననము 1-7-1930 జన్మస్థానము - తిరుపతి జననీ జనకులు-వేంకట నరసింహాచార్యులు జానకమ్మ,గారలు విద్యాభ్యాసము-నెల్లూరు నందలి వేద



సంస్కృత కళాశాలలో ఉభయవేదాంతాధ్యయనము - పితృ పాదుల సన్నిధిలో డిగ్రీలు - 1 విద్యా ప్రవీణ 2 భాషా ప్రవీణ 3 ఎం ఏ, (సంస్కృతము )

ఉద్యోగము - నెల్లూరులో - వేద సంస్కృత కళాశాలాధ్యక్షులుగా చిర కాలము పనిచేసి, ఇటీవలనే ఉద్యోగ విరమణ గావించిరి

రచనలు : (ముద్రితములు) 1 శుకసందేశమ్ (సంస్కృతకావ్యమ్) 2.

ృత భాషా ప్రవేశిక (వ్యాకరణము) 3 వైకుంఠనాథ పంచాశ త్రము) 4 శ్రీమ న్నహోబిలగిరీశ్వర (పెంచలకోన) సుప్రభాతము 5 గతమ్ (ఖండ కావ్యము) 6 హాహా హూహూ (విశ్వనాథ సత్యనారయణగారి కు సంస్కృతానువాదము) 7 శ్రీభాష్య సారము - 1,2 భాగములు 8 గవద్గీతామృతము - 1,2,3 భాగములు 9 శ్రీ గోదా సహస్ర కమలమాలికా గోదా సహస్రనామ స్తోత్రము) 10 శిక్షావల్లి (చంద్రికా వ్యాఖ్యానముతో తామృతమ్' మేగజైనుతో

అముద్రితములు :- 11 రత్నమాలా (బెజవాద గోపాలరెడ్డి గారి వచన కు సంస్కృతానువాదము) 12 శర్వరీ (అకిలి శ్రీరామశర్మ గారి ఆంధ్ర కావ్యమునకు సంస్కృత పద్యానువాదము) 13 బాదరాయణ హృదయము రాయణ, బోధాయన సంవాద రూపమున బ్రహ్మ సూత్రార్థ వివరణము పుట) 14 ఉపనిష చ్చంద్రికా (ఆంధ్రమున ఉపనిషత్తులకు ప్రతిపదార్థ ర్యములు గలది ఛాందోగ్య, బృహదారణ్యకములు మినహా)

## మాన్ - పరవస్తు అప్పన్ గోవిందాచార్యులు

వీరి జన్మస్థానము-విశాఖ జిల్లా - దేవాడ జననము 1920 - వ శతాబ్దము



వీరు - సంస్కృత, ఆంధ్ర, ద్రావిడాది భాషలలో ఉద్దండ పండితులు ఉభయ వేదాంత విశారదులు విజయనగర మహారాజావారి సంస్కృత కళాశాలలో కొలది కాలము అధ్యాపకులుగా పనిచేసి, శ్రీమాన్ - శ్రీభాష్యం అప్పలాచార్య స్వామి వంటి శిష్యుల ననేకులకు-విశిష్టాద్వైత సంప్రదాయము ననుసరించి సంస్కృత వేదాంతమును, ద్రావిడ వేదాంతమును బోధించి, వారిని ఉభయ వేదాంతములలో ఉత్తీర్ణుల గావించిన మహనీయులు

వీరి రచనలలో - ఆంధ్ర టీకా తాత్పర్య సహితమైన శ్రీవైష్ణవ స్తోత్ర మాల' అను గ్రంథము - అత్యంతము ప్రసిద్ధమైనది

వీరిపుడు - పరమ పదవాసులై యున్నారు

## డాక్టర్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యులు



వీరి జన్మస్థానము-గుంటూరు జిల్లా, రేపల్లె తాలూకా, పెద్దవరము అగ్రహారము జననము 5-8-1949 విద్యాభ్యాసము 1) హైస్కూలు చదువు SSLC వఱకు ధూళిపూడిలో 2) తిరుపతి ప్రాచ్య కళాశాలలో విద్వాన్ (65-66) 3) కొవ్వూరు ఆంధ్రగీర్వాణ విద్యా పీఠమునందు - సాహిత్య విద్యా ప్రవీణ - మరియు, కర్ణాటకసంగీతము (66-71)

విశేష గురువులు : సాహిత్యములో-శ్రీయుతులు పేరిశ్రీరామమూర్తి గారు వేదార్థ విశారద'ధూళిపాళ రామచంద్రశాస్త్రిగారు, శల్యశ్రీరామమూర్తి శాస్త్రి గారు శ్రీమాన్ రొంపిచర్ల శ్రీనివాసాచార్యులుగారు సంగీతములో - సుప్రసిద్ధ వాయులీన విద్వాంసులైన తిరుపతి పొన్నారావుగారు వేదాంత దర్శనమున - శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులు గారు.

ఉద్యోగములు : ) 1971-72 సంవత్సరములలో - ద్వారకా తిరుమ దేవస్థానమునకు చెందిన హైస్కూలులో సంస్కృత పండిత పదవి 2) కొవ్వూరు ఆంధ్ర గీర్వాణ విద్యాపీఠము సంస్కృత కళాశాలలో సంస్కృతాధ్యాపకులు 1978 జనవరి నుంచి కొనసాగుచున్నది

ఉపాధులు సాహిత్య విద్యా ప్రవీణ, **M A** (వ్యాకరణము), **Ph** అలంకార శాస్త్రము, సంగీత సాహిత్యము లందును, నాటక రచన యందును,

నందును, అభిరుచి, అభినివేశము భారతీయ దర్శనములలోని విశేషము గ్రహించుట యందును, విశిష్టాద్వైత వేదాంత వైశిష్ట్యమును ఆకళించుకొనుట ను విశేష కృషి

రచనా వ్యాసంగము : 1) సంస్కృత సాహిత్య శాస్త్ర ప్రాముఖ్యమును చయు, జైన బౌద్ధాది నాస్తిక దర్శనములలోని యంశములలోని యంశము ఘటించియు, ఆలిండియా ఓరియంటల్ కాన్ఫరెన్సులలోను, మఱి కొన్ని గోను వీరు అనేక పత్రములను సమర్పించిరి 2) దార్శనిక విషయములకు, త విషయములకు సంబంధించిన వీరి వ్యాసము లనేకములు-పత్రికలందును సంచికలయందును ప్రకటింపబడినవి 3) భగవద్రామానుజులవేదార్థ సంగ్రహ ఆంధ్రానువాదమె గాక, త ద్వివరణము కూడ వీరిచేవివరించబడినది ఈ కము-తూర్పు గోదావరి జిల్లా మండపేటలోగలమెహర్ చైతన్యనికేతన్ ట్రస్టు 990లో ముద్రించి, ప్రకాశింపజేసిరి 4) 'హరిభక్తిసుధాకరము' అను నారద పురాణాంతర్గతమైన 20 అధ్యాయముల గ్రంథమునకు వీరు తెలుగు వివరణ వ్రాయగా దానిని కొవ్వూరులో గల గౌడియ మఠమువారు 1991 ఆగష్టులో ంచి, ప్రకటింపజేసిరి 5) విశిష్టాద్వైత సిద్ధాంత వైశిష్ట్య సంగ్రహ రూప 'వేదాంత కారికావళి' అను సంస్కృత గ్రంథమునకు వీరు ఆంధ్రాను ము, 'సుజన తోషిణి' వ్యాఖ్యను వ్రాయగా, గ్రంథమును మండపేటలో గల న్య నికేతన్ ట్రస్టువారు 1992 జూలైలో ముద్రించి ప్రకాశింపజేసిరి వీరిచే పబడి, నేటి వఱకు అముద్రితములుగా నున్న గ్రంథము లివి 1) చైతన్య వమ్ (సంస్కృత నాటకము ఇయ్యది - పూరి, మద్రాసు, రాజమండ్రి మొద పట్టణములలో విద్వాంసులచే ప్రదర్శింపబడినది ) 2) శ్రీనాథుని పల్నాటి చరితమునకు - మాత్రాఛందస్సులో సంస్కృతానువాదము 3) 'వైకుంఠ విలాసము' అను సంస్కృత శ్లోక ఆంధ్ర గేయ బద్ధమైన ఖండ కావ్యము భారతీయ వేదాంత పారిభాషిక పద కోశము (సంస్కృతాంధ్రములలో రచింప ది 5) జైన బౌద్ధాది అవైదిక దర్శన కోశము (సంస్కృతాంధ్రాంగ్లము ) 6) వైష్ణవ విశ్వాస ప్రాదుర్భావ వికాసములు (చారిత్రిక గవేషణము)

తెలుగులో ఇంకను వివిధ విషయములపై వ్రాయబడిన రచనలు మఱికొన్ని రేడియో ప్రసంగములు :- ఆకాశవాణి విజయవాద కేంద్రము ద్వారా పెక్కువేలనేక సంస్కృత ప్రసంగములు చేయబడినవి. ప్రస్తుతము సంస్కృత పరిచయ కార్య క్రమము నిర్వహింపబడుచున్నది

## శ్రీమాన్ దిట్టకవి లక్ష్మీనరసింహాచార్యులు



జననము – అంగీరస నామ సంవత్సర ఫాల్గుణ బహుళ సప్తమీ శనివారము (14-3-1933) జన్మస్థానము తెనాలికి సమీపమునఁ గల శ్రీరంగపురము జననీ జనకులు: లాయారమ్మ, యోగానందాచార్యులు గారలు

వంశము – తర తరముల నుండి శ్రీ మన్నారాయణుని పాంచరాత్ర శాస్త్రీను సారముగ అర్చించు దీక్ష కలిగినది

విద్యాభ్యాసము :– ఆంధ్ర, సంస్కృత, ఆంగ్ల, హిందీ భాషలలో విద్వాంసులు.

విద్యలు – ఆయుర్వేద, అలోపతి, హోమియోపతీ, వైద్య విద్యలలో నిపుణులు

అభిమాన విద్యలు – గ్రంథ రచనము, కవితా వ్యాసంగము, వాస్తు జ్యోతిషములు

రచనలు – పాంచరాత్రాగమమునందు 'భగవదారాధనము' అను గ్రంథమును, హోమియోపతియందు – 'మెదడువాపు' అను గ్రంధమును రచిం

ప్రకటించిరి ఆంధ్రపత్రిక, ప్రభ, జ్యోతి, చిత్రగుప్త మున్నగు పత్రికలలో బాల సాహిత్యము, విమర్శలు, శాస్త్రవిషయ చర్చలు, లేఖలు అనేకములు వీరివి ప్రకటింపబడినవి ప్రస్తుతము వీరు – గుంటూరు పాత్రాళెం గల శ్రీకోదండరామ స్వామివారి దేవస్థానమున అర్చక కైంకర్యము చేయుచు, శ్రీ పాంచరాత్రాగమ శాస్త్ర పరిశోధన గావించుచున్నారు

## డాక్టర్ తట్టా విజయరాఘవాచార్యులు

జననము :- 8-6-1959 జన్మస్థానము - కృష్ణాజిల్లా, చిన శ్రీరంగ పురము జననీ జనకులు :- వేంకట నరసమ్మ, గోపాలకృష్ణమాచార్యులు గారలు విద్యాభ్యాసము - కృష్ణాజిల్లా – జగ్గయ్యపేట జిల్లాపరిషత్తు ఉన్నత పాఠశాలలో పదియవ తరగతి వఱకు, అనంతరము 1967 వఱకు చిట్టి గూడూరు సంస్కృత కళాశాలలో విద్యాభ్యాసము – సాహిత్య విద్యా ప్రవీణలో ఉత్తీర్ణత 1981 నుండి 1988 వఱకు ఆంధ్ర విశ్వవిద్యాలయమునందు సర్వ దర్శన విభాగమునఅధ్యయనము, సంస్కృతములో - ఎం ఏ డిగ్రీ స్వీకరణము

పరిశోధన వ్యాస రచనలు :- 1) 1984 నుండి తిరుపతిలో కేంద్రీయ సంస్కృత విద్యాపీఠమునందు విశిష్టాద్వైత దర్శనమునపరిశోధనము త త్త్వార్థ షులు, చతుశ్శాస్త్ర పండితులు – 'తర్క వాచస్పతి' బిరుదాలంకృతులు, రాష్ట్రపతి బహుమాన గ్రహీతలు నగు శ్రీమాన్ N S రామానుజాచార్యుల వారి పర్యవేక్షణ మున 'వేదార్థ సంగ్రహ సమీక్షాత్మక మధ్యయనమ్' అను విషయముపై పరి శోధన వ్యాసము రచించి, Ph D డిగ్రీ నిమిత్తమై రాష్ట్రీయ సంస్కృత విద్యా పీఠమునందు 9-10-1986 తేదీన సమర్పించితి 2) ఆలిండియా ఓరియంటల్ కాన్ఫరెన్స్ జైపూరునందు – 'ఆత్మవిచారము' అను పరిశోధక వ్యాసమును సమ ర్పించిరి 3) ఆంధ్రప్రదేశ్ ఓరియంటల్ కాన్ఫరెన్సు గుంటూరులో – 'భక్తేః మోక్షసాధనత్వే వివిధాభిప్రాయాః' అను శీర్షికతో పరిశోధక వ్యాసమును సమ ర్పించిరి

పరిశోధనము - 'విశిష్టాద్వైతస్య ఆంధ్రాణాం యోగదానమ్' 'ఆంధ్రులు - విశిష్టాద్వైతము' అను విషయముపై ఇటీవల పరిశోధన చేసిరి

సంపాదకత్వము - శ్రీమాన్ శిరిశినహళ్ కృష్ణమాచార్యుల వారిచే ఆంధ్రీకరింపబడిన వేదార్థ సంగ్రహమునకు సంపాదకత్వము వహించి, దానిని 'ఆంధ్ర వేదార్థ సంగ్రహ' మను పేర టి టి డి వారి ఆర్థిక సహాయముతో 1986లో ప్రకటించిరి

వ్యాఖ్యానము - శ్రీ యామునాచార్యులవారి 'గీతార్థ సంగ్రహము'నకు వ్యాఖ్యానము రచించిరి

అనువాదము - 1) భక్తిసిద్ధాంత, 2) అష్టాక్షరీ మంత్ర మహాత్మ్యమ్ 3) సవిశేషం బ్రహ్మ 4) లక్ష్మీ పురుషకార వైభవము 5) విశిష్టాద్వైతమ్ 6) తత్త్వత్రయమ్ అను సంస్కృత వ్యాసములు, వానికి ఆంధ్రానువాదములు వీరిచే రచింపబడినవి

సంస్కరణము - 1) శ్రీనివాస రాఘవ విరచిత మగు 'రామానుజ సిద్ధాంత సంగ్రహః' 2) శ్రీ వాత్స్య వరదాచార్య విరచిత మగు 'రామానుజ సిద్ధాంత సారః' 3) శ్రీకృష్ణ తాతాచార్య విరచిత మగు 'తత్త్వ చంద్రికా' అను సంస్కృత గ్రంథములు వీరిచే సంస్కరింపబడి, ముద్రణకు సిద్ధమై యున్నవి 4) సురపురం శ్రీనివాసాచార్యులవారి జ్ఞాన రత్న ప్రకాశికా 5) షష్టి దర్పణమ్ అను సంస్కృత గ్రంథములను 6) నాయమాత్మా భాష్యము 7) శరణాగతి శబ్దార్థ విచారః' 8) 'ప్రపత్త్యనుపాయత్వ విచార' అను సంస్కృత ప్రకరణ గ్రంథములును 9) శుద్ధసత్త్వ రామానుజాచార్యులవారి 'రహస్యత్రయ మీమాంసా భాష్యమ్' అను సంస్కృత గ్రంథమును - ఇపుడు వీరిచే సంస్కరింపబడ చున్నవి

ఆంగ్ల వ్యాసములు – 1) క్రియేషన్ ఆఫ్ ది వరల్డు 2) గాడ్ అండ్ ‘ర్ 3) డాక్టరిన్ ఆఫ్ విశిష్టాద్వైత - అనునవి వీరి ఆంగ్ల వ్యాసములు

ఉద్యోగము – రాష్ట్రీయ సంస్కృత సంస్థానము - న్యూఢిల్లీ వారిచే ర్వహింపబడిన ఇంటర్వ్యూలో వీరు ‘సెలక్టు’ అయి, తిరుపతిలో కేంద్రీయ ంస్కృత విద్యా పీఠమున, విశిష్టాద్వైత విభాగమునందు 31-7-1987 తేదీన పన్యాసకులుగా నియుక్తులైరి ఇపుడీ విద్యా సంస్థ - ‘రాష్ట్రీయ సంస్కృత ద్యా పీఠ’ మను పేర వ్యవహరింపబడుచు, విశ్వ విద్యాలయ ప్రతిపత్తిని పొంది యున్నది

## శ్రీమాన్ కుంటిమద్ది శేషశర్మ (శేషాచార్యులు)



జననము – పరీధావి మాఘ బహుళ అష్టమి (8–2 1912) జన్మస్థానము – అనంతపురము జననీ జనకులు – శేషమ్మ, రంగాచార్యులు గారలు శ్రీమాన్ కుంటిమద్ది వేంకట రంగాచార్యుల వారికి శ్రీ శ్రీ శేషశర్మ గారిని బాల్యమునందే దత్తపుత్రులుగా గైకొనిరి

విద్యాభ్యాసము - ప్రాథమిక విద్యాభ్యాసానంతరము – పితామహులగు శ్రీనివాసాచార్యులవారి వద్ద కావ్య పఠనము, అనంతరము – తిరుపతి వేంకటేశ్వర సంస్కృతకళాశాలలో విద్యాభ్యాసము - సాహిత్య శిరోమణి’ పరీక్షలో ఉత్తీర్ణత అటుపిమ్మట బి విద్వాన్, స్వయం కృషితో S.S L C పరీక్ష ట్రైనింగ్, (రాజమండ్రిలో) తెలుగు ఎం ఏ వాల్తేరులో).

ఉద్యోగము :– అనంతపురము జిల్లాబోర్డు స్కూళ్ళలో 1937 నుండి – అపుడపుడు తాత్కాలిక సంస్కృత, ఆంధ్ర పండిత పదవి 1943 నుండి స్థిర

ఆంధ్ర పండిత పదవి అనంతపురము జిల్లా హైస్కూళ్ళలో 1971తో ధర్మ వరము జూనియర్ కళాశాలనుండి ఉద్యోగ విరమణము

రచనలు - (ముద్రితములు పద్య గ్రంథములు తెలుగు) 1) సుధా బిందువులు 2) తెనుగు తల్లి 3) రామిరెడ్డి 4) యతిరాజీయము (మూడు భాగములు) 5) కేశవ ప్రపత్తి 6) శ్రీనివాస కుసుమాంజనము 7) మిణుగురులు 8) హంస సందేశము ఉపళన కావ్యములు - గీతామృతము 10) వరకాల మర వైభవము 11) పరమార్థ దీపిక 12) రామాయణ పర్యాలోకనము 13) విశిష్టాద్వైత సిద్ధాంత దర్పణము - వివరణ తోటి పద్యానువాదములు - 14) న్యాస మంజరి (సంస్కృతము) 15) ముకుంద విలాసః 16) ఇందిరా వందనమ్ 17) మను సంభవః 18) విష్ణుచిత్తీయమ్ (అముద్రితము) 19) రాఘవేంద్ర విజయః 20) శ్రీనివాస ప్రణతిః 21) సుమతి శతకమ్ (అముద్రితములు) 22) శాంతి విలాసము 23) మేలి నోము 24) శరకోప వాగ్ఝరి 25) ఇందిరా వందనము 26) గోదావందనము 27) దయా శతకము 28, 29 30) కరావలంబన కనకధారా స్తవ, షట్పదీ స్తోత్రములు వైరాగ్య పంచకము 32, 33, 34 ఈశావాస్య, కేన, కఠ ఉపనిషత్తుల వివరణ పద్యానువాదములు వచనములు కాలక్షేప వ్యాసములు, భారతీయ సంస్కృతి, గురు దక్షిణ, విష్ణుచిత్తీయము, తాత మనుమని సల్లాపము, అలంకార విచారము, వ్యాకృతి బోధిని, గీతా నవనీతమ (గద్యము)

ఆంధ్రప్రదేశ్, సప్తగిరి, నృసింహ ప్రియ - ఇత్యాది పత్రికలందు అనేక పద్య గద్య వ్యాసములు, శతాధిక ఖండికలు, పద్యములు

సన్మానములు - అనేక ఉన్నత పాఠశాలలలో, లలిత కళా పరిషత్ [అనంతపురము] (బ్రహ్మశాలి) స్వతంత్ర వరకాల మఠము [మైసూరు]

## శ్రీమాన్ ప్రతివాది భయంకర వేదాంతాచార్యులు



జననము - పరీధావి నామ త్సర-నిజ ఆషాఢము [17-7-19 జన్మస్థానము సుబ్బమ్మపేట (టె తాలూకా శ్రీకాకుళంజిల్లా] జననీ కులు - చూడమ్మ, శఠకోప రామా చార్యులు గారలు ప్రస్తుత నివాసవ హైదరాబాదు

ఆంధ్ర, సంస్కృత, ఆంగ్ల, పి తమిళ భాషలలో వీరు విద్వాం కృష్ణా జిల్లాలో గల చిట్టిగూ గ్రామము, హైదరాబాదు, సికింద్రాబాదు నగరములందదును వీరు ఉపాధ్యా లుగా పని చేసిరి వీరు - సహజకవి, విద్యారత్న - అను బిరుదములను న దించిరి

ముద్రిత రచనలు :- పురుషోత్తముడు [ఆంధ్ర విశ్వ విద్యా పార్యము] 2 రామాయణ కల్పవృక్ష విమర్శ [1957 జూలై భారతి] 3 ఆ ముకుందమాలా కులశేఖర చరిత్రలు[1964] 4 ఆచార్య - జగదీశ చంద్ర [1971] సంవత్సరమున న్యూఢిల్లీలో - కేంద్ర ప్రభుత్వ విద్యాశాఖవారి ఆ పొందినది ] 5 భావక హృదయము [గీతా కావ్యము - ఆంధ్ర భగవద్గీత 6 ఆంధ్ర సుదర్శన శతకము

అముద్రితములు - 1 ఆచార్య జగదీశ చంద్రబోసు [గద్యము] 2 శాల [సికింద్రాబాదు నందలి మహబూబ్ కాలేజీ చరిత్ర )

సన్మానము - మాజీ మంత్రివర్యులు-ఆంధ్ర విశ్వ విద్యాలయ ఉపా లగు యం ఆర్ అప్పారావుగారి అధ్యక్షతన, వివేకానంద పరిషత్తువారిచే సన్మానము

# స వ ర ణ లు

| పుట | పం క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 19 | ప్రజంబున | ప్రజంబున |
| 17 | 2 | శంఖభృన్నన్దకి | శంఖభృన్నన్దకీ చక్రి |
| 18 | 0 | విశోదనః” | విశోధనః” |
| 28 | 12 | భారతే | భారతే |
| 28 | 18 | వృత్వాం | వృత్వా |
| 81 | 0 | భంగులుగా | భంగులుగా |
| 81 | 15 | రాజసంపదయు | రాజ్యసంపదయు |
| 82 | 6 | ఎవఁరేని | ఎవరేని |
| 88 | 5 | రిం దియా | నిరింద్రియా |
| 38 | 6 | అనిష్ట సుగందినః | అనిష్పన్నా సుగంధినః |
| 86 | 9 | భూతవే, | భూతతే. |
| 89 | 4 | విశ్వవేతాః | విశ్వరేతాః |
| 89 | 21 | సుముత్సాహో | మహోత్సాహో |
| 40 | 12 | స వర్దనః | సంప్రమర్దనః |
| 41 | 11 | సుప్రమత్తప్రతిష్ఠితః | స్మ్రవమత్తః ప్రతిష్ఠితః |
| 41 | 17 | మహర్థి బుద్ధా బుద్ధోత్మా | మహర్థిః బుద్ధో వృద్ధాత్మా |
| 47 | 15 | శ్వర్యరీ కరః | శ్వర్యరీ కరః |
| 48 | 5 | స్వత్వధాదారః | స్వత్వధాదారః |
| 50 | 10 | ఇచ్చే త్పురుషః | ఇచ్చే త్పురుషః |
| 54 | 21 | జ్ఞానుబు | జ్ఞానంబు |
| 61 | 19 | ప్రవర్తించినధి | ప్రవర్తించినది |
| 62 | 7 | శృకించి | శంకించి |
| 62 | 22 | భయపడలేరుగదా ! | భయపడలేదుగదా ! |
| 63 | 8 | శ్వావ | శ్వాన |
| 68 | 18 | చున్నారు. | చున్నారు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 71 | 8 | కాని | కాని, |
| 71 | 13 | నందునూ, | నందును, |
| 72 | 18 | గావించును | గావించును |
| 73 | 6 | ఆవరముగా | ఆవరణముగా |
| 77 | 15 | నాచ్చి | నాచ్చి |
| 77 | 19 | తేజ శ్యాలి | తేజశ్శాలి |
| 92 | 11 | భారతేవిహాసము | భారతేతిహాసము |
| 93 | 4 | వృధివీ | వృథివీ |
| 105 | 13 | షదూర్మి | షడూర్మి |
| 105 | 19 | యాగతే | యాచతే |
| 108 | 11 | ముత్త్రిమమ్ | ముత్తమమ్ |
| 108 | 13 | జగ త్తయమ్" | జగ త్త్రయమ్ |
| 112 | 4 | విష్ణ్యంశమును | విష్ణ్వంశమును |
| 113 | 16 | బహాదిధై | బహువిధై |
| 115 | 7 | రనియందురు | అని అందురు |
| 115 | 19 | నెయ్యి | నేయి |
| 116 | 7 | యానొరు ముట్టిలనె | యానొరు ముట్టిలనే " |
| 116 | 15 | నమ్మాళ్వారు | నమ్మాళ్వారులు |
| 117 | 2 | ఆళ్వారులు- | ఆళ్వారులు |
| 118 | 11 | నాయకగా | నాయకుడుగా |
| 120 | 8 | యాదనాభ్యుదయ | యాదవాభ్యుదయ |
| 123 | 9 | గ్రందములను | గ్రంథములను |
| 134 | 8 | వ్రిదమ | వ్రిథమ |
| 134 | 19 | కవియుగాంతమును, | కలియుగాంతమును, |
| 137 | 17 | వాగు కొందురు | దాగికొందురు |
| 138 | 3 | మ్లేచ్ఛులను | మ్లేచ్ఛులను |
| 143 | 4 | ఉపదేశము | ఉపదేశము |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 144 | 18 | పదస్త్రాశ్ | పరస్త్రాశ్ |
| 144 | 22 | పట్టుచున్నవను | పుట్టుచున్నవను |
| 145 | 18 | పరమాత్మమే | పరమాత్మయే |
| 157 | 15 | అర్థము | — |
| 158 | 20 | సిద్ధంచుటలో | సిద్ధించుటలో |
| 159 | 17 | సృష్ట్యారంభ | సృష్ట్యారంభ |
| 162 | 8 | నుండదు | నుండవు |
| 182 | 6 | యధేచ్ఛయముగ | యథేచ్ఛగ |
| 182 | 14 | విద్య | విద్య |
| 198 | 7 | గమనము | గమనము |
| 198 | 22 | స త్తి | సంపత్తి |
| 194 | 10 | కలవాడై | కలవాడై, |
| 194 | 16 | లందును | లందును, |
| 201 | 10 | సు జూదశాల | జూదశాల |
| 202 | 8 | త్వరయున్ | త్వరయున్, |
| 202 | 11 | శ్లాఘ్యయూ' | శ్లాఘ్యమౌ' |
| 225 | 7 | కొన వలెను | కొనవలెను |
| 226 | 8 | వేదమంత్రమును | వేద మంత్రములను |

# శ్రీ రామానుజ కీర్తి కౌముది

## పదాన్వ శేఖరులు

Professor NARENDER P REDDY Ph D ACRON (U S A)
Dol s 300

## మహారాజపోషకులు

1 శ్రీమాన్ చిలకమర్తి సత్యలక్ష్మణాచార్యులు, Retd, I T O గుం
2 డాక్టర్ కిడాంబి సత్యనారాయణాచార్యులు M S, M N A N S ,
3 శ్రీ వి మధుసూదనరావు, (రిటైర్డు జిల్లా రిజిస్ట్రార్)
4 శ్రీమతి కిడాంబి సుశీలాదేవి
5 శ్రీమతి - గుడివాడ హేమమాలినీరాణి, M A (లెక్చరర్ )
6 డాక్టర్ వి గోపాలరావు, M D
7 శ్రీమాన్ కిడాంబి వేంకట నరసింహాచార్యులు పెంట
8 శ్రీ ఘండికోట వెంకట సుబ్బారావు ప్రశాంతి నిల
9 డాక్టర్ శ్రీ పెరుంబూదూరు శ్రీరంగాచార్యులు, M A, Ph D హై
10 శ్రీమాన్ S A T సింగరాచార్యులు (ఆస్ట్రేలియా) వె
11 శ్రీ వడ్లమూడి వేంకటేశ్వరరావు విజం
12 శ్రీమతి - రావు రమాదేవి (MOBILE) అ

## రాజపోషకులు

1 శ్రీమాన్ కందాడ శ్రీనివాస రాఘవన్, B Com. గుం

## పోషకులు

1 శ్రీమాన్ నందూరు బుచ్చిరామానుజాచార్యులు గుం
2 డాక్టర్ సి రామదాసు, D M & E D M.R.
3 శ్రీమతి - కిడాంబి వెంకట లక్ష్మమ్మ

| | | |
|---|---|---|
| 4 | శ్రీమాన్ నంతూరు సత్యనారాయణాచార్యులు | గుడివాడ |
| 5 | డాక్టర్ సముద్రాల రంగరామానుజాచార్యులు, M A Ph D | కొవ్వూరు |
| 6 | శ్రీమాన్ చిత్రకవి ఆత్రేయ, M A | విశాఖపట్టణము |
| 7 | శ్రీ వి పాండురంగరాజు | ,, |
| 8 | శ్రీమాన్ కందాడై అప్పన్ కృష్ణమాచార్యులు, M A | వాత్రేరు |
| 9 | శ్రీమాన్ కె వి రాఘవాచార్యులు, M A B Ed | హైదరాబాదు |
| 0 | శ్రీమాన్ టి కె రాఘవన్, M A | , |
| 1 | కుమారి - సి సీతాదేవి(జాయంటు కమీషనర్, కమర్షియల్ టాక్సెస్) | ,, |
| 2 | శ్రీమాన్ యస్ సి వరదాచారి | మద్రాసు |
| 13 | శ్రీమాన్ యస్ సి గోపాలస్వామి | ,, |
| 14 | శ్రీమాన్ సౌమిత్రి రంగాచార్యులు, M A, B Ed | హనుమకొండ |
| 15 | శ్రీమాన్ కె, గోపాలాచార్యులు | నిట్టూరు |
| 16 | శ్రీమాన్ కె కృష్ణమాచార్యులు | ,, |
| 17 | శ్రీమాన్ ఆర్ జె పార్థసారథి | ,, |
| 18 | శ్రీ ఉప్పులపాటి గోపాలకృష్ణ | విజయవాడ |
| 19 | శ్రీ కె సుందరరాజు (అసిస్టెంట్ ఇంజనీర్ - టెలికమ్) | ఒంగోలు |
| 20 | శ్రీ టి రాంప్రసాద్ | ఖామూరు |
| 21 | శ్రీ మెట్టుపల్లి వెంకయ్యపంతులు | కిలావనపర్తి |
| 22 | శ్రీమాన్ యన్ ప్రభాకరాచార్యులు, H M. | కరీంనగర్ |
| 23 | శ్రీ యం కృష్ణారెడ్డి, B.Sc, LL B అడ్వొకేట్ | ,, |
| 24 | శ్రీమాన్ యన్ సి వి నరసింహాచార్యులు, M A, B O L | తిరుపతి |
| 25 | డాక్టర్ కె రమారెడ్డి (మానస హాస్పటల్) | రాజమంద్రి |
| 26 | శ్రీ ఆర్ సీనయ్య | చందుపట్ల |

## విరాళములు

| | | |
|---|---|---|
| శ్రీమాన్ C S లక్ష్మణాచార్యులు, Rtd I T O | గుంటూరు | రూ. 1000 00 |
| డాక్టర్ : C రామదాసు, (వెంకట్ క్లినిక్) | ,, | 500 00 |
| శ్రీమాన్ - తె కం గోపాలాచార్యులు, నడిగడ్డపాలెము | | రూ 500-00 |